నోరి (ప్రాచీనము); నోటి; గోరు - గోరి (ప్రాచీనము); గోటి; కోరు (కోరికి= భాగమునకు); పేరు (పేరికి); వేరు (వేరి); వేలు (వేటి, వేటిటి); ఔప విభక్తికములు.

ఉదా. ఎదురన్ (భార. ద్రో. IV. 261); కుదుటన్ (భార. విరా. V. 401); కుదుటఁగూడు నెట్టి కుడుచువారలు (భార. ఉ. II. 9); తేరికూబరము (భార. భీ. III. 197); మున్నీటిచేరువ (భార. అను. I. 181); నీరిలోను (భార. అను. I. 232); నీరున్ (భార. I. 255); నడునీటన్ (భార. ద్రో. I. 26.); నీటిప్రాలు (భార. శాం. I. 207); పాలమున్నీటిలోపల (భాగ. VIII. 176); నుదుటన్ (భార. ద్రో. IV. 47; భాగ. VII. 61); వెన్నెత్తుటన్ (భార. ద్రో. II. 251); నెత్తురు వెల్లులు (భార. ద్రో. III. 103); నెత్తురుటేరు, భార. ద్రో. I. 146), నెత్రుటేరులు (భార. భీ. III. 225); నెత్తుటఁజొత్తిల్లి (భార. ద్రో. II. 137); నోరువ్రేయింతుఁ జుమ్మ (భార. ద్రో. V. 365); నోరికండ (భార. ద్రో. II. 25); నోరికొలఁదుల్ వచరించెదు (భాస్క. యు. 322); తెలినోటినరుఁడు (ఆంధ్రనా. శత. 38); మాణికమను పేరితో (S. I. I. తంత్రీపాలుండను పేరుతోడ (భార. విరా. I. 100); 700); మాపేరిటన (S. I. I. V. 874); కృతయుగంబు పేరింటియుత్తమ కాలంబు (భార. శాం. VI. 410); వారుగలరు వీరుగలరు పోరికినని చెప్పెదవు (భార. ఉ. IV. 206); తంత్రీఁపాలు డను పేరితోడ (భార.విరా. I.100)

'కూఁతురు' పదము షష్ఠియం దివర్ణము చేరును. కాని, తృతీయా సప్తములం దౌపవిభక్తిక పదములకుఁ గలుగు కార్యము లీపదమునకుఁ గలుగవు. కావున దీని నౌపవిభక్తికపద మనఁగూడదు.

(ఇ) నల్లేరు, గన్నేరు, పల్లేరు, పైరు, చూరు, కారు, కదురు, వెదురు లౌపవిభక్తికములగునో కావో చెప్పలేము. 'నల్లేటి, గన్నేటి' అని నేను వినలేదు. 'పల్లేటికాయ' అని యే మండలమునందయిన నందురేమో. 'చూరు' కు 'చూఁడి, చుండి' అనునవి షష్ఠ్యేకవచనరూపములై యుండ వచ్చును. చూ. చూరెలుక, చూఁడెలుక, చుండెలుక. 'కదుటినూలు' అని యక్కడక్కడ నందురు. 'వెదుటి' అను రూప ముండ దనుకొందును. 'పైటిగాలి' అని వ్యవహారమునఁ గలదు.

(ఈ) 'చిన్నారి, పొన్నారి' (వరాహ. VI. 52; కాశీ. I): - ఇవి 'చిన్నారు, పొన్నారు' అను క్రియాజన్య విశేషణములపై ఇ వర్ణము చేరుట వలన నేర్పడినవి.

(ఉ) '—గారు' అను పూజార్థక బహువచన ప్రత్యయ మాప విభక్తిక లక్షణములఁ గలిగియున్నది. ఓజళరాజుంగారి కొమారుండ్లు శ్రీరంగ రాజులుంగారు (S. I. I. IV. 279); తిరుపణపిళ్లంగారికి (S. I. I. IV. 282); యల్లా భక్తునింగారికి (S. I. I. IV. 702); తమ తల్లిదండ్రింగారికిన్ని (S. I. I. IV. 789); మంచెనంగారిచేత క్రయబద్ధమయిన (S. I. I. V. 137); అరియమరాజుగారి పరమాప్తుఁడు (వృషా. శత. 100);—కాని '-గారు' కుఁ దృతీయాసప్తములందు '-గారన్' అను రూపము గలుగదు.

(ఊ) 'నగరు' అను తద్భవపద మాపవిభక్తికము: నగరిశిఖరాన (S. I. I. IV. 938); మొద.

12. (i) 'ల' వర్ణాంత పదములలో ఆ (అ) వ (వు) ల (అవ్వల) - ఆ (అ) వలి (అవ్వలి); ఈ (ఇ)వ (ఇవ్వ)ల-ఈ(ఇ)వ (ఇవ్వ)లి; ఏవ (ఎవ్వ)ల-ఏవ (ఎవ్వ)లి; ఒడిసెల (ఒడిసెంటన్); కుచ్చెల - కుచ్చెంటన్; దా (డా)పల-దాపలి (-టి); వలపల - వలపలి (-టి); మోసల-మోసలి; నెవ్వల-నెవ్వలి; పింగల-పింగలి;ముంగల - ముంగలి అనునవి యాపవిభక్తికములు.

ఉదా. అవులన్ (భార. శాం. V. 395; అను. II. 110; అను. V. 170; స్త్రీ. II. 45); అవ్వలన్ (భాగ. I. 327); అవ్వలిచన్ను (మను. I. 3); అవ్వలిపని(భాస్క.యు.4); ఆవల (భార. అను. V. 170); ఇవులన్ (భార. II. 110; అశ్వ. I. 63); ఈవల (నిర్వ. VI. 7); దాపలికొమ్ము (భార. భీ. II. 98); దాపలిచేయి (భార. విరా. I. 211); దాపటన్ (భార. భీ. II. 42; ద్రో. III. 47; అను. II. 310); నెవ్వలిసన్ను (కుమా. భా. II. 12, 169, 179); పింగలిగాన్ (నిర్వ. VI. 146); ముంగలిగా (నిర్వ. VI. 146), ముంగలన్ (భాగ. I. 105; వృషా. శత. 86); మోసలన్ (భాస్క. బాల. 94); కోటస్థలంబులోపలి యర్లగడ్డగ్రామం (S. I. I. IV. 981); కడుపులోపలిబిడ్డ (భార. అను. I. 113); నగళ్లలోపలిమాట (భార. విరా. I. 130); ఇంటిలోపలఁబోతె (నిర్వ. IV. 61); వలపలిదిక్కు (భార. విరా. I. 291); వలపటన్ (భార. విరా. IV. 249; భీ. II. 42; ద్రో. III. 47; అను. II. 310.)

(ii) 'లి' వర్ణాంతములలో 'అంగిలి, అంబలి, ఆఁకలి, కొడవలి, గొడ్డలి, తిరుగలి' అను నవాపవిభక్తికములు: అంగిటి, అంబటి, ఆఁకటి, కొడవటి, గొడ్డటన్, తిరుగటన్.

ఉదా. ఆఁకటిప్రొద్దు (భార. విరా. II. 215); కౌఁగిటన్ (భాస్క. సుం. 14); చెంగటి యెలమావి (మను. III. 75); చెంగటన్ (భాగ. I.16); దోయిటన్ (భార. శాం. V. 205); నాఁగటన్ (భాస్క. బాల. 668); పిడికిటి

పోటు (భాగ. I. 168); పుక్కిటిబంటినీరు (హరవి. II. 27); పుక్కిటిణము (హరి. పూ. I. 4), పుడిసిటిలోనన్ (భాస్క. సుం. 13); పొదిగిటన్ (భార. శాం. III. 209); తలవాకిటి బోరుఁదలుపు (కళా. VI. 129); వాకిటికిన్ (భార. శాం. V. 320; భాస్క. కి. 135);-కాని, వాకిలిం బుచ్చుము (భార. ద్రో. II. 270); —'-లి' వర్ణాంతశబ్దములు తొలుత 'ల' కారాంత హలంత శబ్దములు. వానిపై నొపవిభక్తిక 'ఇ' త్వముచేరఁగా తెలుఁగునఁ బ్రథమైకవచనమున నవి నెలకొన్నవి.

(iii) 'లు' వర్ణాంత పదములలో అసలు, ఆలు, కడలు, ఒడలు, కాలు, కుందె(-ందే)లు, కేలు, చేదలు, చాలు, చూలు, చెలియలు, తాఁబే(-మే) లు, తోఁడేలు, నూలు, నొగలు, నొసలు, పగ (-వ) లు, పాలు = భాగము, ప్రోలు, మేలు, మొదలు, ఱోలు, వ్రేలు, అనున వౌపవిభక్తికములు: అసలి, ఒడలి, కడలి, కాలి, కుందె (-ందే)టి; కేలి, చదలి, చాలి, చూలి, తాఁబే (-మే)టి; తోఁడేటి, నొసలి(-టి), పాలి, ప్రోలి, మేలి, మొదలి(-టి); ఱోలి (-టి); వ్రేలి—అసలు, నొసలు, ల 'ల' వర్ణమునకు 'ట' దేశముగూడ నగును: అసటి, నొసటి; ఆలు, కోడలు, చెల్లెలు, చెలియలు, మఱఁదలు, అను వాని షష్ఠియందు ఇ వర్ణము వచ్చును. తృతీయాసప్తములం దౌపవిభక్తిక పదములకుఁ గలుగు కార్యములు వీనికి రావు.

ఉదా. (1) సవతాలి ప్రజలు వ్రుందనేర్తురే (భార. భీ. I. 168; ఈగ కాలి యంతయేనియు (భార. శాం. II. 335); నలుగాలివానన్ (భార. శాం. I. 71); మోడ్పుఁగేలితోన్ (భార. అను. IV. 443); చదలికి (భార. అర. VII. 21); చెలియలికట్ట(భార. భీ. II. 217; III. 241; ద్రో. I. 202); చెలియలికి (భార. ద్రో. II. 140); మొలనూలిమణులు (భార. స్త్రీ. II. 133); పత్తినూలిప్రువ్వ (భార. అను. V. 230); నొగలన్ (భార. భీ. III. 260); పట్టపగలింటి సూర్యునిపగిది (భార. కర్ణ. III. 18); పట్టపవలింటి సూర్యుని (భార. ద్రో. IV. 231); పగలింటియాహవము (భార. సౌ. I. 146); పాలి సమానము (భార. అను. V. 34); పాలివాఁడు (భార. ఆశ్ర. I. 38); పాలన్=పాలతో (భార. అను. V. 273); పాలికిన్ = ఒద్దకు (భాగ. III. 19); పాలిటి (భాగ. I. 522); మేలిచీరలు (భార. అను. IV. 359); కాని, మేలునకు (భార. అను. IV. 326); మొదలిరాజు (భార. కర్ణ. II. 397); మొదలి నాలవుపాలు (భార. శాం. V. 136); మొదలింటనుండియున్ (భార. విరా. II. 169); మొదలిటి (భార. విరా. I. 179); మొదటి అనున దర్వాచీన రూపము; మా మొదలిటివారు = మాపూర్వులు (భార. విరా. I. 179);

చూటితో (హరి. పూ. V. 246); ఆలన్ (హరి. పూ. V. 243;) భార. విరా. V. 35); నిన్ను జట్టనవ్రోలనుం జూపవచ్చునే (భార. ద్రో. II. 304).

(iv) 'తొల్లి' ఔపవిభక్తికాంతము: తొల్లిటి, తొంటి, (భా. భీష్మ. I. 219;) అను. V. 91.) తొంటి విధంబు (భార. విరా. I. 96; IV. 96; భీ. I. 219; అను. V. 91; తొల్లిటి (భాగ. I. 241.) 'ఎల్లికి, ఎల్లిటి(-ంటి)' అని షష్ఠీ రూపము: నేఁటి యెల్లింటిలోపల – (భాగవ. XI. 1593); నేఁటి యెల్లిటిలోనన్ (భార. విరా. V. 301; నన్నయ 'నేఁట నెల్లిటన్' అనును.) కాని, 'ఏల్లి నేఁటిలోన' (నిర్వ. V. 108); 'ఎల్లిట నేఁటన్' అని నన్నయ యును. ఎల్లి ప్రొద్దున (భార. II. 57); 'ఎల్లిటి ప్రొద్దున, అని కాని, ఎల్లిట బ్రొద్దున' అని కాని యనవచ్చును. ఎల్లి యతనితో (నిర్వ. VII. 28); ఇచట 'ఎల్లి' కళీగా వాడఁబడినది; అని ద్రుత ప్రకృతికము గూడనగునా? 'వాఁ డెల్లీడుండును, వాఁడెల్లీడుండఁను; ఎల్లిపోయెద, ఎల్లిఁబోయెద' అను వానిలో నేది సాధువు? 'ఎల్లిటఁబోయెద' సాధువే.

(v) 'ల్లు' అంతమందు గలవానిలో 'ఇల్లు, కల్లు = ఱాయి, పల్లు = దంతము, ముల్లు, విల్లు' ఔప విభక్తికాంతములు: ఇంటి, కంటి, పంటి, మంటి, వింటి (భా. విరా. V. 106); వింటికోపునన్ (భాగవ. I. 473); వింటి కొమ్ములు (భా. ద్రోణ. IV. 222); వింటివాఁడు (భార. విరా. V. 136); కాని' విల్లు నఱిముఱిం ద్రుంచెన్' (భా. కర్ణ. I. 128;) పాఠముతప్పు, 'వింటిన్' అని యుండవలెను. తీవయింటికి (భా. విరా. II. 308.) ఇంటింటన్ (భాగవ. I. 265); ఇంచిలోపలఁబోలె (నిర్వ. IV. 61); పంటికొద్దిని (రాధా మా. II, పు. 18).

(12) (i) శకటరేఫాంతశబ్దములలో 'డ (ద)గ్గఱ' అనునది 'డగ్గఱు' అను ధాతువునకుఁ దుమున్నర్థకరూపము. ఇది 'ముందఱ'ను పోలియుండుటచేఁ గావలయు విశేష్యమను భ్రమను గల్పించుటచే దానిపై విభక్తి ప్రత్యయ ములను తెనుఁగువారు చేర్చుచు వచ్చిరి. 'ముందఱను, ముందఱికి' అనునట్లే 'దగ్గఱకు, దగ్గఱికి' అను రూపములును దెనుఁగునఁ జేరినవి. 'ముందఱ' అను దానికి 'ముందఱు' అనునది పూర్వరూపము; 'మందఱు మఱంది' (S. I. I. IV. 667); ఔపవిభక్తికము: ముందఱికి, ముందటికి: ముందటన్ (భాగ. III. 169); ముందటి దెసను (భార. ద్రో. III. 47); 'పాఁతఱ' ఔపవిభక్తికమా? "పతిగలనేరినం గొలుచు పాఁతటికిం గలదే తలం పఁగన్" అను నుత్తర హరివంశపు ప్రయోగము కలదు గాని యది పాఁతఱ' యౌపవిభక్తిత్వమును నిర్ణయింపఁజాలదు. నేఁటి వ్యవహా

రమున నా పద మాాపవిభక్తికము కాదు. 'పడుమటి'కుఁ బూర్వరూపము 'పడమటి' అయి యుండవలెను. అరవమున దీని రూపము 'పడుఙ్ఞాయిరు', దీని ప్రథమేతర విభక్తి ప్రాతిపదిక రూపము 'పడుమటి (S. I. I. V. 14); రేపుదొడంగి పడుమటిజాామునకు భార. (అశ్వ. IV. 221);

(ii) - 'ఱు' వర్ణాంత శబ్దములలో 'ఏఱు (ఏటికి), మాఱు (మాటికి), కోనేఱు (కోనేటి)' అనున వాాపవిభక్తికములు. సెలయేటి (భాగ. VIII. 49); మాఱు తడవ మాటికి; 'మాటి మాటికిన్' (భాగ. VI. 39 భార. ద్రో. II. 13); ముమ్మాాటి జలపానము (భార. అను. III. 285); మాఱు (-వేఱు) పదనకు విశేషణ రూపము 'మాఱట'; ధర్మవేత మాఱట తనువు (భార. ఆశ్ర. iI. 77); మాఱట నోరిదానను (భార. ఉ. III. 107); మాఱట రుద్రుఁడు (భాగ. IV. 107; మాఱటమూర్తి (భాగ. X. II. 3); మాఱట చేతులు ( హరి. పూ. I. 24);

(iii) - 'ఱు' అంతమందుగల పదములలో 'అఱు, కఱు, కుఱు, కొఱు, గొఱు, పఱు, మఱు, మిఱు, వఱు' అనునవాపవిభక్తికములు. ఇందు 'మఱు' అనునది 'పఱు'కు రూపాంతరము: పస్సుంబఱు పసుమఱు, మొదలగు మార్పుల మూలమున నిదియేర్పడినది: పస్సుంబఱితి వారి (S. I. I. V. 147); వెలుదుఱితిందూాప్పర్గాన (S. I. I. V. 151; 'వెలుదుఱుతన్' అని మొదటి రూపము); అఱుతి తులసిపూసలు (భాస్క. బాల. 45); గంగకఱుత (S. I. I. IV. 662); మిఱుతన్ (భార. శాం. III. 308); కొఱతన్ (వసు. I. 8); అర (అఱ్) తన్ (రాఘ. పాం.), అనునవి కొఱుతన్, అఱుతన్, అని యుండవలయును గాని వ్యవహారము ననుసరించియు, శ్లేషకొఱకును నా కవులు వానిని నకార మధ్యమములుగ వ్రాసినారు. 'వఱు': వఱుత= వఱుదన్ = వఱదన్ = *వఱదన్ లేఖక కల్పితము (భార. శాం. III. 56); 'వఱదన్' అను రూపము నుండి 'వఱద' అను ప్రథమైక వచన రూపమేర్పడినది.

(అఱుతన్, కఱుతన్, కుర్తన్, కొఱ్తన్, గొర్తన్, పఱుతన్, మర్తి, మిర్తి, వఱుతన్.

(13) 'ఒడలు' పదమున కాధునికరూపమగు 'ఒళ్లు'కు 'ఒంటిని, ఒంటన్, ఒంటికోసము, ఒంటినుండి, ఒంటి, ఒంటన్' అను నౌపవిభక్తిక రూపములు కలిగినవి.

(14) పైఁజెప్పిన శబ్దములుగాక యుమహత్తులగు సంఖ్యావాచక శబ్దములన్నియు నౌపవిభక్తికములే;

ఒకఁడు—ఒకటి; రెండు—రెంటి; మూఁడు—మూఁటి; నాలుగు—నాలుగిటి(-ంటి), ఏను—ఏనిటి(-ంటి) కి;ఐదు-ఐదిటి(ంటి)కి,ఆఱు- ఆఱిటి(-ంటి) కి; ఏడు-ఏడిటి (-ంటి) కి; ఎనిమిది- ఎనిమిదిటి (-ంటి)కి; తొమ్మిది-తొమ్మిదిటి (-ంటి)కి, పది - పదిటి (-ంటి - యింటి)కి; ఇట్లే 'ఇరువది' మొదలయినవి; నూఱు-నూటికి; నూఱిటికి (ంటి) కి; వేయి - వేయిటి (-ంటి)కి; అన్ని, ఇన్ని, ఎన్ని,కొన్ని—అ (ఇ, ఎ, కొ)న్నిటి(-ంటి)కి; వెక్కు - వెక్కిటి (-ంటి)కి; మొద. కాని, 'వెక్కున్' (భా. ద్రోణ. II. 51) = వెక్కిటిన్, 'తక్కు' కూడ 'వెక్కు' వంటిదే- 'తక్కటియింతి'(భా. అను. V. 287); తక్కటివి, (భా. అశ్వ. II. 29); తక్కటిదొరలు (భా. ఉద్యో. IV. 127); తక్కటి (భా. కర్ణ. I. 37), తక్కటివారు (భా. ఉద్యో. I. 59;విరా. V. 265); కాని, తక్కున్నదిశల్ (నిర్వ. V. 44); ఇట్లే 'తక్కుంగల' మొదలయినవి. 'వెల్లు' ఔపవిభక్తికము కానట్లు తోఁచుచున్నది.

* సంఖ్యావాచకపదము లౌపవిభక్తికములుగ వ్యవహారమున నెలకొని యుండుటచేఁ దత్సామ్యమున సంస్కృతశబ్దమగు 'అనేక' అనుదానిని గూడ నౌపవిభక్తికముగ నేఁడు తెనుఁగువారు వ్యవహరించుచు 'అనేకింటికి' అనుచున్నారు. ఈ రూపమాధునిక గ్రంథములందు కానవచ్చుచున్నది. వ్యావహారికభాషలో వ్రాయఁబడిన కొన్ని ప్రాచీనగ్రంథములందును నీ రూపము గాన్పించుచున్నది.

మహద్వాచక సర్వనామ పదములలో తొలుత నమహద్వాచకమయిన 'ఒకఁడు' అనునది మహద్వాచకపద మయినపిదప 'ఒకరుఁడు' అను మహద్వాచకపదము షష్ఠీరూపమగు 'ఒకరు' అనునది బహువచన రూపముగ నిలిచినప్పు డది యౌపవిభక్తికముగ వాడుకయందు నిలిచినది: ఒకరిని, ఒకరికి, మొద. కాని, తృతీయా సప్తములందు దీనిపై 'అన్' అనిరాదు. ఇద్దఱు, ఇరువురు, అందఱు, కొందఱు మొదలగు మహద్వాచక పదముల ప్రథమేతర విభక్తులపై తొలుత 'ఇ' వర్ణముచేరుచుండుట లేదేమో. కాని, పిల్లలమఱ్ఱిపిన వీరభద్రుని కాలమునాఁటికి 'ఇ' వర్ణ మీశబ్దములపైఁ బ్రథమేతర విభక్తులందు స్థిరపడిన దనుటకు "దనుజుఁబరిమార్చి యందఱి, కిని దానవబాధఁ దీర్చి -కృతకృత్యుండై" అను శకుంతలాపరిణయ ప్రయోగ మాధారముగానున్నది. అంతకుఁ బూర్వమందును నెంతో కాలమునుండియు శిష్టవ్యవహారమున నది యుండకుండినచో గ్రంథముల కెక్కుట సంభవింపదు. ఇద్దఱకు, ముగ్వురకు, అందఱకు మొదలగు రూపములతోఁబాటు 'ఇద్దఱికి, ముగ్గురికి, అందఱికి' మొదలగు రూపములును గ్రంథములందు చేరినవి. అందు మొదటివి

కేవల గ్రాంథికములు; వ్యవహార భ్రష్టములు; రెండవవి గ్రంథములందును శిష్ట వ్యవహారమునందును నున్నవి.

(15) సంఖ్యావాచకములు కాని తక్కిన సర్వనామములలో మహతీతరామహద్వాచకములగు అది,ఇది,ఏది, అనునవి యౌపవిభక్తికము: ద్వి. దానిన్, తృ. దానన్, ష. దాని, స. దానన్.–'వారు'శబ్దమువైఁ బ్రథమేతరవిభక్తులం దిత్వము చేరును: వారికి,వారిచే మొద. ఈరూప సామ్యముచేతనే 'ఇద్దరికి, అందరికి' మొదలయిన రూపములు ప్రచారములోనికి వచ్చినవి. 'అవి, ఇవి, ఏవి' యను నమహద్వాచక శబ్దముల మీఁదను 'టి' వర్ణము చేరి 'వాటి, వీటి, వేటి' అను రూపము లర్వాచీనకాలపు గ్రంథములందు ప్రయుక్తములై యున్నవి. ఇవి వ్యవహారమునఁ జిరకాలమునుండియుఁ గలవు, ఈ 'టి' వర్ణము ద్రావిడ సంప్రదాయము ననుసరించి వచ్చినది. అరవము: ప్ర. అవై; (తె. అవి) ద్వి. అవట్రై = అవట్రై = అవట్టై (తె. ప్రాచీనము: వానిన్; ప్రాచీనకాలము నుండియు మాండలికము, అర్వాచీనకాలమున గ్రాంథికము కూడను: వాటి ని); ష. అవట్రుక్కు = అవట్రుక్కు = అవట్టుక్కు (తె. రాయలసీమ వ్యవహారము: అవిటికి, ఇవిటికి, ఎవిటికి; ఇతర మండలములందు 'వాటి'కి; ఇది అర్వాచీనకాలమున గ్రాంథికముకూడను; – వానికి అనునది ప్రాచీనరూపము*); మొద. కాని, యిందొక విశేషమున్నది; తృతీయా సప్తములందు వీనికి 'వానన్, వీనన్, వేనన్' అను రూపములుండఁగా 'వాటన్, వీటన్, వేటన్, అను రూపములు మాత్రము కలుగలేదు.

'వీటి'లో అరసున్న యుండవలయునేమో తెలియదు. అప్పకవి "వీటిలోపల నొక మూఁటిచే నడిలేని హీనపాదము ముందు గానఁబడును" అని తన ఛందోగ్రంథమునఁ (IV. 270) బ్రయోగించినాఁడు. దీనినిబట్టి యిం దరసున్నయుండవలెనని తోఁచుచున్నది. అప్పుడు 'వీనిటి' అనురూపము నూహించుకొనవలసి యుండును. "వీటి సాటిని మేచి నీబోటి బోటి" (ఉషాక. III. 52) ఇచ్చట 'బోటి'లోనరసున్నయుండవలసిన చో 'వీటి'లోఁ గూడ నుండవలెను.

ఔపవిభక్తిక శబ్దములకుఁ బ్రథమేతర విభక్తులందు గలుగు రూపము లీక్రింద వివరింపఁబడుచున్నవి:

1. (అ) 'తూఁటి' మొదలగువాని కిత్వంబగును: తూఁటు – తూఁటి; కుంటు – కుంటి; గంటు – గంటి; చోటు – చోటి; అచ్చటు, ఇచ్చటు, ఎచ్చటు – అచ్చటి, ఇచ్చటి, ఎచ్చటి; అదను – అదని; గూను – గూని; చేను – చేని; జీను – జీని; మేను – మేని; మ్రాను – మ్రాని; లోను – లోని; వలను –

వలని; నడుము - నడిమి; ఊరు - ఊరి; తేరు - తేరి; కోరు = భాగము - కోరి; పేరు - పేరి; వేరు - వేరి; ఆ (ఈ, ఏ) వల -అ (ఈ, ఏ) వలి; కడలు - కడలి; కాలు - కాలి; చాలు - చాలి; చూలు -చూలి; సాలు = భాగము - సాలి; మేలు - మేలి; వ్రేలు - వ్రేలి. (ఆ) పేరు, వేఱు లపై 'ఇటి', 'ఇంటి' అనునవికూడఁ జేరును: పేరి, పేరిటి, పేరింటి; వేఱు, వేఱిటి, వేఱింటి.

2. -డ, -ండి, -డి, -ఁడు, -ండు- -డు, -ఱు, అను వర్ణము లంతమందుగల యాపవిభక్తిక శబ్దములకుఁ బ్రథమేతర విభక్తుల ప్రాతిపదికమున 'డ, ఱ' లకు 'ట' కార మాదేశము కాఁగా, దానిపై 'ఇ' వర్ణము చేరును; తక్కెడ - తక్కెటి; రేగ (వ)డ - రేవటి; కొండి - కొంటి; రొంఢి - రొంటి; అంగడి - అంగటి; కావడి - కావటి; గొంగడి - గొంగటి; లేడి - లేటి; ఒకఁడు - ఒకఁటి; గూఁడు - గూఁ; తూఁడు - తూఁటి; నాఁడు - నాటి: నేడు - నేటి, ఒండు - ఒంటి; పండు - పంటి; పుండు - పుంటి; రొండు - రొంటి; చుండు - చుంటి; (రాతి) గుండు - గుంటి?; (బోడి) గుండు - (బోడి) గుంటి (?); తుండు - తుంటి (?); అంకుడు - అంకుటి; కుంకుడు - కుంకుటి; కూడు - కూటి; కొఱడు - కొఱటి; (మంచము) కోడు - కోటి, చవుడు - చవిటి, జిల్లేడు - జిల్లేటి; తంగేడు - తంగేటి; తగడు - తగటి; తవుడు - తవిటి; తాడు - తాటి; తొగడు - తొగటి; తోడు - తోటి; (ఆధునికము); త్రాడు - త్రాటి; బలుద్రాటన్ (భా. విరా. I. 275); మొలత్రాటన్ (హరి. ఉ. III. 16); దామెనత్రాటన్ (హరిపూ. V. 243); నేరేడు-నేరేటి; పాడు-పాటి వంకాయల పాటన్ (S. I. I. VI. 120); వెరడు, వెరటి, బీడు - బీటి; వీడు-వీటి; ఏఱు - ఏటి; మూఱు - మూటి; కోనేఱు - కోనేటి. - 'నూఱు' పదను శకటరేఫమునకు 'ట' కారాదేశమును దానిపై నిత్యమును గలుగును: నూటి. ఒకప్పుడాశకటరేఫముమీఁద 'ఇటి, ఇంటి' అనునవి పర్యాయమునఁ జేరును; నూఱిటి (-ంటి.)

3. రు, లు, వర్ణము లంతమందుగల కొన్ని శబ్దములపై ఇ వర్ణముచేరి యొకరూపమును, ర, ల లకు టకారమాదేశమయి యొకరూపమును గాన వచ్చుచున్నది. వీనిలో 'ఇ' వర్ణముచేరిన రూపములు ప్రాచీనములును, 'ట' కారమాదేశమున రూపము లర్వాచీనములునై యుండును. లేదా, అవి మాండలిక రూపభేదములయినఁ గావచ్చును. ర, ల లకు డకారము కొన్ని మండలములందు వినఁబడుచుండుటచే నామండలములందు 'డ'కారమునకు విశేషణత్వమునఁ బరుషోచ్చారణము గలిగి 'ట'కారముగ మాఱియుండును. రేఫముపై నిత్యము చేరునప్పుడు దానికి ద్విత్వము కలిగియైనను 'ట'కారో

చ్చారణమేర్పడి యుండును. ఉదా: ఎదురు-ఎదిరి, ఎదుటి; నీరు-నీరి, నీటి; నోరు-నోరి, నోటి; గోరు-గోరి, గోటి; నొసలు-నొసలి, నొసటి; మొదలు-మొదలి (మొదలిటి, -ంటి, మొదటి); అోలు-అోలి, అోటి.

4. -న్ను అంతమందుగల యాపవిభక్తికశబ్దము లితరద్రావిడభాషల యందు ణకారాంతములు. కన్ను-అర. కన్న. కణ్, కణ్ణు; మన్ను-అర.కన్న. మణ్ మొద. ఈ-'ణ్ణు' పై 'ఇ'కారము చేరునప్పుడు 'ణ్ణి' అని యేర్పడి, పర మందున్న ణకారమునకు మాత్రము పరుషోచ్చారణము గలిగి 'ణ్టి' అని యేర్పడినది: కన్ను-కంటి; జున్ను - జుంటి; మిన్ను-మింటి; విన్ను-వింటి. 'వెన్ను' పదమునకు సప్తమీరూపమగు 'వెంటన్' అనునది మాత్ర మున్నది.

-ల్లు అంతమందుగల యాపవిభక్తికశబ్దములు కన్నడమున 'ళ'కారాంతములు. ఈ 'ళ'కారమునకు 'ణ'కారాదేశమును, పరమందలి ణకారమునకుఁ బరుషత్వమును గలిగి, దానిపైఁ జేరిన యిత్వముతో-ంటి తోడి రూపము లేర్పడినవి. లేదా, లకారమునకు నకారాదేశమును, నకారమునకు మూర్ధన్యోచ్చారణమును గలిగియైనను నిట్టి రూము లేర్పడి యుండవచ్చును: ఇల్లు (కూయి: ఇడ్డు=ఇండు); చూ. బహు. ఇండులు), ఇంటి; ముల్లు (కన్న. ముళ్) ముంటి; కల్లు=తాయి-కంటి; పల్లు=దంతము-పంటి; పననపంటి చందమున (భా.స్త్రీ. I. 47); పంటికొద్దిని' (రాధామా. II. పు. 18); విల్లు (కన్న. బిళ్) వింటి.

5. ప్రొద్దు, ఏమి, వేయి, రేయి, అను పదములపై వైకల్పికముగ 'టి' వర్ణ మాగమముగాఁ జేరును: ఎల్లిప్రొద్దున (భా. భీష్మ. II. 252); ప్రొద్దుటి, ఏమిటి; వేయిటి, రేయిటి.

6. చేఁదు శబ్దము తుదిదకారమునకుఁ బ్రథమేతరవిభక్తులందు పరుషత్వముకలిగి 'త'కారమగును. చేఁతి.

7. -యి వర్ణాంతములగు నాపవిభక్తికశబ్దములపై 'తి' వర్ణముచేరును; అప్పుడు యి వర్ణములోపించును: చేయి-చేతి; దా (డా)యి - దా(డా)తి; నూయి-నూతి; పీయి-పీతి; తాయి-తాతి.

8. 'ఱు' అంతమందుగల శబ్దములపై 'ఇ'వర్ణము చేరునప్పుడు దాని ద్రావిడోచ్చారణమగు 'త్రు' అనుదానియందు వర్ణవ్యత్యయము గలిగి 'ర్తు' అని యేర్పడఁగా, దానిపై 'ఇ' వర్ణముచేరి- 'ర్తి' తోడి రూపములు కలిగినవి: అఱ్ఱు-అర్తి; కఱ్ఱు-కర్తి; కుఱ్ఱు-కుర్తి; కొఱ్ఱు-కొర్తి; గొఱ్ఱు-గొర్తి; పఱ్ఱు-పర్తి మఱ్ఱు-మర్తి; మిఱ్ఱు-మిర్తి; వఱ్ఱు-వర్తి.

9. ఔపవిభక్తికములగు 'లి' వర్ణాంత పదములందలి తుది యిత్వము ఔపవిభక్తిక ఇ వర్ణమేయైనను, నట్టిషష్ఠీరూపములు తెలుఁగునఁ బ్రథమైకవచనమున నెలకొన్నవి. కావున వాని షష్ఠియందు 'ల' కారమునకు 'ట' కారము మాత్ర మాదేశమయి, పూర్వ మాపవిభక్తికవర్ణమయి యుండిన యిత్వమట్లే నిలుచును: నాఁగలి-నాఁగటి; తిరుగలి-తిరుగటి మొద. తొల్లి' పదము కూడనిట్టిదే; దీనికి 'తొంటి, తొల్లిటి (-ంటి)' అనునవి షష్ఠీరూపములు.

10. (i) రెండు, మూఁడు, పదముల డకారమునకు టకార మాదేశమగును: రెంటి, మూఁటి;-వానిపై 'టి' వర్ణ మాగమముగా నైన వచ్చును;అప్పుడాశబ్దములపై మొదట ఇవర్ణముకూడఁజేరును: రెండిటి, మూఁడిటి.-ఈ రూపములలో టి వర్ణము పూర్ణానుస్వార పూర్వముగను నుండును: రెండింటి, మూడింటి. 'ఒకఁడు' లోని డకారమునకు టకార మాదేశమయి దానిమీఁద నివర్ణముచేరును. ఇట్లేర్పడిన 'టి' వర్ణము పూర్ణానుస్వారపూర్వముగూడ నగును: ఒకటి, ఒకంటి. (ii). నాలుగు, ఏను, ఐఁదు, ఆఱు, ఏడు పదములపైఁ బర్యాయమున-ఇటి,-ఇంటి అనునవి చేరును: నాలుగిటి (-ంటి), ఏనిటి (-ంటి), ఐఁదిటి (-ంటి), ఆఱిటి (-ంటి), ఏడిటి (-ంటి.) iii. ఎనిమిది, తొమ్మిది, పది, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని అనువానిపై-టి,-ంటి, అనునవి చేరును: ఎనిమిదిటి (-ంటి), తొమ్మిదిటి (-ంటి), పదిటి (-ంటి), అ (ఇ, ఎ,) కొన్నిటి (-ంటి.); కాని, 'కొన్ని నడిగితి' (భాగ. II. 261.)

11. మొదలు, పగలు, పదములపై 'ఇ' వర్ణము మాత్రము చేరును: మొదలి. పగలి; మొదలి నాలవుపాలు (భా. శాంతి. V. 136); మొదలిరాజు: (భా. కర్ణ. II. 397); ఒకప్పుడు వానిపై 'ఇటి, ఇంటి,' అనునవియునుఁ జేరును. మొదలింటనుండియున్ (భా. విరా. II. 169), మొదలిటి (భా. విరా I. 179) మొదలింటి, పగలిటి (-ంటి); ఈ పదములతుది 'ల' కారమునకు 'ట' కార మాదేశము కాఁగా నారూపములపై 'ఇ' వర్ణము చేరుట యాధునికము: మొదటి, పగటి.

12. (అ) క్రిందు, మీఁదు, ముందు, ఱేపు, రేపు, మాపు, మునుపు, సేపు అనుపదములపై 'టి' వర్ణ మాగమముగాఁ జేరును; చేరుచో వాని యుత్వమున కత్వము వచ్చును: క్రిందటి, మీఁదటి. ముందటి, ఱేపటి, రేపటి, మాపటి, మునుపటి, సేపటి; 'మీఁదటికేడది యేమి వుట్టునో (భాస్కర. యు. 1730); మాపటి నీడ (దేవకీనం. శత. 73); 'సేపు' పదముతోలుత నౌపవిభక్తికము. క్రిందును, మీఁదులపై ఇవర్ణము కూడఁజేరును: క్రింది, మీఁది. 'మున్ను' పై 'ఇటి' మాత్రముచేరును: మున్నిటి. (మున్నటనుండి ?)

(ఆ) అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, ల డకారమునకు టకారాదేశమును, దానిపై ఇవర్ణమును జేరును; చేరుచో 'పు' మీఁది యుత్వమున కత్వము వచ్చును: అ (ఇ, ఎ) ప్పటి.

13. అంత, ఇంత, ఎంతలపై టి వర్ణము నన్నయకాలమునఁ జేరుట లేదు. తరువాతికాలమునఁ వైకల్పికముగఁ జేరుచువచ్చెను. అ (ఇ, ఎ)ంతటి. ఈ టి-వర్ణమా శబ్దముల పూర్వావస్థయందుండిన అంతలు, ఇంతలు, ఎంతలు, ల తుది 'ల' కారమునకు 'ట' కార మాదేశముకాఁగాఁ గలిగినది. ఇట్లే, తొలుత, వెనుక, పిదప, లపై 'టి' వర్ణముచేరి 'తొలుతటి, వెనుకటి,' పిదపటి, అను రూపములు కలుగుటకు 'తొలుతల్, వెనుకల్, పిదపల్' మొదలగునవి వానికిఁ బూర్వ రూపములగుటయే కారణము: అంత వా రెందు నెవ్వరులేరు (భా. ఉద్యో. IV. 258); ఇంత వెట్టివారునుగలరు (భా. ఉద్యో. IV. 377): అంతం తటన్=అంతంతదూరమున (భా. అర. VII. 16); ఎంతటిపెద్ద (భా. విరా. I. 21); ఒక యింతటిలోన (భా. విరా. I. 21.); ఇంతటిపనులకుఁ జాలితిమి (భా. భీష్మ. III. 437); ఎంతటిపని, భా. అర. VI. 94; ఉద్యో. IV. 386); మాద్రిపిదపటిపట్టి (భా. కర్ణ. II. 378.) ఈయంతటన్ (హరి. పూ. VII. 133.)

14. అనేకములైన తెనుఁగుపదము లొకానొకప్పు డొపవిభక్తికములై యుండెను. వానిపై ఇత్వముచేరి షష్ఠీరూపము లేర్పడుచుండెను. కాని, యా యివర్ణము చేరిన రూపములే ప్రథమైకవచనమున స్థిరపడిన నాఁటనుండియు ననొపవిభక్తికములు కాఁజొచ్చినవి. అట్టివానికిఁ గొన్ని యుదాహరణములు మాత్ర మిచటఁ జేర్పఁబడుచున్నది. చెనఁటి (* చెనఁడు), చెన్నటిపల్కులు (భా. కర్ణ. I. 125); తేఁటి (తేలు) (భాగవ. VIII. 31); తుంటి (*తుండు); వెంటి (*వెండు); అర (-న)ఁటి (*అరఁడు) (భార. స్త్రీ. I. 32; S I. I. VI. 932), అవిటి (అవుడు), ఇం (ఈఁ) జేటి (*ఇం (ఈఁ) జేడు), ఒకటి (ఒకఁడు), కఱటి (*కఱడు), కుంటి (కుంటు), చింగోటి (*చింగోడు), చిల్లోటి (*చిల్లోడు), చీఁకటి (*చీంకల్ చూ. చిమ్మ (చీఁకటి), (చీఁకటి) (చిమ్మంధకారము), చక్కటి (*చక్కల్) చక్కటితోడి బవరంబు (భార. సౌ. I. 24); తరిటి (*తరుడు), పాటి (పాడు), బోఁటి (పోలు), వ్రే (వే) కటి (*వ్రేఁకల్), రేగ (-వ) డి, (రేగ (వ) డ), కాఁడి (*కాఁడ), చూఁడి (చూలు), తాఁడి (తాఁడు), పాఁడి (పాలు=క్షీరము), వాఁడి (వాలు), నొప్పి (నోవు, నొవ్వు,* నొప్పు), పుప్పి (పుప్పు), అల్లరి (అల్లర), ఆలి (ఆలు), తొల్లి (తొల్), నొవ్వి (నొవ్వు), తొట్టి (తొట్టు), వెట్టి (వెఱ ?), మొదలయినవి.

15. (అ) కొన్ని యాపవిభక్తిక పదములందలి తుది ద్విత్వము లోపించును. అట్టి లోపమునొందిన రూపము లౌపవిభక్తికములు కావు: కన్ను—కంటి (కను—?); విల్లు-వింటి (విలు—?); మొదలయినవి.

(ఆ) కొన్ని యాపవిభక్తిక పదముల యాది దీర్ఘము హ్రస్వమయి తుది వర్ణమునకు ద్విత్వము గలుగఁగా నేర్పడిన రూపను లౌపవిభక్తికములు కావు : గోయి-గోతి (గొయ్యి—?), నూయి-నూతి (నుయ్యి—?), మొదలయినవి.

16. ఔపవిభక్తికముల తృతీయా సప్తమీ విభక్తులకు "అను" అను నాదేశము బహుళమని యభిప్రాయపడుచు నేఁటి వైయాకరణులు కొందఱు 'గోరిచేతను, గోరను; ఊరియందు, ఊరను; గొడ్డటితోన్, గొడ్డటన్' అనురీతి రెండు రూపములు నుండవచ్చునని తెలుపుచున్నారు. 'గోరిచేతను, ఊరియందు, గొడ్డటితో' మొదలగు రూపములు కృతకములు. అట్టివి గ్రాంథికములు కావు; వ్యవహారమున వినఁబడవు; వ్యవహారమున గోరుతో; ఊర్లో (=ఊరులో), ఊళ్లో; గొడ్డలితో, అనియే వినఁబడుచున్నవి.-'లో' అను ప్రత్యయము చేరునప్పుడు మాత్రము 'నోటిలో (నోట్లో) ఆోటిలో (ఆోట్లో), మొదలగు నుడికారము గలదు. ఇల్లే, చేతితో, నోటితో మొదలగు రూపములు నున్నవి. నేఁటి వ్యవహారమున నీవిషయమునఁ జాల తబ్బిబ్బులు గలిగినవి. కావున, నీవిషయమును వ్యవహారము ననుసరించియే తెలిసికొనవలెను. 'నేఁటి యెల్లింటిలోపల (భాగ. * I. 1593); నేఁటి యెల్లిటిలోనన్ (భార. విరా. V. 301); గూఁటిలోన్ (భాగ. VII. 63); పాకనాటిలో (భార. అర. VII. 469); కొలనిలోనన్ (భార. అను. I. 224) ;మాణికము పేరితో (S. I. I. IV. 700); పాలమున్నీటి లోపల (భాగ. VIII. 176); తంత్రీపాలుండను పేరితోడ (భార. విరా. I. 100.); మోడ్పుఁగేలితోన్ (భా.అను. IV. 443).

తెనుఁగునందలి యాపవిభక్తి కానౌపవిభక్తిక విభాగ మొకమార్గ మనుసరించిలేదు. ఏకవర్ణాంతములగు శబ్దములే కొన్ని యాపవిభక్తికములు గను గొన్ని యనౌపవిభక్తికములుగను నున్నవి. 'చోటు' ఔపవిభక్తికము, కాని, ఆటు, ఈటు, ఊటు, ఏటు, కీటు, చేటు, నీటు, పేటు, పోటు, బేటు, రోటు, లోటు, వాటు మున్నగునవికావు; 'అక్కడ' తొలుత నౌపవిభక్తికము కాకపోయినను దరువాతికాలమున నైనది; కాని, దాని సామ్యమునఁ దక్కిన డవర్ణాంతపదము, లౌపవిభక్తికములు కాలేదు; కొండి-కొంటి; రొండి-రొంటి-అయినట్లు, తిండి-తింటి, బండి-బంటి మొదలగు రూపములు సిద్ధింపవు. అంగడి-అంగటి అయినట్లు అడజడి, ఆఱడి, ఉమ్మడి, ఊడి,

పైఁడి, మొదలగునవికావు; పండు-పంటి, పుండు-పుంటి, యైనట్లు బొండు-బొంటి, బెండు-బెంటి, అనికావు; అంకుడు-అంకుటి, కుంకుడు-కుంకుటియైనట్లు గోడు-గోటి, చీకు-చీటి, బేడు-బేటి, యని కావు; కరుడు-కరుటి; కరడు-కరటి యగునేమో; క్రిందు-క్రింది, క్రిందటి, అయినట్లు కందు, విందులు మార్పులఁ జెందవు; ముందు-ముందటి యగునుగాని 'ముంది' యనికాదు; ప్రొద్దు-ప్రొద్దుటియైనట్లు, గుస్తు-గుస్తుటి కాదు; తిన్న-తిన్నటి; నున్న-నున్నటి యైనట్లు దున్న-దున్నటి కాదు; అన్ను, చెన్ను, తెన్ను, పన్ను, పొన్నులు కన్ను, జున్ను, మన్ను, మిన్ను, విన్ను, వెన్నులవలె నాపవిభక్తికములు కావు; మున్ను-మున్నిటి యగునుగాని 'ముంటి' కాదు; చేయి-చేతి; నూయి-నూతి; ఊయి-ఊతి; వాయి-వాతి యైనట్లు కూయి, డాయి, ప్రాయి, వ్రాయి, అనునవి కూతి, డాతి, ప్రాతి, వ్రాతి యను రూపముల నొందవు. కాను, వీను లు చేను, మేను, మ్రాను, లోను ల వంటివికావు; తూపు, పోపులు, మాపు, తేపు, సేపులవంటివికావు. 'అదరు' 'ఎదురు' వంటిది కాదు; ఆవల, ఈవల, ఏవల, ఆతల, ఈతల, ఏతల లవలె ఊయల, కోయిల, మున్నగునవి యాపవిభక్తికములు కావు; అంగిలి, ఆఁకలి, మున్నగువానివలె అంకిలి, ఆలి, కడలి, కూలి మున్నగువానిపై నుపవిభక్తులు చేరవు. ఒడలు, కడలులపై నిత్యముచేరునట్లు అరలు, ఇరులు, కోలు మున్నగువానిపైఁ జేరదు; ఇల్లు, కల్లు, ముల్లులవలె చెల్లు, చొల్లు, జొల్లు, పిల్లు, పుల్లు, పొల్లులు చెంటి, చొంటి, జొంటి, పింటి, పుంటి, పొంటి, అను రూపములను దాల్పవు.

ఇట్లుండఁగా నేవియాపవిభక్తికములో, యేవి యనాపవిభక్తికములో తెలిసికొనుటకు ముఖ్యముగ వ్యవహారమును, గ్రంథములందలి ప్రయోగములును బ్రమాణమగుచున్నవి. గ్రంథములం దొకకాలమున నాపవిభక్తికములుగఁ గాన్పించుచున్న విం కొకకాలమున ననాపవిభక్తికము లగుచున్నవి. తరువాతి కాలమున నాపవిభక్తికానాపవిభక్తిక రూపములు రెండును గాన్పించుచున్నవి. రెండును నేకకాలమున నున్నప్పుడు కించి దర్థభేదములతో వ్యవహారమున నెలకొనుచున్నవి. కవులుమాత్రము వాని కర్థభేదమును బాటింపక యథేచ్ఛముగ వాడుకొని యున్నారు.

ఉపవిభక్తులు విభక్తి ప్రత్యయములను జేర్చికొనుటకు శబ్దములతోఁ గలియుచున్నను, నట్టి యుపవిభక్తులు చేరిన రూపములపై నన్నివిభక్తి ప్రత్యయములును జేరి యుండనక్కఱలేదు; ముఖ్యముగ నీ యుపవిభక్తులు విశేష్యములనుండి విశేషణముల నేర్పఱుచుటకుఁ జేరిననవియు, నట్టి రూపములను గావలసినచో విభక్తి ప్రత్యయములను జేర్చికొనుటకుఁ బ్రాతిపదికములుగ నుపయోగించు కొనవచ్చుననియుఁ జెప్పవలసియున్నది.

## ఔపవిభక్తికములు.

1. నన్నయభారతమున నున్న యాక్రిందిపదములు దరువాతి కాలమున నౌపవిభక్తికములుగ నిలిచినవి:

ఇ.

ఎక్కడ - (కళా. IV. 144) ఎక్కడిది (పాండు V. 107); ఎక్కడికి. (శకుం. పరి. II. పు. 32) ఇక్కడికి; ఎదురు (శకుం. పరి. I. పు. 8.) ఎదిరికి; (కళా. II. 41) పోరు-(నిర్వ. III. 15, 95), పోరికి; (నిర్వ. V. 27) పోరిలో; నిర్వ. II. 11 (పోరఁ;) VII. 20; రామాభ్యు. VIII. 18; దశావ. పు. 190; (మీఁదు)-(నిర్వ. VI. 90) మీఁదన్, (నిర్వ. VI. 42, ప్రభా II. 31) మీఁదికి, (దశావ. పు. 62,) మొదలికి;-చోటు-చోటన్ (నిర్వ I. 44,47. II. 56; వరాహ. 143; పాండు. II. 4, 153, III. 100, IV. 81; III. 158(10),150. ప్రభా. I. 132;-చోటికి(నిర్వV. 59, 137, VI. 59; హరి.పూ. VIII. పు. 189, శకుం. పరి. III. 48; పాండు. II. 126, V. 21, ప్రభు II. 42.) కేలు (సర్పమా. II. 71); ముందఱ = ముందఱు? (నిర్వ. II. 41, 21. నిర్వ. V. 59; IV. 38, 155, పాండు. II. 179, ముందట (హరి. పుం. VIII. 192; కళా I. 181; ప్రభా, II. 42, (పాటు-అప్పాటన్, భా. విరా. I. 74, V. 10); ఏపాటనైనన్ (భా. విరా. I. 79); నేఁడు-పాండు. IV. 61 నేఁటన పండు-(పాండు. V. 230 పంటికి;) (ఉ. రా. పు. 104) ఆఁకలి; (పాండు. III. 156) ఆఁకటన్; లేడి (పాండు. I. 126. III. 131) లేటి; (మను VI. 75; రా. పు. 72; వరాహ. III. 33.)

అప్పటంగోలె (భా. ఆది. VI. 192); అప్పటికి (భా. అర. III. 263; S. I. I. VI. 1323); అప్పుడు (నిర్వ. V. 124) అప్పటికిన్; (వరాహ. II. 86;) అప్పటప్పటికి (భాగ. VI. 39); అప్పటికప్పటికి (భా. అను. V. 28; ఆశ్ర. I. 157; భాగవ. VIII. 210); ఇప్పుడు—ఇప్పటిభంగిన్ (భా. విరా. I. 148); ఏఱు—(మను. V. 71, వరాహ II. 53;) పిడికిలి—(వరాహ. VII. 59);ఎప్పుడు—(ప్రభా. V. 52, II. 55;) ఎప్పటి (భా. విరా. III. 55; ద్రోణ. I. 14).

ఏమి—(హరి. పూ. IX. పు. 212;) మాకేమిటఁగడమ (భార. అర. V. 115.)

కన్ను—(నిర్వ. VI. 80,) కంటి తెప్ప (హరి. ఉ. VII. 86.)
చన్ను—(పాంకు. I. 136)
మిన్ను— (ప్రభు II. 31, 82; V. 216 శకుం. పరి. పు. 24.)
పాలు—(హరి. పూ. IV. పు. 82) పాలికి

2. అచ్చోటు, ఇచ్చోటు, ఎచ్చోటు, అనునవి * అచ్చ(చ)టు, *.ఇచ్చ(చ)టు, * ఎచ్చ(చ)టు లుగాఁగూడ మొదటినుండియుఁ గాన్పించు చున్నవి.

అచ్చటి (ప్రభా. I. 100; II. 24, 123; IV. 14, 37, 52, 67); అచ్చటికి (భార. ఆది. VI. 297); అచ్చటన్ (భార. ఆది. III. 106; ఆది VI. 30, 85); అచటికి (భార. విరా. II. 91, V. 317; శల్య. II. 29); అచటన్ (భార.అను. IV. 438), అచటనచట (భార.శాంతి. II. 91); అచటి (భార.ఆది. III. 151. ఉద్యో. IV. 6); ఇచట, ఇచటన్(భార. విరా. II. 30. భార. అర. V. 148); ఇచ్చటన్ (భార.ద్రోణ. I. 40; ఆది. IV. 26, శాంతి. VI. 219); ఇచ్చటికి (భార. శాంతి. అర. VII. 23; III. 502); ఇచ్చటివి (భార.శాంతి. II. 160);V. 55, 136); ఎచ్చటి (పాండు. III. 24.); ఎచ్చటన్ (భార. విరా.II. 40, శల్య. II. 54); ఇచ్చటచ్చోటన కెచ్చటనైనన్ (భార. విరా. I. 254);

అచ్చటు (భార. ద్రోణ. IV. 76, మాస. I. 80);ఎచటు (భార.విరా. I. 312); ఆపుర మిచ్చటచ్చటను నాసల వచ్చితి ?

3. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు-వీని యాపవిభక్తికరూపములు అప్పటి, ఇప్పటి, ఎప్పటి, అనునవి. చూ. శకుం. పరి. III. పు. 54 అప్పటఁగోలెను. వీనిని బోలియున్న 'ఉప్పుడు' నకు 'ఉప్పటి' యను ఔపవిభక్తికరూపము వ్యవహారమున వినఁబడుచున్నది. 'చచ్చుడు' నకు ఔపవిభక్తికరూపము 'చచ్చుటి' యగునో 'చచ్చటి' యగునోనిర్ణయింపలేము. రెండురూపములును వ్యవహారమున నున్నవి. 'చప్పటి కూర' అనునప్పుడు 'చప్పటి'కి ప్రథమైకవచన రూపమేమో తెలియదు; 'చప్ప' యగునా? 'చప్పుడు' ఔపవిభక్తికముకాదు.

4. 'డు' వర్ణాంతములైన యాపవిభక్తికశబ్దములు :

'తోడు' దీనిపై మొదటినుండియు 'ఇ'త్వము మాత్ర ముపవిభక్తిగాఁ జేరుచున్నది. మా మువ్వురతోడి జోడియగు మూర్తి (భార. విరా. I. 185); లోకంబుతోడివారు (భార.విరా. V. 201); శల్యుఁడు వాసుదేవుతోడి యీనువాఁడు (భార. ఉద్యో. IV. 221); దయతోడిపాడి (భార. భీష్మ. I. 41, ఆశ్ర. I.76); తబ్బులతోడిపొత్తు (దాశ. శత. 37);-నేటి వ్యవహారమున 'ఇ' చేరునప్పుడు 'డ'కారము పరుషమగుచున్నది. 'నీతోటి వస్తాను, తోటి కోడలు' మొద. తోటిబాలురతోడ నాటలాడి (రాజగో. శత. 36.)

'నాఁడు'—'మఱునాఁడు నాఁటికిన్' (ఆది. VII. 183); వ్యవహారమున 'నాఁటినాటికి, నానాటికి; నేఁడు—దీని యాపవిభక్తికరూపము 'నేఁటి' (ఉ. హరి. III. 22 లో 'నేఁడెల్లిలోన' అని యున్నది. ఎల్లినేఁటిలోన (నిర్వ. V. 108).

130

దీనికి 'నేఁటియెల్లిటి (ంటి) లోన,' అనికాని 'నేఁట నెల్లిట (ంట), అనికాని, 'నేఁడెల్లిటి (ంటి) లోన' అనికాని, 'నేఁడెల్లిఁట (ంట)' అనికాని, 'నేఁటయెల్లి', అనికాని, 'నేఁటనెల్లి లోన, నేఁటి యెల్లిలోన' అనికాని, యన వచ్చునో రాదో నిర్ణయింపలేము. ఇట్లే పాండు. IV. 61 'ఎల్లినేఁటనవచ్చు' అని యున్నది. దీనికిమాఱుగ 'ఎల్లి నేఁడు వచ్చు, ఎల్లిట (ంట) నేఁటవచ్చు, ఎల్లిట (ంట) నేఁడువచ్చు' ఈ మొదలగు రూపములను వాడవచ్చునేమో తెలియదు. ఎల్లిప్రొద్దున(భార.భీష్మ II 252);'ఎల్లియతనితో'—(నిర్వ. VIII. 28) ఇచ్చట 'ఎల్లి' కళ. వాఁడెల్లీ డుండును; వాఁడెల్లి నీడనుండును; ఎల్లి ప్రొయెద ఎల్లిఁబోయెద, ఎల్లిటఁబోయెద—ఇట్టి ప్రయోగములలో నేవిసాధువులు? ఎల్లుండి యౌపవిభక్తికమే; 'ఎల్లుంట' ననవచ్చును (శకు.పరి. III. పు. 56 నేఁట తేపటనెల్లి యెల్లుంట.); నేఁటి యెల్లింటిలోనన్ (భార. విరా. V. 301); నేఁటి యెల్లింటిలోపల (భాగ. X. I. 1593).

పండు—గ్రంథములలో నిది ఔపవిభక్తికమే కాని వ్యవహారమున నిది యనౌపవిభక్తికమైనది. 'పండులో', పండుతో', పండుకంటె. మొద, గ్రంథములందైనను షష్ఠీవిభక్తియందు తప్ప నితర విభక్తులయందును 'పండు' శబ్ద మౌపవిభక్తికముగ వాఁడబడినట్లు కాన్పింపదు.

పదడు—(వరాహ. V. 52) పదటిపాలు; (శాంతి. V.) పదటఁగలుపు; పదటఁగలిపి (హరి. ఉ. IV. 57); కాని, (పండితా. II) పదడుచేపట్టుడు పసిఁడి యైనట్లు.

మారేడు—'మారేటికిఁ బలుమాఱేఁటికిఁజన' (యయా. IV); (సర్ప. మా. II. 41) మారేటి; కాని (ఉ. రా. పు. 104); మారేడుఁ బంటికై.

మూకుడు—(పాండు. IV. 173.) శ్రావమూఁకుటన్; వ్యవహారమున 'మూఁకుటిలో', మూఁకుటితో', మూఁకుటికంటె' మొద. 'మూఁకుటి' అన వచ్చునా?

రేగడ, రేగడి, అని శ. ర. 'రేగడి' ఔపవిభక్తిక రూపమగును. ప్రథమైక వచనరూపము 'రేగడు' కావచ్చునా? 'రేగటి నున్నలు' (మను. IV. 20); వీడు—(ఉ. హరి. 14.); వీటన్.

క్రిందు—దీనిపై కవిత్రయమువారి గ్రంథములలో 'ఇ'త్వమే యుపవిభక్తిగఁ జేరుచుండెను. తరువాతి కాలమున 'క్రిందటి' యను నౌపవిభక్తిక రూపమును నేర్పడినది. కళా. II. 161, 181; కొన్నినాళ్లు క్రిందట; (ప్రభా. IV. 82.) క్రిందటి దినములు ,, (V. 53.) క్రిందటికి; ,, (179)

క్రిందటిగా. గ్రాంథికభాషలో 'క్రింది' 'క్రిందటి' శబ్దము లర్థభేదము లేకుండ వాడఁబడుచున్నవి. వ్యవహారమున 'క్రింది' స్థలవాచకము, 'క్రిందటి' కాల వాచకము.

పిఱుందు—(భార. ద్రోణ. III. 47. నిర్వ. VII. 76.)పిఱింది; కాని. చూ. (వరాహ. VI 10.) దొడ్డతనము పిఱుఁదునఁ దాల్చెన్.

తుద (హరి. పూ. VII. పు. 181.) తుదికి.

ప్రొద్దు—(కాశీ. IV. 27. VI. 24.); ప్రొద్దునకు (భోజరా. V. 336) ఎంత ప్రొద్దుకైన; వ్యవహారమున ప్రొద్దుటికి, ప్రొద్దుటిలో, మొద.

మీఁదు—(వరాహ. I. 151; V. 126.) మీఁదటి (కళా. III. 85.) మీఁదన్; (పాండు. II. 162, 23) మీఁదటన్; (దశావ. పూ. 44; ప్రభా. II. 53; V. 63 మీఁదట, మీఁదిఁ ప్రభా. IV. 52) అటమీఁదటి. మీఁది, 'మీఁదటి' అనునవి ఏకార్థకములు; వ్యవహారమునను నట్లే.

ముందు—దశావ. పు. 264 ముం, దిరికి (యతి) కకుఁ_ర్తి కావచ్చు ను. వ్యవహారమున 'ముందిటికి' అని యున్నది.

అదను—మను. V. 96 అదనన్; పూర్వాంధ్రము: అదనున.

పదను—పదనన్ (భార. ఉద్యో. I. 293); పదనికి (భార. ఉద్యో. III. 69.)

మేను—తోలుమేనన్ (భాస్క. యు. 390.) లోను-లోనన్(భార.భీష్మ. II. 17).

కెలను—(నిర్వ. V. 130) కెలనన్; (VI. 139) కెలనికిన్ (భార. ఉద్యో. II. 88.) ఉత్తరాంధ్రము: 'కెలనున' అని కూడ.

మ్రాను—మ్రానన్ (భా. విరా. I. 168).

కొలను—(నిర్వ.III. 72) కొలనన్; (భార.ద్రోణ.III. 43) కొలనిందల పించెన్; కొలనికిడాసెన్ (భార.అర. VII. 39.); కొలని (భార.అను. III. 222).

గవను—కళా. IV. 110 (ఔప); ఉత్తరాంధ్రము: గవనున.

చేను—(చెన్నబ. పు. 22.) చేనికి; (భాగ. V. 123.) చేని.

కన్ను—కన్గంటన్ = చూచి చూచి (భాగ. VIII. 240); కడకంటి చూడ్కి (భార. విరా. II. 118); ఎండకన్ను గానకన్నును నెఱుంగని (భార. ఆశ్ర. I. 143.)

మన్ను—నన్నయ: మన్ననన్ (ఆది. V. 236); 'మంటి' కేమని పాడియుండునో! కాని (వరాహ. II. 19) మంటన్; ఉ.రా. పు. 28 మంటిపై.

మిన్ను—మింటికిన్ (పాండు. IV. 293); మిన్నునకు (భాగ. X. 253); మింటి కలయంతయు = మిన్ను కలంతమట్టుకు (భార. ద్రోణ. III. 152); మింటిక్రేవన్ (భార. భీష్మ. III. 345); మింటి (శకుం. పరి. II. పు. 24; ప్రభా. V. 216); కాని, మిన్నుఁబ్రాకు (భాగ. III. 1011).

మున్ను—ఈ రూపమును నన్నయ యౌపవిభక్తికముగ వాడినట్లు కనఁబడదు. 'ముందటన్' అను ప్రయోగములు అచ్చు ప్రతులలో నున్నవి గాని యవి యన్నియు 'ముందఱన్' అనియే యుండవలెనేమో. కాని 'ముందటి' (ద. ఇం. శా. V. 65.) 'ముందిటి, ముందటి' అని కూడ వాడవచ్చునా? 'మున్నిటి' (ప్రభులిం. పు. 129; వృషా. శత. 89).

మేను—ఇది యెప్పుడును నౌపవిభక్తికమే. (నిర్వ. VI. 59) మేనన్; (మను. VI. 40.) మేనన్; (కళా. IV. 162) మేనన్; (భాగ I. 100); మఱు మేనన్. ఈ 'మేను' శబ్దము నేఁటి వ్యవహారమునఁ జాలవఱకు లోపించినది. ఈ 'మేనఁబ్రాణము లున్నంతవఱకు' అనుటకు వ్యవహారమున 'కంఠములో ప్రాణ మున్నంతవరకు' అని వాడుదురు.

మును—మునిమాపు (నిర్వ. IX. 84.)

లోను—ఇది యీ రూపముతోఁ బ్రయోగింపఁ బడియున్నది: "దుర భివేశంబైన యాలోను నిశ్చింతుండై సతికేలు వట్టుకొని చొచ్చెన్" (భార. శాంతి. II); "దేవగణమున సురలున్ లోనుగ" (భార. శాంతి VI); 'ధర్మకోటులన్నియు లోనగు నిద్ధగుణ యహింసకు'(భార. అను. IV); "లోని" (ద. ఇం. శా. IV. 1132, 1208). 'లోఁనికి' (యతి) (మను. II. 21.)

వలను—నిర్వ. V. 23; హరి. పూ. VII. పు. 172. వలనికి; 'వలనున' అని కొన్ని యర్వాచీన ప్రయోగములు కాన్పించుచున్నవి.

చన్ను—(వరాహ. III. 92); చంటిన్; (పాండు. I. 136.) చంటి.

మొన్న—దీనిని నన్నయ వాడలేదు గాని 'నిన్నటఁగోలె' (ఆది. VIII. 118) అని వాడియుండుటచే 'మొన్న' కూడ నాకాలమున నౌప విభక్తికమై యుండును. (సమీ. VII. 146.) 'మొన్నమాపు' అని యనౌప విభక్తికముగఁ బ్రయోగము. నేఁటి వ్యవహారమున 'నిన్న (మొన్న) ఉద యము' 'నిన్నటి (మొన్నటి) మాట (వాఁడు); మొదలగు చోట్ల రెండు విధ ములుగను వాడుక గలదు.

మాపు—శకుం. పరి. III. పు. 54 నిన్న మాపటఁ గోలె (నిర్వ. VII. 23); మాపటికి (శకుం. పరి. III. 52); మాపటివాఁక.

మాపటిలోనన్ (భాస్క. కి. 738); మాపటి (S. I. I. IV. 659)

రేపు—రామాభ్యు. VIII. 135 'రేపటఁబట్టి) కాని, రేపునన్ (హరి. పూ. V. 202.)

జేపు—(శకుం. పరి. III. పు. 56.) 'నేఁటజేపట నెల్లి యెల్లుంట. జేపటి (S. I. I. VI. 1022; IV. 659); జేపటనుండి (భాగ. VII. 63.)

సేపు-జేపు, జేపటి యని యున్నప్పుడు సేపు, సేపటి కూడఁ గావలసి యుండును. కాని ప్రాచీనాంధ్రమున 'సేపు' అనౌపవిభక్తిక ముగనే వాడఁబడి యున్నది. ఈ మాట నన్నయ భారత భాగమునఁ గానరాదు. (నిర్వ. V. 119 సేపునన్; కళా. III. 76 ఇంచుక సేపులోన ( ,, II. 92; IV. 148.) సేపునకు; ఉ. రా. I. పు. 26 సేపునకు ఉ. రా. I. పు. 16 సేపునకు (సమీ. V. 107. III.) సేపునకు; భార. భీష్మ. I. 50 అర. V. 394; అశ్వ. II. 89. సేపునకు (ప్రాస) కాని, రంగారా. III. 177 సేపటికి.

తూర్పు—తూర్పుటాను (S. I. I. V. 10.)

రాత్రి—రాత్రిటిధూప అవసరం (S. I. I. VI. 847.)

నడుము—ఇది యెల్లప్పుడును నౌపవిభక్తికమే. (ఆది. VI. 43; అర. I. 235; అర. II. 190) నడుమన్; (ఆది. II. 26; IV. 208; VI. 73; VIII. 269 నడుమన; I) S. I. I. IV. 102 (నడిమితోంట;)(ఉ. హరి. I. 186) నడిమిపని; (కాశీ. I. 90; VII. 186) నడిమికి; V. 104; నడిమి వరాహ. III. 8; XII. 10; నడిమికి; పాండు. II. 222 నడుమన; II. 227 (నడుమన్; ప్రభా. I. 58, 139 నడుమన్; I. 63) నడిమి; (కళా. V. 33; భాగ. I. 73) నడుమన్; శకుం. పరి. II. పు. 32. నడిమియొప్పిదము; కాని, కొందఱు కవులు దీని న నౌపవిభక్తికముగఁ గూడ వాడియున్నారు. ఉ. రా. పు. 112 నడుమునకు; కూచిమంచి తిమ్మకవి 'నడుముకు' అని ప్రయోగించి నాఁడు. (చూ. చిత్రభా. III. 56.) నడుముకు.

ఏమి—(భార. ద్రోణ. IV. 114)ఏమిటన్; (భార. ద్రోణ. II. 257; V. 105; IV. 88; సర్ప. మా. I. 28; భాగ. IV. 720) ఏమిటియందు;(భార. శల్య. II. 74 ఏమిటివాఁడవు; (భార. భీష్మ. I. 48 ఏమిటివాఁడు; కళా. V. 51) ఏమిటికతల్; భార. అర. V. 385 ఏమిటఁగడమ; (భార. అర. VII. 423 అద్దేవుని యస్తమించుటేమిటన్); (భార అశ్వ. II. 185) ఏమిటనైనన్; (భా. విరా. II. 214) ఎప్పుడెయ్యెడ నేమిట నెట్టు లరయవలసె నమ్మెయి నారయుము.

'ఏమిటి' అనునది 'ఏఁటి'గ మాఱినది:—అనఘ యిది యేఁటి తపము (ఆది. IV.); ఏఁటిమాట (అర. IV. 350; ఉద్యో. IV. 377; శాంతి. I. 361); ఏఁటిది (భార. విరా. III. 225); ఏఁటికి(భార. అర. V. 385; కర్ణ. II. 72; అను. V. 312 భాగ. 14.)

గ్రాంథిక సంప్రదాయము ననుసరించి 'ఏమిమాట; అదేమిటో; అదేటి; అది యేమిమాటో' అను వ్యవహార రూపముల కాధారము కనఁబడదు. కాని, వ్యవహారము తప్పించుకొనరానిది; నేఁటి కవు లిట్టి ప్రయోగములను దమ గ్రంథములలోఁ జేయుచున్నారు.

రేయి—(హరి. పూ. VIII. పు. 200;) రేయిటనుండి; (భార. సౌ. I. 228) రేయింటి తెలుంగు.

ఱాయి—(ఆది. VI. 114) ఱాతిమీఁదను; కాని (పాండు. V. 212) ఱాయివంటి.

వాయి—(వరాహ. II. 58) వాతి; వ్యవహారము:నోరూ వాయీలేని వాఁడు; నా వాతబడ్డాడు.

ఒక్క తరవాయి దొరకొని = ఒక వరుసంబట్టి (హరి. పూ. VII. 81) వఱువాతన్ (హరి.పూ. V. 241); వాతివాఁడితనము (భాస్క. సుం. 201); నల్లఱాతకట్టి (S. I. I. VI. 1142); నేతిపనటులు (హరి. పూ. VI. 22); ముంజేతన్ (భాగ. IV. 140); చేతియేత్తెఱ (భార. ద్రోణ. II. 41); చేతి బలువు (భార. ఉద్యో. IV. 192; ద్రోణ. IV. 9); కత్తివాతియమ్ము(భార. ద్రోణ. III. 223); పులివాతికండ (భార. ద్రోణ. III. 127); వెడందవాతి యమ్ము (భార. భీష్మ. III. 39); వెడఁదవాతి దొడ్డతూపు (భార. భీష్మ. II. 49); నూతికప్ప (భార. ఉద్యో. IV. 196); నేతన్=నేతితో (భార. అను. V. 273.)

రాత్రి—రాత్రింటి (S. I. I. VI. 1118.)

ఎదురు—దీనిపైఁ బూర్వకావ్యములం దిత్వము చేరుచుండెను. తరువాతికాలమున రేఫమునకు బ్రథమేతరవిభక్తులందు 'ట్' ఆదేశముగా వచ్చెను. (భార.ద్రోణ. IV. 261); నిర్వ. VI. 92, VII. 78; ఉ. హరి. I. 20; కాశీ. VI. 201); ఎదురన్; కాని, (కళా. III. 80) ఎదుటికడుగు వెట్టదయ్యె; (III. 109 ఎదుటికి;—వ్యవహారమున 'ఎదురెదురుగా, ఎదుటివాఁడు' మొద.) నిర్వ. VII. 78 ఎదురెదురన్, 'ఎదుటెదుటన్' అని యనవచ్చునా?

ఎసరు—ఇది యాపవిభక్తిక మనుటకు వ్యవహారమే ప్రమాణము. ఎసటి పోఁతలు; ఎసటిలో; మొద. గ్రంథములందు ప్రయోగములు మృగ్యములు.

గోరు—'గోరన్' (వరాహ. XII. 32) అని పూర్వప్రయోగములు; 'గోటన్' అని యర్వాచీన ప్రయోగములు. (రామాభ్యు. VI. 195) గోరునకు (అనాప.)

గారు—రాజుగారి (వృషా. శత. 100); తల్లిదండ్రింగారికిన్ని (S. I. I. IV. 789); ఓబుళరాజుంగారి కొమారుండ్లు (S. I. I. IV. 279); తిరుపణి పిళ్లంగారికి (S. I. I. IV. 282); భక్తునింగారికి (S. I. I. IV. 702); మంచె నంగారిచేత (S. I. I. V. 137) తోగ = కలువ, ఇది శకుం. పరి. II. పు. 32 లో 'నల్లతోగటరేకు' అని యాపవిభక్తికముగాఁ బ్రయోగింపఁబడినది.

కుదురు—కుదుటఁ గూడు వెట్టి కుడుచువారలు (భార. ఉద్యో. II. 93. విరా. V. 403.)

నీరు—దీనిపై 'ఇ'త్వము చేరుటయే నన్నయభారత సంప్రదాయము. నీరున్=నీటిన్ (భార. అను. I. 255); నీరిలోననుండి (ఆది. V.); నీరిలోను (భార. అను. I. 232); అర్వాచీన ప్రయోగములు: (నిర్వ. VII. 76) మున్నీటన్; (రామాభ్యు. VII. 17) కన్నీటివాన; (భాగ. VIII. 176;) పాలమున్నీటిలోపల; (భా. శాంతి. I. 207;) నీటిత్రాలు; (భార. ద్రోణ. I. 26) నడునీటన్; (భార. అను. I. 181) మున్నీటి.

తేరు—ప్రాచీనాంధ్రమున నాపవిభక్తికము: తేరునన్, తేరునందు, మొదలగు నాధునిక ప్రయోగములు కానవచ్చుచున్నవి. తేరికూబరము (భార. భీష్మ. III. 97).

నగరు—ఈ పదమే యర్వాచీనమైనట్లు తోఁచుచున్నది. ఎఱ్ఱాప్రెగడ తొలుత దీనిని వాడినాఁడు. (హరి. పూ. IX. పు. 208) నగరన్; (మను. IV. 33; V. 54) నగరన్. ఇటీవల 'నగరున' అనియుఁ బ్రయోగములు గలవు.

నుదురు—నుదుటన్ (భాగ. VII. 61; భార. ద్రోణ. IV. 47).

నెత్తురు—నన్నయ దీని యాపవిభక్తిక రూపములను వాడలేదు. (ఉ. హరి. I. 45) నెత్తుటఁ జొత్తిల్లి;—వ్యవహారమున, అనాప. కూడ, నెత్తురు వరదలు; నెత్తురు వెల్లులు (భార. ద్రోణ. III. 103); నెత్తురుటేఱు (భార. ద్రోణ. I. 146); నెత్రుటేఱులు (భార. భీష్మ. III. 225); పెన్నెత్తుటన్ (భార. ద్రోణ. II. 251); నెత్తుటంజొత్తిల్లు (భార. ద్రోణ. II. 137.)

నోరు—దీనిపైఁ జాలకాలమువఱకు నిత్వమే చేరుచుండెను. (ఉ. హరి. III. 52 నోరన్; IV. 263) నోరుసొరుండు; (వరాహ. I. 145) నోరిమాట నోరనేయుండంగ; (మను. IV. 98) నోరికి; నోరుప్రేయింతు (భార. ద్రోణ. V. 365); నోరికండ (భార. ద్రోణ. II. 25; భాస్క. యు. 322) నోరికోలఁదుల్

వచరించెను; నోటికి మొదలయిన రూపములును జాలకాలమునుండియు గ్రంథ ములందున్నవి. తెఱనోటి నరుఁడు (ఆంధ్రనా. శత. 38).

పేరు = నామము-దీనిపై నెల్లప్పుడును నిత్యమే చేరుచున్నది. తరువాతి కాలమున 'ఇటి' కూడఁ జేరినది. (వరాహ. IX. 99; V. 70) పేరన్;—కాని, (పాండు. II. 156); పేరిటన్ (ప్రభా. I. 54); పేరిటి (భా III. 140); పేరన్; (దశావ. IX. 17) పేరిటి; (పు. 104) పేరు పేరులన్ మాణిక మను పేరితో (S. I. I. IV. 700); మా పేరిటన (S. I. I. V. 834), కృతయుగంబను పేరింటి యుత్తమకాలంబు (భార. శాంతి. VI. 410), తంత్రీపాలుండను పేరి తోడ (భార. విరా. I. 100).

పోరు—ప్రాచీనాంధ్రమున నొపవిభక్తికము; పోరికి (భార. ఉద్యో. IV. 206) అర్వాచీనగ్రంథములలో ననొప విభక్తికముగఁ గూడఁ గాన్పిం చుచున్నది—వేం. పంచ. పు. 108 (పోరునకు); (సమీ. V. 104) పోరున.

పడుమట ... పడుమటి (S. I. I. V. 147); పడుమటిజామునకు (భార. అశ్వ. IV. 221); గ్రంథములును వ్యవహారము నిల్లే.

అందఱు—(విష్ణు. పు. III. 10, 84, 104;) అందఱి (పూర్వ రూపము అందఱకు).

ఇందఱు—భారతమున ననొప విభక్తికము. (వరాహ. XI. 5) ఇందఱికి (యతి)—వ్యవహారమున నిత్యము తప్పక చేరును.

కొందఱు—(విష్ణు. పు. V. 41) కొందఱి(పూర్వరూపము: కొందఱకు).

ఏఱు—ఎల్లప్పుడు నొప విభక్తికమే. కాని (ఉ. రా. I. పు I.) ఏ, ఱును. '(యతి ప్రాసస్థానములు)—కకూర్తి కావచ్చును; 'కోడేటిపాలాన' (S. I. I.V. 131). సెలయేటి (భాగ. VIII. 49.)

మాఱు—దీనికి 'మాఱట' అను విశేషణము గలదు; మాఱటచేతులు (హరి. పూ. I. 24); మాఱటమూర్తి (భాగ. X. II. 3); అది విభక్తి రూపముగాదు.

మాఱట రుద్రుఁడు (భాగ. IV. 107); మాఱట తనువు (భార. ఆశ్ర. II. 77); మాఱట నోరిదానను (భార. ఉద్యో. III. 107); మాటి మాటికిన్ (భాగ. VI. 39); భార. ద్రోణ. II. 13); మున్మాఱటి జలపానము (భార. అను. II. 285).

కొందఱు—(వరాహ. XI. 130) కొందటి—చూ. ఇందఱు.

ముందఱు—'ముందఱు మఱంది' (S. I. I. IV. 667)= ముందటి.

ముందఱ (-ఱకి)—(కాశీ. IV. 288; వరాహ. III. 23) ముందఱికి (యతి), (ప్రభా. II. 29) ముందఱి; (పాండు. IV. 224.)ముందఱికి (యతి.); (భాగ. II. 179 III. 169)ముందట;ముందటి దెసను. (భార.ద్రోణ.III. 47).

'ఇఱి కొంగిటన్'—(నిర్వ. V. 132) 'ఇఱు' అను రూపముగలదా? 'ఇఱియు' లో 'యు' లోపించినదా?

అఱ్ఱు—దీనికి సప్తమియందు 'అరతన్' అని రాఘవపాండవీయములో రూపమున్నది. శ్లేషకు కక్కూర్తి.

ఇట్లే వసుచరిత్రము (I) న 'కొఱతంబడున్' అని 'కొఱ్ఱు' కు సప్తమి యందు శ్లేష కక్కూర్తి; 'అఱుతి తులసిపూసలు'(భాస్క. బాల. 75); 'పస్సం బఱితి' (S. I. I. V. 147); వెలుదుఱితిన్ ('వెలుదుఱుతన్' అనుటకు — S. I. I. V. 151); గంగకఱుత (S. I. I. IV. 662); పఱ్ఱు—పఱదన్ (-'తన్'కాదు—భార.శాంతి. III. 56); మిఱుతన్ (భార.శాంతి. III. 307.)

వెనుకల (వరాహ. VI. 31) వెనుకటి; ప్రభులిం. పు. 145. వెనుకటి కన్న.

అవుల—ఔప విభక్తికముఁగాదు; అవులన్ (భార. శాంతి. V. 395, II. 45.)

ఆవల—(నిర్వ. V. 4.) ఆవలి మోము చేసికొని; అవ్వలన్ (భాగ I.)

అవ్వల—(భాస్క. యు. 4.) అవ్వలిపని; అవ్వలన్ (భాగ. I. 327); నెవ్వలిసన్ను (కుమా. భా. II. 12, 169, 179);

కడపల—(మను. IV. 115) కడపలన్; వ్యవహారమునను గొన్ని గ్రంథములందును కడపటన్ (ఉ. రా. పు. 60).

దాపల—దాపట (భార. భీష్మ. II. 42; అను. II. 310 ద్రోణ. III. 471); దాపలిచేయి (భార. విరా.I. 211); దాపలికొమ్ము (భా.భీష్మ. II. 98);

మునుపల—(వరాహ. IX. 3) మునుపట; (కళా. V. 11, ప్రభా. I. 67) మునుపటి.

'మోసల'—ఔపవిభక్తికము కాదు. మోసలన్ (భాస్క. బాల. 94);

లోపల—(నిర్వ. VI. 35) లోపలి కొలువున; (భాగ. X. రుక్మి.)లోపలి సౌధంబు; కోటస్థలంబులోపలి యల్లకగడ్డగ్రామం (S. I. I. IV. 981);కడుపు లోపలిబిడ్డ (భార. అను. I. 113); నగళులలోపలి (విరా. I. 139;) హరవి. III. 7) లోపటి; (ప్రభులిం. పు. 114) లోప, లికి (యతి, ప్రాస.)

వలపల—(ఉ. రా. పు. 168) వలపటనుండి; వలపట (భార. ద్రోణ. III. 47; విరా. IV. 249; భీష్మ. II. 42 అను. II. 310) వలపలిదిక్కు (భార. విరా. I. 291).

ముంగల—(భాగ. 105, వృషా. శత. 96.) ముంగలన్.

వెలుపల—(వరాహ. XI. 7.) వెలుపటి కొలువు; (పాండు. III. 150) వెలుపటికి.

మఱుసు—మఱుసునాఁడు (వేం. పంచ. పు. 106); 'మఱుసల్'కు 'మఱుసటి' యని షష్ఠీరూపము.

లివర్ణాంతములు:-ఆఁకలి (వరాహ. VII. 199); ఆఁకటిప్రొద్దు (భా. విరా. II. 215); అఁకంటన్. (XII. 24) కొడవంటన్; (II. 45) కొడవంటి; (కళా. III. 100) కవుంగిట; (భాస్క. సుం. 14 నిర్వ. V. 132) కౌఁగిటన్; (మను. III. 110) కుఱుఁగుటన్; (నిర్వ. VII.83) చంకిటన్;-కాని,(నిర్వ. VII; 86) చంకన్; (ప్రభులిం. పు. 178) చిమ్మిటుండలు ('చలిమిటుండలు' అన వచ్చునా?) (మను. III. 75) చెంగటి; (భాగవ. I. 16: శకుంపరి. II. పు 38) చెంగటన్; (ప్రభా. V. 179) చెక్కిటన్; (భాస్క. సుం. 13.) పుడిసిటి లోనన్;(మను. IV. 92) తిరుగలి (తిరుగటన్' అనవచ్చునా; ప్రయోగములు?వ్యవహారము: తిరగలి కొట్టుటిక్కు;) (భాస్క. బాల. 668) నాఁగటన్; (ఉ. హరి. I. 10.) (నాఁగటన్; హరవి. II, 27.) పుక్కిటి; (భార. శాంతి. III. 209.)పొదిగిటను; ముంగిటి పందిటిరాట; (పాండు. V. 236 ప్రభా. III. 102) మఱుసటి; (వరాహ. VIII. 40); రోఁకంటన్; (ఉ. హరి. I. 64) లోఁగిటన్; (కళా.VI. 129; నిర్వ. II. 5)వాకిటి; (భార. శాంతి. V. 320 భాస్క. కి. 135) వాకిటికి; (భార. ద్రోణ. II. 270)వాకిలిఁ బుచ్చుము (పాండు. IV. 233, 242) ముంగిటికిన్; (ప్రభా. IV. 132) సందిట; (దశావ. పు. 277 పరగట) పుక్కిటి సాము (హరి. పు. I. 4); తఱఁగలి మెఱుఁగులు(భార. విరా. I. 294), పిడికిటి పోటు (భాగ. I. 168); దోఁయిటన్; (భార. శాంతి. V. 205) 'పట్టిలి' కొప విభక్తికమా? పట్టిటన్ అన వచ్చునా?

లువర్ణాంతములు—కాలు (ఉ. హరి. I. 96) కాలన్-ఎప్పుడును నౌపవిభక్తికమే. ఈఁగకాలియంతయేనియు (భార. శాంతి. II. 335); నలుగాలివానన్(భార. శాంతి. I. 71); నొసలు(దీనికి 'నొసలి' పూర్వరూపము; 'నొసటి' అర్వాచీనరూపము, ఆఱుపాలిసమానము (భార. అను. V. 34:) పాలివాఁడు (భార. ఆశ్ర. I. 38) పాలికిన్; (భాగ. III. 19) పాలిటి; (భాగ. I. 521; పాండు. III. 138) నొసలిలోపలి; మేలిచీరలు (భార. అను. IV. 359); మేలు

(ఇదియాపవిభక్తికమే; కాని; (శకుం. పరి. III. పు. 60 భార.అను. IV. 326; మేలునకు), ఓలు-ఓలన్ (భార. విరా. V. 35; హరి. పు.V. 243); పగలు (నన్నయ: పట్టపగల, సభా. II. 299; తిక్కన: పట్టపగలింటి సూర్యుని పగిది; (ఉ. హరి. I.152) పగటి భానుఁడు; (భార. సౌ. I. 146) పగలింటియాహవము; 'పగటి' అర్వాచీన రూపము: (దశావ. పు. 127) పగలిట; పట్టపగలింటి సూర్యుని పగిది (భార. కర్ణ. III. 18); మొదలు-పూర్వపు ఔప. మొదలి, మొదలింటి; ఆర్వా. రూపము మొదలిటి (ఉ. రా. I. పు. 11.) మొదలింట నుండియున్ (భార. విరా. II. 169); చెలియలికట్ట (భార. ద్రోణ. I. 202). వెలికి (భాగ. III. 702); జుట్టనవ్రేలనుం జూపవచ్చునే (భార. ద్రోణ. II. 304); చెలియలికి (భార. ద్రోణ. II. 140); చెలియలికట్ట (భార. భీష్మ. II. 217; III. 247 ద్రోణ. I. 202); నవతాలిప్రజలు వ్రుందనేర్తురే(భార. భీష్మ. I. 168,) చదలికి (భార.అర. VII. 21; మోడ్పుఁగేలితోన్ (భార.అను. IV. 443)-ఈపాఠమునరియైనచో 'కేలు' ఏకవచనమగును.

ఇట్లే, (దశావ. పు. 127) రాత్రిట; (పు. 143) పక్కట; (కాశీ I. 5) పాలియు, ఋషులపాలిటివే యింతలేసిపనులు; మొలనూలిమణులు (భార. శాంతి. II. 133; ద్రోణ. VI. 231); పొత్తినూలి వ్రువ్వ (భార. అను. V. 230).

అంత, ఇంత, ఎంత, లు నన్నయభాషలో నౌపవిభక్తికములు కావు. వీనిపై నర్వాచీనకాలమున'టి' వర్ణ మాగమముగా వచ్చెను. (ప్రభా. IV. 116) అంతటను; (V. 192,) అంతట (కళా III. 160) అంతటివాఁడు; (హరి. పూ.VIII. పు. 183.) అది యంతటియందున్; (VIII. పు. 181)ఇంతటి తోడ;(ఉ. హరి. I. 123) అంతటిలో; (నిర్వ. II. 99) అంతటికి; (సర్వ. మా. I. 39. ఇంతటికన్న; (వరాహ.X. 92) ఎంతటి పని, (ప్రభా. II.55) ఎంతటి,- అంతన్,మొదలగురూపములనుగూడ నర్వాచీనకవులు వాడిరి. (ఉ. హరి. I. 10) అంతనుండి; (ప్రభా. IV. 117) అంతన్ = అంతటన్; (కళా. I. 142) అంత కంతకు=క్రమముగా; (విక్రమా. IV. 17) నీరజాననుం డెంతకు నేరఁడు; (విజ. I.) అంతనుం డిన్నాల నన్నగిల్లె.

అర్వాచీనకాలమున-టివర్ణ ముపవిభక్తిగాఁ జేరిన కొన్ని శబ్దములివి, (ఉ. హరి. IV. 28) తెల్లంటి చీర (చూ: నల్లటి, ఎఱ్ఱంటి, పచ్చటి; పచ్చటి (ని) ఆకుఁ 'పచ్చాకు' వేఱు.) తెల్లటిగాన్=తెలియునట్లు (భాస్క. యు. 383) తొల్లి-పూర్వకాలపు ఔప. రూపము 'తొంటి' (భార. విరా.I. 96); తొల్లిటి (భాగ. I. 241; ప్రభా. III. 120); తొల్లింటిపెద్దలు' మొద. అర్వాచీన

రూపములు. తొలుత, తొలుతటి, తొల్లటి,' మొదలగు నౌపవిభక్తికరూపములును దరువాతికాలమున వచ్చినవి. (ప్రభులిం. పు. 164) తొలుతటి; (నమి.VII. 67) తొల్లటి; మొద. కాని, తొలుమేనన్('పాండు. IV.56.) — పంగ: దీని పూర్వరూపము 'పంగలి' యగునేమో. (మను. IV. 110) పంగటి కాళ్లు. వ్యవహారమున 'పంగరించు' = పంగలించు ? (వేం.పంచ. పు. 106.) పలుచటి.

సంఖ్యా వాచకములు.

ఒంటిన్ (ఉ. రా. I. పు. 13); ఒకటిచే (కళా. V. 27); పదునొకొంటి లెక్కలు (పాండు. III. 191); తొమ్మిదింటిలెక్కలు (పాండు. III. 179); మూఁటిలెక్కలు (పాండు. IV. 5); రెంటిని (మను. IV. 42)-'రెండింటిని' ఇంకనునర్వాచీనము; (విష్ణు. పు. I. 57.) నలుగురికి. (I. 60.) ముగురిన్) పాండు. II. 4.) ఇద్దఱి; నాలుగిటికి (కళా. V. 27)- 'నాలుగింటికి' ఇంకను నర్వాచీనము;డెబ్బదిట (ఉ. హరి. I. 46);-'పదిట' ననవచ్చునా ?-అన్నింటిని (ఉ. హరి. I. 140); అన్నింటిపనులు (నిర్వ. I. 63); కొన్నింటన్ (పాండు. II. 212); కొన్నింటినాళులు (హరి. పూ. VIII. పు. 202)

కొండి—ఇది ప్రభులిం. పు. 170 లో నౌపవిభక్తికముగ వాడఁబడినది. 'కొంటన్'

కాను—ఇది యౌపవిభక్తికమా ? కానట్లేతోఁచుచున్నది.

చదలు (భార. చదలన్; హరవి. 136. చదలునకు);

ప్రోలన్-దీనికి ప్రథమైకవచన రూపమేమో ? ప్రోలు ?

కడ—ఇది ఔపవిభక్తికముకాదు; కాని, అక్కడ, ఇక్కడ, ఎక్కడ, లౌపవిభక్తికముగ నున్నవి: ఎక్కడిదానవు (భార.విరా. I. 90), ఎక్కడిమాట (భార. విరా. I. 281); భయమునాకెక్కడిది (భార. ఉద్యో. IV. 216.) అఱకడన్ (భార. ఆది. VI. 114, 160; ఉద్యో. III. 310; భాగ. V. I. 106); దీనికి బ్రథమైకవచనరూపము 'అఱకల్' అనునది.'అఱకటన్' అనియే వ్రాతప్రతుల పాఠము. ఈ పాఠాంతరములను గుర్తించియు 'అఱకలి' యను రూపము నూహించియు 'అఱకడన్' అని యేల ముద్రించిరో తెలియదు.

వాడ—దీనిపైఁ బ్రథమేతరవిభక్తియం దిత్వము మాత్రము చేరి, డకారమునకుఁ బరుషత్వముకలుగకున్నరూపము శాసనములందు గలదు: కొండనాతవాడిలోని (S. I. I. VI. 237.)

కట్టు—'ఆడుకట్టన్' (విరా. I. 228), ఇచట 'కట్టు' ఔపవిభక్తికముగఁ బ్రయోగింపఁబడినది.

చక్కటి=ప్రక్క, దగ్గరతావున, ఇది ప్రథమైకవచన రూపము కాదు; ఈ చక్కటి నిలుతమె (భార. విరా. I. 156); ఇచట సప్తమీవిభక్తిరూపమువలె కాన్పించుచున్నది. అయిన దాని ప్రథమైకవచన రూప మికారాంతమైయుండవలెను. 'చక్కటి' అని షష్ఠీరూపము కూడఁగలదు. ఇది తొలుత'ల' కారంత పదమై 'చక్కల్' అనియుండవలెను. చూ. వెనుక (ల్)+ఇ=వెనుకటి.

దర్భగంటిన్ (భార. శల్య. II. 160)- 'దర్భగంటన్' అనియుండవలె నేమో. అయిన దీని ప్రథమైకవచన రూపము 'కంటు' అగును; ఇది 'కన్ను' అనుపదమునకు రూపాంతర మగును.

పాపటన్(భార.విరా. I. 228)-'పాపట' అనునది ప్రథమైకవచనరూపమగునా ? దీని ప్రథమైకవచన రూపముతొలుత 'పాపల్' అయియుండును; దీనికి 'పాపటన్' అనునది సప్తమ్యేకవచనరూపము. కాని, 'పాపటి' అనుషష్ఠీరూపము నకుఁ బ్రయోగము కానరాదు.

పట్టు—'బంటి' (చూ. కుత్తుకబంటి, మొద.) అనునది 'పట్టు' అను దాని యూపవిభక్తికరూపమై యుండవలెను. పట్టు+ఇ=పట్టి= * పంటి=(సరళాదేశము) బంటి. ఇంతబంటి (ఉ. హరి. V. 26) మొద.

పోల్ రూ. పోన్+ఇ=పోని; పోణ్+ఇ= * పోణ్ణి-* పోణ్ణీ= (సరళాదేశము) బోణ్టి=బోఁటి; 'వంటి' 'బోణ్టీకి' రూపాంతరమా? లేక 'వలె'కు మూలమయిన * వల్=వన్=వణ్+ఇ=* వణ్ణి=వంటి అని రూపనిష్పత్తిఁగల్పింపవలె నేమో: విత్తువంటి (పాండు. III. 2;) అటువంటి (పాండు. IV. 145; V. 238) ఎటువంటి (పాండు. IV. 160); మావంటి (పాండు. V. 43); కల్పకంబువంటి (పాండు V. 197); తాయివంటి, జాతివంటి, (పాండు. V. 212); 'వంటి' అర్వాచీన గ్రంథములోనున్నది; 'బోఁటి,' 'అట్టి' (భార. ఆర. V. 115) అనునవి ప్రాచీన గ్రంథముల నున్నవి.

చట్టన్—ఇది యవ్యయము; 'చట్టు' కు సప్తమ్యేకవచన రూపమై యుండును. 'చట్టన'=చట్+అనన్, అని ప్రాచీన గ్రంథములం దున్నది. నేడు 'చట్టున' అని వ్యవహారము. 'చట్టన్' అని యూపవిభక్తికముగ (భార. ఆర. IV. 317) లో ప్రయోగమున్నది. మానార్థక ప్రత్యయమగు'-ఎడు'లోని'డ' కారమునకుఁ బరువత్వమును ఇకారమునుగాని; డు వర్ణమువై ఇటి, ఇంటి, అనునవికాని చేరుచుండును: అడ్డెటికి, అడ్డెంటికి, అడ్డెడిటికి, అడ్డెడింటికి; ఇట్లే తవ్వ, సోల, మాన, మణుగు, వీసె, రూపాయి, అణా, పావలా, దమ్మిడీ మొదలయిన యనేకశబ్దములపై నేఁ డౌపవిభక్తికకార్యములు గాన్పించు చున్నవి; పూర్వ కాలపు శాసనములందును నిట్టి వాని కుదాహరణములు గలవు.

'పాటు=విధము' ఔపవిభక్తికము: ఎంతగాలమయిన నిప్పాట భరియిం చుండనోపవ్ (భార.ఆది. IV. 228); ఇట్లే 'ఎప్పాటన్' (ఆది. I. 114. ఆది. III. 50, ఆది. IV. 70, ఆది. V. 170, సభా. 126, సభా. II. 147, అర. II. 110, అర. IV. 108, 119, మొద.) షష్ఠీఏకవచనము: పాటి—'ఇప్పాటినో ములు దొల్లి కడఁగి నోచితినిగాకేమి (ఆది. IV. 102); ఇట్టిపాటి వెఱపించుట లును మాయలును నేమిసేయు (ఆది. VII. 43.) ఎవ్వరున్ధర్మజుపాటిగారు (భార. ఉద్యో. I. 51;)

పాడి—ఇది తొలుత 'పాడు' అను పదమునకు షష్ఠ్యేకవచనరూపము; డకారమునకుఁ బరుషత్వము గూడఁగలిగి 'పాటి' యైనది. పాడి, పాటి, అను రెండును ప్రథమైకవచనమున స్థిరపడినవి. "కోటయు మిన్నును దమలోఁ బాటికి జగడింప" (భాగ. X ); "మిన్నేటి పాటియుఁ బెన్నయున్నతియు విపాశవాసియుఁ జంద్రభాగ చేగయును" (పాండు. I.); బ్రహ్మదండంబుల పాటియై మర్మంబు లిట్టు నోనాటునే యితనిచేత (భార. భీష్మ. III.); "నావుడు నేమియుం బలుక నాలుకలాడక పాటియైన ధాత్రీవరకోటియుండె నొకదిక్కున (ఉ. హరి. III.) అనినవిని యమ్మాటలు పాటిగాఁబట్టి విరాటుండు భయ భక్తియుక్తంబుగా వేఁడికొనిన(భార. విరా. V.); "బాదరాయణుభక్తియేపాటి యదియొ" (కాశీ. VII.); పాటు=ధర్మము (హరిపు. V. 6.)

'పువ్వటమ్ములు (భా. విరా. II. 28), ఇట్లే, 'కఱకుటమ్ము' మొదలగు వానిలో 'టి' వర్ణ మాగమముగావచ్చి విశేష్యములను విశేషణములుగ మార్చియుండును.

'పుట్టెంటిపట్టు' (S. I. I. VI. 98); అడ్డంటి లెక్కను (S. I. I. V. 1157); అడ్యంటిలెక్క (S. I. I. V. 1180); నగమింటిలోను; వీనిలో 'టి' వర్ణము 'ఎడు' ఔపవిభక్తిక ప్రత్యయమగుటచేఁ గలిగియుండును.

'కటికివాఁడు' (భాగ. X. II. 84); కటికిచీకటితిండి (మను. I.); కటి కినగవు (కాశీ. VI. 227); ఇందు 'కటిక' అను పదముపై నిత్వము చేరినది.

'వేఁబోకటి మలయపవనుఁడు', (భార.విరా. II. 238); వేగుంబోకటన్ (భార. ఉద్యో. III. 245); ఇందు'వేఁబోక' పై టి వర్ణము చేరినది; ఇట్లే, 'లేఁగ, లేని లేఁగటికుట్టి (భాగ. I. 395.)

ఇఁకఁ జాలును. ఏవి యౌపవిభక్తికములు, ఏవి యనౌపవిభక్తికములు నని యిప్పటి వాడుకనుబట్టి నిరూపింపవచ్చును. భాష ప్రాచీనావస్థలో నాయా పదముల స్వరూపమెట్లున్నదో చెప్పుట చాలకష్టము. ఎంత పరిశోధిం చినను నెన్నియో సందేహములు కలుగుచునేయుండును. అచ్చు ప్రతులలోని ...

నేల (భార. భీ. I. 186); చెనంటి తెలుంగునకుఁ జొచ్చి చెడిపోవుదుఁడిన్ (భార. అర. VI. 19); తటికింజొచ్చి (భార. భీ. II. 183).

(25) డాయు: కొలనికి డాసెన్ (భార. అర. VII. 397).

(26) తప్పు: ఈ వనభూమి ... వసతికిఁదప్పె (హరి. పూ. VI. 15); యీ ధర్మార్గానకు దప్పినా (S. I. I. IV. 280).

(27) తలకడచు: తోడంబుట్టువుసకుం దలకడచి (భార.ద్రో. I. 198).

(28) తిగుచు: నీరికిందిగిచి (భార. ద్రో. III. 305).

(29) తెగు: పోరికిఁదెగిరి (భార. ఉ. IV. 167).

(30) తెచ్చు: నాలుకకుఁ దెచ్చినమాట (భార. కర్ణ. II. 11).

(31) తొలఁగు: అనికిఁ దొలఁగి చను (భార. ద్రో. I. 229); సకల దురితములకుఁ దొలఁగింతు నిన్ను (భార. భీ. I. 224); రథంబు ... సమర ప్రదేశంబునకుఁ దొలంగఁ బఱచె (భార. అర. VI. 8).

(32) త్రుంచు: శల్యుచాపంబు ముష్టికింద్రుంచినన్ (భార. ద్రో. III. 223).

(33) దాఁటు: ఉర్వికి దాఁటిపోయె (భార. ద్రో. IV. 150).

(34) నవ్వు: దీనికి నవ్వుదురు (భార. విరా. IV. 189).

(35) నేర్చు: ఇంతకు నేర్చు నీకు (భార. విరా. I. 2); మీరలాపనికి నేర్తురే (భార. అశ్వ. I. 148); నేర్తురాయుధములకెల్ల (భార. ఉ. IV. 266); పరలోకసౌఖ్యముల్ గనుటకు నేరరు (భార. అర. IV. 176); భీముఁడు గదకు నేర్చు (భార. ఉ. II. 217).

(36)పట్టు: నాకెట్టు మనంబు పట్టు (భార. విరా. II. 192).

(37) పుచ్చు: మద్రనాథుని చనియెడు మార్గమునకుఁ బుచ్చి (భార. ఉ. I. 92).

(38) పెట్టు: ధృతికిఁ బట్టువెట్టు (భార. విరా. II. 299).

(39) పొందు: అతనికి నెట్టియెడల దురిత మేలపొందు (భార. అర. VI. 332.)

(40) మార్కొను: సేనకు మార్కొనన్ (భార. విరా. V. 279); దీనికి మార్కొనఁజాలెడు దానికి (భార. విరా. II. 9).

(41) మీఱు: వృత్రు బాహుబలం బలవికి మీఱెను (భార. ఉ. I. 126) ఇట్లే, మిగులు.

(42) మెచ్చు: నీకు మెచ్చుగన్ (భార. అర. IV. 397); ఇట్లే, నీకు మెచ్చితిని; మొద,

(43) మేకొను: కీడుపాటునకు మేకొనఁ జాలదు (భార. విరా. I. 103).

(44) రోయు: అతని యభిప్రాయంబునకు రోసి (భార. ద్రో. I. 112).

(45) వచ్చు: భవదుదారవాగ్భంగికి మెచ్చువచ్చె (భార. అర. VII. 224); నేను నరుని చిత్తమునకు వచ్చువాఁడ (భార. విరా. I. 285); నను ముట్ట నెవ్వరికి వచ్చు (భార. విరా. II. 104); నేను మహీవరుని చిత్తమునకు వచ్చు వాఁడ (భార. విరా. I. 285); ఇట్టి కష్టమునకు వచ్చితిని (భార. అర. VI. 20); సారసానకు వచ్చిన చందమునను (భార. భీ. I. 142); ఏటు పోటు తలకు వచ్చి (భార. కర్ణ. III. 197.)

(46) వేడ్కసేయు: పాండుతనయు లని సేఁతకు వేడ్కసేయుట (భార. విరా. III. 197).

(47) వ్రస్సపడు: పేర్మికి వ్రస్సపడక (భార. శాం. V. 324).

(48) సంతసమందు: నకుల సహదేవులు దానికి సంతసమంది (భార. ఉ. III. 144).

(49) సైఁచు: ఈ దుర్భాషితములు మాకు సైఁపవు (భార. అర. IV. 345); మనుజుగా నిన్నుఁ గను తప్పు మాకు సైఁపుము (హరి. పూ. VII. 237)—ఇట్లే, సహించు, సైరించు, కోపించు, కరుణించు, మొదలగు ననేక ధాతువులతో 'కు' షష్ఠీకారకము ప్రాచీనకృతులందు గానవచ్చుచున్నది.

అర్వాచీనకృతులం దిట్టి షష్ఠీకారకమున మార్పు గలిగినది: ఇతనిపై నలుగవలదు (భాస్క. యు. 1739; పూర్వకృతులు: ఇతని కలుగవలదు); నా బాల్యంబుఁ గరుణసైఁపవలయు (భార. అర. VII. 334; నన్నయ: నా బాల్యంబునకుఁ గరుణసైఁపవలయు); ఘోరదుఃఖవేదనములు సైఁచె (భార. అర. V. 334; నన్నయ: వేదనములకు); దానిపయికిన్ లంఘించినన్ (భార. ద్రో. IV. 235; పూర్వకృతులు: దానికి లంఘించినన్).

కు-వర్ణకము నుపయోగమును దెలుపు కొన్నిప్రయోగము లీ క్రింద పొందుపఱుపఁ బడుచున్నవి:—

(i) మదలోభిత్వములు లేవు మందునకయినన్ (భార. ఆశ్ర. I. 104); పెండ్లికిఁ బిలిచిన యట్లు వికచహృదయుఁడై (భార. విరా. II. 323); చెవికిం జేదగు నీవాక్యము (భార. ఉ. II. 94); పగకు మేలిమి లేదు ధ్రువంబు (భార. ఉ. III. 21); కంటికిన్ ఱెప్పయుఁబోలె (భార. ఉ. IV. 114); అనికి రక్కసుఁడు (భార. ఉ. IV. 222; చూ. తిండికి తిమ్మక్క; పనికిబొమ్మక్క); మీరులేక వేఁగునె మాకున్ (హరి. పూ. V. 231); అందుకుఁ దోడు (భోజరా. VI.142);

అందు = అది; అందుకు = దానికి); నడపుకవచ్చేటందుకు (S. I. I. IV. 280; వచ్చుకొఱకు); మెట్టునకుఁ జన్నె తరములు వెట్టిచూడ (హరి. పూ. VIII. 70); దానికేను సంవాదము సేయువాఁడ (భార. అను. I. 188); వలసిన కడ కేఁగెద (భార. విరా. I. 224); తమతల్లితండ్రికి = తల్లికిని దండ్రికిని = తల్లిదండ్రులకు (S. I. I. IV. 919); తమతల్లిందండ్రికి = తల్లికినిదండ్రికిని= తల్లిదండ్రులకు (S. I. I. IV. 751); ఇట్టిపనికి నూఱడిల్లి = ఇట్టిపనిచేయుటకు సమాధానపడి (భార. విరా. II. 30); ఒక్కడుగు నేఁగెడుదానికి నోర్వ = ఏఁగుటకు (భార. విరా. 148); ఎల్లవెంటకును గొఱంతలేక = దేనికిని (భార. ఉ. II. 77); పాండుపుత్త్రులమాత్రకు భయము నాకు నెక్కడిది (భార. ఉ. IV. 216); కాలముగాదు దానికిన్ (భార. భీ. I. 159); వరవునకు నల్గినట్టులు నరకుగొనక (భార. విరా. III. 185); క్రొత్తముట్టున కియ్యకొలుపు వెరవు (భార. విరా. I. 95); ఇట్టిమహిమ కలిమికిఁ గతమెయ్యది (భార. అర. IV. 189); సమ్మదపూరమునకు గఱువతనమను బలితంపుఁ గట్టవెట్టి (భార. విరా. III. 55); చూడ్కికిఁ జుబ్బనఁజూఱ (భార. విరా. II. 86); వెట్టనికోట నీకు హరి (భార. ఉ. I. 297); అతఁ డతిరథులకెల్లఁ దల (భార. ఉ. IV. 268); దానికేమి = అదియటుండనిమ్ము (భార. విరా. II. 228); ఇందులకు నెయి = దీనికి (S. I. I. V. 1180); నీ వతనికిఁ గాన్పమ = కనఁబడుము (భార. ఉ. I. 270); మీ రమ్మికొనుఁడు సేయువెలలకు (భార. అను. II. 265); ఇందుకు = దీనికి (S. I. I. IV. 280).

(ii) ధర్మ్మానకు (S. I. I. IV. 280); బియ్యానకు (S. I. I. VI. 1059); దశబందానకుంగా (S. I. I. 923, శక. 1300); నెఱదీపానకు (S.I. I. VI. 928); చుట్టాలకు (భాగ. I. 233); కయ్యానకు (భార. ఉ. IV. 266); బుక్కపట్నానకు (S. I. I. V. 874); నాయంకరానకు (S. I. I. IV. 801).

(iii) ఎట్టకేనియు (భార. అర. V. 414); ఎట్టకేలకు (భార. అర. V. 371); ఎట్ట, ఏల లపైఁ గువర్ణకము; ఆఱునాళ్లకున (భార. అర. V. 223; 'కున్' పై నవధారణాకారము).

(iv) 'కు' చేరి యవ్యయమగుట: నిజంబునకు = నిజముగా (భార. స్త్రీ. II. 12); నిక్కమునకేమును డస్సితిమి (భార. విరా. I. 154).

(v) వీప్సార్థమున: మ్రాని మ్రానికి నరిగి యరిగి యడుగు (భార. అర. II); ఇండ్లిండ్లకు (కళా. III); ఇంటింటికిన్ (భాగ. IV. 860); మాటమాటకు (భాగ. I. 48).

(vi) కాలార్థమున: కొండొకసేపునకుఁ దెలిసి (హరి. ఉ. I); నెట్టన వర్షావధికిం బెట్టంగల యప్పనములు వెట్టియు (వి. పు. VII.), పార్థునిశిర మాఱునెలల కుర్వీఁ ద్రెళ్లఁ శపియించి (జై. IV), మొద.

అంతకు, ఇంతకు, ఎంతకు

అంతకుఁ దెలివొందె = ఆకాలమునకు లోఁగానే (భార. ద్రో. V. 173); అంత కేమియుననక = అంతకంటె (భార. కర్ణ. I. 14); అంతకు = అంత వఱకు (భార. శల్య. II. 64; కర్ణ. III. 351; విరా. III. 67; అను. II. 301; S. I. I. IV. 737); దశాననుండు నీచెప్పినయంతకుఁ గలఁడు = చెప్పినంత సామర్థ్యము గలవాఁడు (భాస్క. యు. 2263); పొద్దుగ్రుంకునంతకుఁ గరిపురిసొచ్చి = క్రుంకువేళకు (భార. ఉ. II. 2); అంతకంతకున్ = ఒకదాని కంటె నొకటిగా (భార. భీ. I. 26); ఇంతకు = ఇంతటిపనికి (హరి. పూ. IX. 77); భాస్క. అర. II. 248); ఇంతకు నేర్చు నీకు=ఇంత చేయుటకు (భార. విరా. I. 21); వారు సచ్చినచోటఁ బూరియున్ మొలవదె యింతకు = ఈ పాటికి (భార. విరా. III. 95); ఇంతకు వత్తురు = కొలఁదికాలములోనే; వచ్చువేళ యైనది (భార. అర. VI. 158); ఇంతిం గాము డిట తేఁడె యింతకని = ఇంత లోనే, చాల శీఘ్రముగా (భార. విరా. II. 330); ఇంతక = ఇంతలోనే (కాలము) (భార. ఉ. III. 400); ఇంతకున్=దీనికంతటికిని (భార. భీ. I. 27); ఎంతకైనఁ జాలుదు = ఎంతటి పనిచేయుటకైనను (భాస్క. అర. I. 189); —ఇంకను అంతకు, ఇంతకు, ఎంతకు, అనున వనేకార్థములందు వాడఁబడును. వాని నన్నిటి నిట వివరింపఁ దావులేదు.

(vii) శేషషష్ఠ్యర్థమునఁ గువర్ణము: దానికిఁ బేరు సుదర్శన = దానిపేరు (భార. అను. I. 46); అందెకున్ మొగపు మాణిక్యము (వరాహ. VIII. 35); గొంతికిఁ బ్రాణము ప్రాణము (భార. విరా. V. 328).

(viii) 'నః శా' (ఆంధ్ర శబ్ద చింతామణి) - అనఁగా 'కు. విభక్తి ప్రత్యయము పరమగునప్పుడు నగాగమము వచ్చును.' అథర్వణుఁడు దీనిని 'తఱచుగ ఋకారాంత శబ్దములపైఁ గూడ వచ్చు' నని సవరించినాఁడు. ఈ వాక్యముల నాధారముగఁ జేసికొని యహోబలుఁడు భాస్కరరామాయణ మందలి 'రామాయణముగ రచించి ప్రాచేతసుకున్' అను ప్రయోగమును 'ప్రాచేతసుకై' అనియు, పారిజాతాపహరణమందలి' వంతుకువచ్చు సత్యగరువంబు' అనుదానిని 'వంతున కెక్కు సత్య గరువంబు' అనియు సవరించుకొొన వలెనన్నాఁడు. చిన్నయసూరి ఋకారాంతముల కనుగ్రహించిన ప్రాయస్త్వము నను గణింపక యచటను నగాగమము నిత్యమన్నాఁడు. చిన్నయసూరి

సూత్రమును సవరించు నుద్దేశముతోఁ బ్రౌఢవ్యాకరణకారుఁడు "కు వర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబు వారి ప్రయోగంబులం దక్కఁ దక్కిన మహాకవి ప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టెడు" అని చెప్పి 'ప్రాచేతసునకున్, బచ్చునకున్' అను నుదాహరణముల నిచ్చియున్నాఁడు. నేటి కొందఱు పండితులు ప్రౌఢవ్యాకరణమును బ్రమాణముగ నంగీకరింపక నగాగమము నిత్యముగఁ బాటింపవలెనందురు. ఈ 'నఙి కౌ' సూత్రము నేటి గ్రంథకర్తల ప్రయోగములం దెన్నడును గని విని యెఱుఁగని వింత కృతకరూపములకు హేతువైనది. అందు, ఇందు, ఎందు, ముందు, మొదలగుశబ్దములపైఁ గూడ నేఁడుగొందఱు నగాగమమునుచేసి, అందునకు; ఇందునకు, ఎందునకు, ముందునకు, అని ప్రయోగించుచున్నారు. ఇవియన్నియు కృతకములే. అందులకు, ఇందులకు, ఎందులకు, ముందటికి, అనునవి వీని ప్రాచీనరూపములు. అందుకు, ఇందుకు, ఎందుకు, ముందుకు, మొదలయినవి కవిసమ్మతములయిన యర్వాచీన రూపములు; ఈ నగాగమములేనిరూపములు పదునాల్గవశతాబ్దము నుండియు భాషయం దున్నవి. కవులు వానిని యథేచ్ఛముగ వాడినారు.

ఉదాహరణములు:—మోముకు (అని. I. 81); పెండ్లికొడుకుకు (అని. I. 98); వాఁగుకు (అప్ప); కసవుకు (ఆంధ్ర. నానా.); పేరుకు (ఆం. భా. I. 19); పైరుకు (ఆం. భా. III. 32); లోఁతుకు (ఇందు. ప. III. 60); దిక్కుకు (ఉ. హరి. II. 40); ఉత్సవముకు (ఉ. హ. VI. 140); తూపుకు (కవిక. III. 119); పచ్చనాకుకు (కవిక. IV. 95); గురువుకు (కవిరాజ. 111); కఱవుకు (కువ. I. 101), మంతుకు; (కిరాతా. I. 210); పోటుౘజుకు (కిరాతా. IV. 100); కీడుకు (కిరాతా. IV. 199); మందుకు (కేయూర. III. 171); కౌనుకు (నన్నె. కుమా. VIII. 16); నభముకు (నన్నె. కుమా. XI. 734); పనిపాటుకు (గంధ.); నృపాలుకు; అప్పారావుకు; నీలాద్రిరాజుకు (చంద్ర. వి.); పట్టుకు (చంద్రభా.); వాదుకు (చమ. I. 109); రాజుకు (జైమిని. VIII. 57); చూలుకు, రాజుకు, అంతవట్టుకు (నిర్వ. వి. రా.); బచ్చుకు (నైష. VI. 115); చెఱువుకు (పంచత. I. 70); పోతుకు (పంచత. I. 246); చేటుకు (పంచత); భవుకు (పట్టాభిరా. III. 98); తనువుకు (పట్టాభిరా. V. 145); మనసుకు (పట్టాభిరా. V.); పురముకు (పద్మ. ఉ. ఖ. I. 116); నగముకు (పద్మ. ఉ. ఖ. I. 148); వికుండలుకు (పద్మ. ఉ. ఖ. III. 46) ఒరుకు (పద్మ. ఉ. ఖ. II. 222); చేటుకు (పద్మ. ఉ. ఖ. VII. 97); లోకముకు (పద్మ. ఉ. ఖ. IX. 380); సూడుకు (పాండు. II. 175); చెట్టుకు (పద్మ. ఉ. ఖ. III. 54); ధేనుకు (పద్మ. ఉ. ఖ. IV. 77); మరాళముకు (పద్మ. ఉ. ఖ. V. 24); విషముకు (పద్మ. ఉ. ఖ. V. 77); చిచ్చుకు (పాలవర్తి సోమేశ్వరుఁడు; నన్నె.

కుమా. టీక I. 160); వంతుకు (హరి. సర్వ. సా. నం. లో నుదాహృతము I. 82); వాదుకు (ప్రభా. II. 92); రాజుకు (ప్రభా. I. 104); వృత్రుకు (ప్రబో.); బసవుకు (బసవ. పిడు); దేవదేవుకు (బసవ. పిడు); తెరువుకు (బసవ. పిడు); ఆతపరాజుకు (బవస. పిడు): ఎఱుకుకు (భాగ.); వ్రాతముకు (భాగ. II. 85, 201); మనువుకు (భాగ. II. 142); వనముకు (భాగ. IV. 358); రాజుకు (భాగ. IV. 442); ఎదురుకు (భీమ. IV. 12); ధేనువుకు (భోజ. II. 48); కసవుకు (భోజ. IV. 62); కాయముకు (భోజ. III. 107); బింబముకు (భోజ. VII. 45); పడుచుకు (భోజ. V. 299); కొడుకుకు (భోజ. I. 327); రాజ్యముకు (భోజ. VI. 366); ఆయాసముకు (భోజ. VI. 380) పొద్దుకు (భోజ. V. 336); గృహంబుకు, తడవుకు (భోజ. VI. 13); పురంబుకు (భోజ. VI. 84) వాదుకు (భోజ. VI. 142); శ్వాసముకు (భోజ. VI. 354); కానుకు (భోజ. VI. 341); రాజుకు, వాదుకు, పోరుకు, విందుకు (రాధికా.); వానవుకు (రామస్త.); చెట్టుకు, ఏనుఁగుకు, నుతుకు (రుక్మాంగ.); తడవుకు (వరాహ.); నూఱుకు (వరాహ. II. 51); గట్టుకు (వరాహ. X. 144); వంశజుకు (వాసి. రా.); కాలుకు (వాసి. రా.); వనరుహనాభుకు (విక్ర. I. 36); పొత్తుకు (విక్ర. VI. 59); సిగ్గుకు (విజయ. II. 30); శ్రీమంతుకు (విజయ. II. 37); వాదుకు (విజయ.); పనిపాటుకు (వైజ. II. 126); మంతుకు (శశాంక. I. 16, 54); పోగుకు (శశాంక. II. 20); మంచుకు (శశాంక. I. 80); పొద్దుకు (శశాంక. I. 109); పద్దుకు (శశి.); రాజుకు, ధనువుకు, కొడుకుకు (శశి.) హితంబుకు, హితవుకు (శివ.); మొగముకు (శైవపు.); సొంపుకు (శ్రీరంగ. భైరవ I. 252); మనసుకు, కాలముకు (శ్రీరంగ. V. 1207); రాజ్యపదముకు (శ్రీరంగ. V. 1277); శ్రేష్ఠుకు (శ్రీరంగ. I. 29); మఱువుకు (శ్రీరంగ. I. 138); పొందుకు (శ్రీరంగ. I. 167); బ్రహ్మంబుకు (శ్రీరంగ. II. 429); ప్రదేశముకు (శ్రీరంగ. III. 721); యోగంబుకు (శ్రీరంగ. IV. 879); నెలవుకు (శ్రీరంగ. IV. 989); కైవల్యముకు (శ్రీరంగ. V. 1228); ఏనుఁగుకు (శృం. శా. II. 196); పొడవుకు (సమీ. V. 17); ఖగరాజుకు (సమీ. VI. 138); మఱువుకు, అనుభవముకు, ముందుకు, పొద్దుకు, కానుకు (సానం.); గొట్టుకు (నానా. 86); చెఱువుకు, తంతువుకు (స్థావర. 88); చెట్టుకు (నానా. 90); తిట్టుకు (నానా. 94); పులుఁగుకు (నానా.); విందుకు (సారం.); ద్విజరాజుకు (సునందా పరి.); వాదుకు (హంస. I. 233); అంచుకు (హంస. I. 236); అఖిలముకు (ఉ. హరి. VIII. 199); వసుదేవుకు (VIII. 226,322) నూడుకు (పాండు. II. 175); ఎఱుకుకు (భాగ. XII. 723); వడుగుకు (భాగ. VII. 422); మడుగుకుఁ జని (కృ. శత. 17); తోఁబుట్టుకున్ (బం.

రఘు. శత. 68); బిడువుకు, ఘట్టుకు (S. I. I. IV); ధరాధిపుకు (భాగ.III.II.) మనువుకు (భాగ. II. 144); కడుఁబొడవుకెగసి (భాస్క. సుం. 383), మొద.

అందుకు.

కువ. III. 122; కృష్ణ. III.199; చంద్రికా. IV. 102; చిత్రభా. VI. 78; చంపూరా. V. 92; నిర్వ. వి.రా; పట్టాభి. IV. 1141. రాజశే. II. 55; రామా. V. 288; హంస. I. 84; 123, మొద.

ఇందుకు.

కృష్ణ. II. 97; చంద్రభా. I. 144; చంపూరా. IV. 79; III. 73; V. 72; VI. 18; నిర్వ. వి. రా.; రామస్త. రామా. V. 242; రుక్మాం. వరాహ. IX. 8, 44, 85; వసు. III. 144.

ఎందుకు.

దశ. VIII. 235; నరసింహ. హరిభట్టు. I. 124; నిర్వ. విరా. పట్టాభి (II. 117); రాజశే. I. 114; రాధా. III. 62; రామస్త. హంస. V. 171.

అందటికి, ఇందటికి, ఎందటికి, ఇద్దటికి, ఆర్వురికి- మొదలగు రూపములు బాలవ్యాకరణముఁ బట్టి సాధింప వీలులేకుండుటచే నవి గ్రామ్యములని కొందఱు తలంతురు. కాని, యట్టివానికిఁ బ్రౌఢవ్యాకరణకారుఁడు సాధుత్వమును గల్పించినాఁడు. వ్యవహారమునందు ఇత్వముతోఁ గూడిన రేఫమే యిట్టి శబ్దములందు వినఁబడుచున్నది. గ్రంథములందును నిట్టి ప్రయోగములు లేకపోలేదు. యతిస్థానముననుండి యొక్క యుదాహరణము :

క. దనుజుఁ బరిమార్చి యందటికిని దానవబాధఁదీర్చి కృతకృత్యుండై
మునిజనములు హర్షింపఁగ,జననాయకమౌళి విజయశంఖం బొత్తెన్.

(శకుంతలా పరిణయము)

చాకుండమున్న (భార. విరా. III. 118.); తిరుగుచుండఁగఁ గారణమేమి (సర్వ. మా. II. 50.) మొదలగు రీతులఁ గు వర్ణకము చేరునప్పుడు గలుగు నర్థము వ్యక్తమగును.

శేషషష్ఠి.

సంబంధార్థమున వచ్చు షష్ఠికి శేషషష్ఠి అనిపేరు. ఇదియే తెనుఁగున సరియైన షష్ఠి. కు, కి, వర్ణకములు వాస్తవముగ చతుర్థీప్రత్యయములు; అల్లే లో, లోపల, లు సప్తమీప్రత్యయములనవలెను. శేషషష్ఠియందు 'యొక్క' వర్ణకమును వైయాకరణులు విధింతురు. కాని, యాప్రత్యయము వ్యాఖ్యానావసరమున వచ్చును గాని, ప్రయోగములందు కానరాదు.

(1) సాధారణముగ నదంతపదముల ప్రథమైకవచన రూపమే షష్ఠ్యేక వచనమునను శేషషష్ఠియందు నిలుచును: దూతమాట, తాత దగ్గు, అవ్వ సొముఁగు, మొద. అచ్ఛికపదములం దన్ని యచ్చులతో నంతమందు పదములును శేషషష్ఠియందట్లే నిలుచును: కోఁతిచేష్ట, ఆవుపాలు, గేదెకొమ్ము, మొద.

(2) డుమంతశబ్దములందు శేషషష్ఠ్యేకవచనమునఁ బ్రథమేతర విభక్తుల ప్రాతిపదికములపై 'ని' వర్ణము వైకల్పికముగఁ జేరును: రాము మాట, రామునిమాట; శంభుకన్ను, శంభునికన్ను; విధాతృచెయ్యి, విధాతృనిచెయ్యి; మొద. మగాదులపై 'ని' వర్ణము నిత్యముగా వచ్చును: మగనిమాట, రాయనిపలుకు, మొద.

(3) 'ని' వర్ణమందలి నకార మాగమాక్షరము; 'ఇ'త్తు మాత్రము సంబంధమును దెలియఁజేయు వర్ణము. ఈ యివర్ణమే యాపవిభక్తిక పదములపై శేషషష్ఠియందు చేరును. ఇంటి, ఏటి, నేతి, మొద.

(4) బహువచనమునఁ దెనుఁగున శేషషష్ఠియందు 'అ' కారము చేరును: రాముల, బాలుర, ఆంధ్ర, మొసళ్ల, మొద. కన్నడమున నేక బహువచనముల రెంటను శేషషష్ఠియం దకారముచేరును: రామన, రామర; అవన, అవర, మొద.

(5) ఈ క్రింది సందర్భములందు కర్తృపదప్రథమకు తఱచుగ శేషషష్ఠి కావ్యప్రయోగములందును, నొకప్పుడు వ్యవహారమునందును కానఁబడుచున్నది:

(i) ధాతుజ విశేషణ పూర్వవ్యవహిత కర్తృపదప్రథమకు: బాహుకు రథంబు గడపు నేర్పున కచ్చెరువడి (భార. ఆర. II) తన మును వడ్డ బన్నములు (భార. ఉ. III); తన మున్ను గన్నటులు గామికి (హరి. ఉ. IX); నాయొనర్పంబూనిన కళాపూర్ణోదయంబు (కళా. I).

(ii) ధాతుజ విశేషణ పూర్వావ్యవహిత కర్తృపదప్రథమకు: అన్నల భూపాలకు పోయిన వలను (భార. ఆర. II); వాని పన్నిన వృషభగోమయ భక్షణంబు (భార. ఆది. I); హింసచేసిన వారల యేఁగుగతికి (భార.ఆది.VII); నా చూడనిరాజు లెవ్వరును లేరు. (భార. ఆర. II); మా పడిమెదు నీ యవస్థ (భార. ఆది. II); నీ చేయువేదన నన్నుదాఁక నోఁపదు. (భార. ఆది II); తనవినినంతకంటెను (భార. ఆర. II).

(iii) భావార్థ పూర్వ వ్యవహిత కర్తృపదప్రథమకు: మనపుట్టిబుద్ధి యెఱుఁగుట మొదలు (హరి. పూ. V).

(iv) భావార్థక పూర్వావ్యవహిత కర్తృపదప్రథమకు: పరీక్షిజ్జన పొలుచనుట (భార. ఆది. II).

శేషషష్ఠికిఁ గొన్ని ప్రయోగములు.

I. (అ) ఉకారాంత జడవాచకపదములు: నీరువట్టు (భార. అర. VI. 131); కుక్కతోల్తిత్తి (భార. అర. VI. 201); మనసుపొందు (భార. అర. V. 3); ఎనుర్కట్టున (కాశీ. VI. 262); పలుకుతియ్యము (భార. అర. VI. 184).

(ఆ) ఉదంతపదములు: ఔపవిభక్తికములు: పొత్తినూలిప్రువ్వు (భార. శాం. VI. 227).

(ఇ) మువర్ణాంత పదములు: గొంతికి బ్రాణము ప్రాణ మితఁడు (భార. విరా. V. 328); జూదము నప్పుడు (భార. స్త్రీ. II. 31); తపంబు ఫలంబు (నిర్వ. VI. 88); జవ్వనంబు చొరవ (భార. ఉ. IV. 373); యుద్ధంబుసేఁత (భార. శాం. III. 182); యశము వెల్లు (భార. భీ. I. 183); మననగరంబు తూర్పుకడ (కళా. VII. 7); మహీతలము నుగ్మలులు (భార. అర. VI. 101); నెయ్యము తియ్యము కల్మి (భార. విరా. II. 98); దినము తెగుదల (భార. అర. V. 340); పశ్చిమంబువారు (నిర్వ. II. 4) మొద.

(ఈ) ఇకారాంతపదములు: రాత్రి తెగుదల (భార. అర. V. 340.); చెనఁటితెలంగు (భార. అర. VI. 19.); నడికిరేయి (భార. అర. VII. 323.); పసిపాఁడి (భార. అర. IV. 292.); లాఁతియిల్లు (భార. విరా. II. 99.); పరదేశి దొరలు (భార. విరా. III. 74.): ఆఁబడి విప్రులు (భార. అర. IV. 349); చెనఁటిరజ్జులు (భార. ద్రో. V. 101); మొద.

II. సర్వనామముల శేషషష్ఠీరూపములపై దువర్ణము చేరిన రూపములు: నీదుపైన్ (భాగ. X. i. 1482.); మీదైనకరుణ (భా. అర V. 185.); మొద.

III. దుబ్వర్ణకము చేరు పదములు: ఉక్కినిమనంబు (భార. విరా. III. 7); తేరకాని విధమున (భాస్క. యు. 1393); సోమయాజిగానిది (వరాహ. V. 116); దున్నసేను వ్రేళ్లు ఉ. (భార. III. 116); పాఁబువానికి (భార. అర. IV. 340); విధాతృచెయ్దు (భార. శాం. IV. 399); ద్రోణుబంటుకు (భార. ద్రో. III. 49); మోఁబకు చందంబున (భార. విరా. I. 221); మొద.

IV. బహువచన రూపములు: ఈటెతాటెల నడలు (భాస్క. ఆర. II. 123); వారలచేటు (భార. ఉ. III. 273); గొటియల పాఁడి (భార. ఆర. IV. 295); చిచ్చుటె పిడుగు (భార. విరా. IV. 83); చిచ్చటె పిడుగు (భార. విరా. V. 143); చిచ్చటెకోల (భాగ. I. 232); చిచ్చుటెకన్ను (భార. భీ. III. 299); మంగడ్లకొమ్మన (S. I. I. VI. 250); బాసలవారు (భార. విరా. III. 166); మగలరాజు (భార. ద్రో. II. 239); లేళులపిండు (భార. ద్రో. II. 25); కాళ్లయొప్పిదము (భార. విరా. I. 228.); వ్రేళుల పుటంబులు (భార. విరా. I. 148); మొగిళులగమి (భార. ద్రో. II. 44) రేఁగుఁబువ్వుల రసంబు (భార. ఆర. V. 338); ఇర్ల (?) వారము (భార. శల్య. II. 88); నిజాలచుట్టముల్ (భాగ. VI. 200); మొగడ్లచెఱువు (S. I. I. VI. 628); నొంచెడ్లపురము (S. I. I. IV. 748); కౌరవుల ప్రాంతలము (భార. విరా. I. 285); వేయిగన్నులవాఁడు (భాగ. VIII. 49); చూపటెపిండు(భార. ద్రో. II. 127); ఆరాధ్యులవార్కి, సోమయాజులవార్కి, పండితులవార్కి (S. I. I. IV. 699); గొటియలపాఁడి (భార. ఆర. IV. 295); అనుజులదెసకు (భార. విరా. I. 182); ముత్యాలచేఱు (S. I. I. VI. 903); ప్రజల ప్రజల తరమున (S. I. I. VI. 98); భూసురు లిండులు (వృషా. శత. 91); వాల్మీకుల శాపాక్షరములు (భాస్క. బాల. 10); మొద.

V. ము వర్ణాంతపదములపై 'న' వర్ణము చేరిన రూపములు: ద్రోణ పర్వంబున కడపట (హరి. ఉ. X. 318); దీపమునమాలె (S. I. I. V. 1088, 1089); అధికౌత్సుక్యంబున కలిమికి (భార. విరా. I. 45) అత్తెఱంగున రేఖ (భార. విరా. II. 67) జంబువునఫలంబు (భార. అను. III. 194) ఏవిధమున వాఁడు (భార. ఆర. VI. 203) స్తంభంబున మఱువున (హరి. పూ. III. 16) భోగానవేళ (S. I. I. VI. 1040); ఆశ్రమంబున సమీపమున (నిర్వ. IX. 6); మొద.

## నిర్ధారణషష్ఠి.

1. "నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకంబగు. జాతి, గుణ, క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణమనంబడు. ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చటి షష్ఠికి 'లోపల' వర్ణకంబగు ననియర్థము. మనుష్యులలోపల క్షత్త్రియుండు శూరుండు; గోవులలోపలఁ గపిల బహుక్షీర; అధ్వగులలోపలఁ బాఱువాఁఢు శీఘ్రగామి; ఛాత్త్రులలోపల మైత్త్రుఁడు సమర్థుండు— ఇచట సప్తమియుం గలదు. మనుష్యులయందు క్షత్త్రియుండు సమర్థుండు, ఇత్యాదు లెఱుంగు

నది.” బాలవ్యాకరణము. ‘లోపల’ లోని యాద్యక్షరముమాత్రము శేషించి ‘లో’ అనియుఁ బ్రయోగింపఁబడును.

2. సంస్కృతమున నిర్ధారణార్థమున సప్తమీ బహువచన రూపముల వలె షష్ఠీబహువచనరూపములను వాడుటగలదు గావున నా సంప్రదాయముచొప్పున తెనుఁగునందలి ‘లోపలి, లో’ లను నిర్ధారణ షష్ఠీ ప్రత్యయములుగా నాంధ్రవైయాకరణులు పేర్కొనిరి. కాని, వానిని ‘అందు, న’ లనువలె సప్తమీ ప్రత్యయములుగఁ బరిగణించుటయే సరి. ‘అందు, న’ లధికరణ నిర్ధారణార్థముల రెంటను బ్రయోగింపఁబడునట్లే ‘లోపల, లో’ లుగూడఁ బ్రయోగింపఁ బడుచున్నవి. నిర్ధారణార్థమున నివి యన్నియు బహువచన రూపములమీఁదనే చేరును. మొత్తమునుండి యొకభాగమును వేఱుచేయునప్పు డేకవచనముండును. అధికరణార్థమున నేక బహువచన రూపములు రెంటిమీఁదను జేరును.

## కొన్ని ప్రయోగములు.

i. నిర్ధారణార్థమున: మొదవులలో నెల్లఁ గపిలమొదవ వరిష్ఠంబు (భార. III. అను. III. 19.) ఆయువులోనను నర్ధంబరిగె (భాగ. IV. 804); మీలోపల నొకగోవు (భార. అను. III. 8).

(ii) అధికరణార్థమున: కలిమిలో = కలిగినదానిలో (భార. అర. VII. 295); వెన్నెటిలోన్ = వటిదలో (సర్వే. శత. 94); స్తంభములోఁ జూపర చూతాము (ఒం. రఘు. శత. 104); ప్రత్యయములలో (S. I. I. V. 874); ఆస్థానములో నొక్కరుఁడైన (భార. విరా. II. 141); కనుఁగనలో మ్రింగికొనుచు (భార. విరా. II. 79); విష్ణులోన్ (భాగ. VI. 433); మంటలో నుఱికిన మిడుతవ్రాలె (భార. భీ. II. 62); నీరిలోన్ (భార. ఉ. III. 366); పాలలోఁ బడిన బల్లివిధంబున (భార. ఉ. III. 135); వగవు వలదు చిత్తంబులో నీకు (భార. అర. V. 323); చుట్టాలలోన్ (హరి. పూ. V. 236); నీటిలోనుంబోలె (భార. సౌ. II. 10); వార్ధిలోఁ జొచ్చుట సాలఁ గార్యము (నిర్వ. VI. 109); బందలోపలను (S. I. I. V).

(1) ‘లోన్’ అనునది ‘లోను’ అను ప్రథమైకవచన రూపమునకు సప్తమియందు వచ్చు ‘లోనన్’ అనుదాని సంక్షేపరూపమై యుండును. ‘లోన్’ ప్రత్యయమును వాడునట్లే ‘లోనన్’ అనుదానిని గూడ వాడుట గలదు: ఆయువులోనను నర్ధంబరిగె (భాగ. IV. 804); నీళ్లలోనన్

(భార. శాం. IV. 78); వారిలోనన్ (హరి. పూ. II. 109); రణకేళి లోన లీలంజనుచున్ (నిర్వ. III. 4).

(2) కాలవాచకములపై 'లోన్, లోనన్, లోపలన్' అనునవి చేరి 'ముగియక పూర్వము' అను నర్థమునిచ్చును : మాత్రలోన్ (భార. ఆర. VII. 66); గడియలో (భాగ. VII. 267); సంవత్సరంబులోపల (వరాహ XI. 135); మధ్యాహ్నములో నరిగిరి (ఉ. రా. పు. 115).

(3) అవి 'ఆ, ఈ' లపైఁ జేరి దిక్కాలసూచకము లగును : ఈ లోననే = ఈ కాలము ముగియకమునుపే (హరి. పూ. VIII. 97); ఆలోనఁదెలిసి (కాలము— భార. విరా. III. 169); ఆలోనన (భార. భీ. III. 236; ద్రో. I. 197; III. 259, కాలము); ఆలోన్ = నాలుగు దిక్కుల మధ్యను (భార. ఆర. VII. 397; ద్రో. I. 190; భాస్క. సుం. 24); ఈలోన్ (భార. ద్రో. III. 184; కాలము).

(4) అందు, ఇందు, ఎందు, లపై నవిచేరి వానికి సర్వనామముల యర్థములను గలుగఁజేయును: అందులో = వారిలో (హరి. పూ. II. 105, 162, 184); ఇందులోనన్ = వీరిలో (భాస్క. అయో. 56); ఇందులోను = వీటిలో (S. I. I. IV. 282) అందులో = దానిలో (ఉ. హరి. III. 155) ఇట్లే, అందులో, ఇందులో = వాటిలో, వీటిలో, మొద.

(5) 'లోను' అనునది ప్రత్యేకముగఁ బ్రయోగింపఁ బడినప్పు డొక దానికంటె నెక్కువ విశేష్యములపైఁ జేరి 'ఆదిగా' అనునర్థము నిచ్చును:

పరశురాముండు భృగుఁడును బలియు లోనుగాఁగ (భార. అను. I. 140) పాయసములు నపూపములు మోదకములు లోనుగాఁగఁ గల వంటకములు (భార. ద్రో. II. 206); మృగములుఁ బతులు లోనుగ(భార. అశ్వ. IV. 227); ఈ నెలఁతఁ గన్న మన్మథుఁడైనఁ జిగురు గొడుగుఁ బువ్వుటమ్ముల పొదులున్ లోనుగ సెజ్జలు సేయం దా నియమింపండె (భార. విరా. II. 28) పొడవుగా మీఁది కెగసి చనుట, యచ్చటనుండి చక్కనేలకుఁ జోడువట్టి డిగ్గుట, దూర పాతభంగి, సంగతి, పరువడి, చాలులీలాగతి, వక్రయానము, వలయక్రమంబు లోనుగాఁగ గతులు నూటొక్కటిగలవు (భార. కర్ణ. II. 61); కోసలపతియగు బృహద్బలుండును ... నీలుండును ... సుశర్మయు ... అలంబసహాలాయుధులును, సాల్వసౌవీర శూరసేనాభీర యవనవసుధాధిపులును లోనుగా (భార. భీ. I. 95); ఆకర్ణంబు నడపిన దొరలును జిత్రసేనాది భవత్కుమారులును గర్ణుకొడుకు సత్యసేనుండును లోనైన యాప్తజనంబులు (భార. శల్య. I.74) మొద.

కాని, ‘ ఇది దగునే దశానన మహేంద్రుఁడు లోనగు దేవతాతతింగద నములో జయించు’ (భార. అర. VII. 140) ఉత్తర లోనుగాఁగల పయోజ ముఖుల్ వగలెల్లఁ బ్రీతితో నృత్తముఁ జేసిపోవ (భార. విరా. II. 265); అను ప్రయోగములందు ‘లోను’ కుఁ బూర్వమం దొక్కవిశేష్యముమాత్రము ముద్రిత ప్రతులయందు గానవచ్చుచున్నది. ఇందు ‘మహేంద్రుఁడు నాదిగ; ఉత్తరయాదిగా’ అని యుండవలెనని తోఁచుచున్నది-మొదలగు, మొదలుగా ఆదిగా, అనువానిని జేర్చునప్పు డొక్కటే విశేష్యమును, ‘లోను’ పదమును జేర్చునప్పు డొకటికంటె నెక్కువయు వాడుట కవిత్రయమువారి సంప్ర దాయము.

## సప్తమీ విభక్తి.

‘అన్ద్వింన్దునాస్తు సప్తమీ’ అని యాంధ్ర శబ్ద చింతామణియందు ‘అందు, ఇందు, న’ అనునవి సప్తమీవిభక్తి ప్రత్యయములుగఁ దెలుపఁబడి నవి. చిన్నయసూరి వీనినుండి ‘ఇందు’ ను దొలఁగించి ‘అందు, న’ లను మాత్రము పేర్కొనెను. వాస్తవముగ ‘ఇందు’ అనునది ‘అందు’ వలె స్థల వాచక పదమే యయినను దానిని ప్రత్యయస్థానమున ‘అందు’ ను వలెఁ జేర్ప వీలులేదు. ‘వనమునందు’ అను నట్లు ‘వనమునిందు’ అనియనము. కాని, ‘అందు’ తో సాజాత్యము గలిగి ‘అలి’ ‘ఉల’ మొదలగు నాగమములను బొందుటచేఁ గావలయు ‘ఇందు’ కూడ ‘అందు’ తోఁబాటు పరిగణనము నొందినది. అయినచో ‘ఎందు’ ను గూడ నీ గణమునఁ జేర్చి అన్ద్వింద్వెంన్దు నాస్తు సప్తమీ’ అని యనవలసి యుండెను. అందు, ఇందు, ఎందులు పూ ర్వాంధ్రమునఁ గళలు: ఇందు వ్రత్యతునై (యుద్ధమల్లుని బెజవాడశాసనము). తరువాతి కాలమున వానిని గవులు ద్రుతాంతములుగ వాడినారు.

అధికరణార్థమున సప్తమీ విభక్తి వచ్చును. కాని, అందు, న, లధి కరణమందే కాక నిర్ధారణార్థమందును వాడఁబడును; కావున వానిని నిర్ధారార్థ మందు వచ్చు లో, లోపల, ల వలె షష్ఠీ ప్రత్యయములుగఁ గూడఁ బరిగ ణింపవచ్చును.

అందు, న, లనే సప్తమీవిభక్తి ప్రత్యయములుగ వైయాకరణులు నిరూపించినను ‘న్, అన్’ అందులన్, లు కూడ సప్తమ్యంతములుగఁ గాన వచ్చుచున్నవి. ఔప విభక్తికముల యేకవచనమునందును, అన్ని శబ్దముల బహువచనమునందును సప్తమియందే కాక తృతీయా, పంచములందుఁ గూడ ‘న్, అన్’ లు ప్రయోగింపఁబడును. ఆయా ప్రత్యయములను జూపు ప్రయో గము లీ క్రింద పొందుపఱుపఁబడినవి.

## (1) అన్, న్.

(i) అదంతపదములపై: కడు రేపకడయ మేల్కాని ('కడన' అనియుండవలెను - (భార. అర. VII. 204) చెంతన్ (భార. విరా. V. 20) పొంతన్ (భార. విరా. II. 203; V. 20; శాం. V. 132); అవెంటన్ (భార. విరా. I.43); చేరువన్ (భార. అర. IV. 153; అను. I. 181; III. 228; శాం. VI. 353; స్త్రీ. II. 67); ఉన్నెడన్ (భార. ద్రో. III. 151); అవ్వలన్ (భాగ. V. II. 65); ఎడ్డన్ (భార. శాం. VI. 335); అత్తలన్ (భార. శాం. III. 165); ఈ బయలు నీతలనె కట్టికొనుము (భార. శల్య. II. 72); ఏ వెంటనయిన (భాస్క. యు. 1614); నాలవు వెంటన్ (భాస్క. యు. 773); తగిన వెంటం జొరవు (భార. ఉ. II. 280); తనయులగెడనైనన్ (భార. అర. V. 320); వెడవాడన్ (భార. అర. VI. 298); దండపాటి కల్లాను = ఎల్లన్ (S. I. I. VI. 80); పుటి కెల్లాను = ఎల్లన్ (S. I. I. VI. 126); రేవెల్లను గన్నుమూయుట లేక వగచుచుండె (భార. అర. VI. 95); ఎలుంగుగుత్తుకం దగులన్ (భార. ద్రో. III. 278); కటకటంబడు (భార. ద్రో. I. 389); మొద.

(ii) ఇదంతములపై: బారిన్ (ఆంధ్రనా. శత. 24); వీటిఁబోవు (భార. సా. II. 15); ఆశ్రితమానము వీటఁబుత్తురే (భార. భీ III. 268); సరసిన్ (భార. అను. I. 288); మేమెయి న్నిలుచుటయొప్పు (భార. శల్య. I. 394); ఏచక్కటిఁ బడియున్నాఁడో (భార. ద్రో. II. 251); చక్కటిన్ (భార. భీ. III. 190); మనమీచక్కటి నిలుతము (భార. విరా. I. 156); వట్టోడిఁ బడిన పేరడవి చందంబున (భార. ద్రో. II. 62); (దివ్యాస్త్రము) అరిఁ బోసి (భార. భీ. III. 385; కర్ణ. III. 287); నా పుత్త్రులు విటిగియడవింగలిసి రొకో (భార. భీ. I. 58); వాలమ్ముల బారింబడి (భార. ఉ. IV. 193)। ఒక్క వెంబడిన్ (ప్రభా. I. 117); వ్రేల్మిడిన (భార. విరా. I. 56); వైరమున్ మదిఁబెట్టికోలు (భార. శాం. III. 22); ఎల్లిన్ = గొడుగుమీఁద (భాస్క. యు. 1017); తొలితొలిన్ (భార. అర. VII.306— అవ్యయము); మొద.

(iii) (అ) ఉదంతములపై 'అన్': ఇచ్చటన్ (భార. విరా. V. 28); మ్రోలన్ (భార. అను. IV. 77; భాగ. VI. 17); ఆలోనఁదెలిసి (భార. విరా. III. 169); ఏంటాను = ఏఁటేటన్ (S. I. I. IV. 661); ఏంటా = ఏఁటేటన్ (S. I. I. IV. 974); నీ మీఁదఁ బతుమేను గలిగియుండుదు (హరి. పూ. I. 38).

(ఆ) ఉదంతములపై నగాగమము మీఁద 'అన్': అక్కునఁజేర్చి (భార. అశ్వ. III, 17); కొలఁకునన్ (భాగ. VIII. 267); ముప్పునన్

(భాగ. VI. 200); పొత్తునకారగించు (భాగ. I. 369); వింతగూరలు గుడుపున వేడ్కసేయు భంగి (భార. శల్య. II. 93): ఆ సందున (భార. ద్రో. IV. 215); ఆ తడవునన్ (భార. ద్రో. III. 166); జనములు నీ పొరువునఁబో వెఱతురు (భార. విరా. III. 60); తూప్పుఁ ముట్న = ముట్టున (S. I. I. V. 149); వెడఁగు వడిన యుల్లంబు వట్టునఁబఱుపం దనకు వశముగాకున్న (భార. విరా. II. 292); తెప్పల మాటునన్ (భార. ద్రో. I. 14); గీటునఁ బుచ్చుచు (భార. విరా. I. 68); అంకమునన్ (భార. అను. V. 289); మునుమునన్ (భార. భీ. I. 79); సీసానం బట్టియుఁ=శీర్షమున (భార. విరా. II. 15); చందానన్ (భార. ఆశ్ర. I. 103); బవరానన్ (భార. అశ్వ. IV. 165); కయ్యానఁ జచ్చుట (భార. ఉ. IV. 184) డెందానన్ (భార. ఉ. III. 19); ధృతరాష్ట్రుఁడు ప్రాణానం గలుగంగ (భార. ఉ. III. 345); మొద.

(iv) ఉదంతములపై 'న్' : పండితుం డందుఁ బొందండు (భార. శాం. VI. 320); చుట్టుఁ గవిసియుండ (భార. స్త్రీ. II. 69).

(v) ఏదంతములపై 'న్' : చే నిరతముగాదు గాండీవము (భార. భీ. I. 181); నామేఁ బ్రాణముల్ నిల్పె (భార. శల్య. II. 21); రేన్ = రాత్రియందు (విరా. II. 296; శాం. VI. 821; అను. I. 22).

(vi) ఓదంతములపై 'న్' : అచ్చోన్ (భార. ఆర. VII. 26; విరా. II. 36; శాం. II. 233); ఇచ్చో (భార. విరా. II. 143); ఎచ్చోన్ (భార. విరా. I. 107, 116; శాం. II. 233); చోన్ (నిర్వ. II. 43); అగపడ్డచో (నిర్వ. VII. 45); అట్టిచోన్ (భార. ఉ. IV. 88); వెనంగుచోన్ (భార. కర్ణ. I. 36); ఆర్జించుచోన్ (భార. ద్రో. II. 200); ఒక్కొకచో (భార. విరా. I. 53); ఉన్నచో (భార. విరా. I. 58); మొద.

(vii) బహువచనరూపములపై 'అన్' : ముక్కాఁకలందీటి (మారుతీ శత. 87); కెడలన్ (భార. ఉ. IV. 125); వెడచెవులంబెట్టి (భార. కర్ణ. III. 93; (ప్రభా. III. 96); చెవులంజిలికించి (వరాహ. IV. 7); చెవులనుగడియలు వడ (పాండు. III. 103); ఇరువక్కియలన్ (దాశ. శత. 45); పసిండిక్రొఁగులన్ (వృషా. శత. 92); అలువులన్ (భార. అశ్వ. III. 196); ఇమ్ములన్ (భార. ఆర. V. 120); సూరెలన్ (భార. ఉ. III. 183; ద్రో. II. 295; ద్రో. III. 179; స్త్రీ. II. 19); దాదవ్వులన్ (భార. భీ. II. 183); పగ్గంబుల నొగలముడిచి (భార. విరా. IV. 73); వాని దవ్వులన పరిత్యజించి (భార. ఆర. V. 43); వాకిళ్లందూటె (భార. ఆర. VII. 107); మొద.

(2) అందు.

(i) అందు (ఆగమములేక యడాగమముతో): తేరందు (భార. శాం. I. 349); చీరయందు (భార. ఉ. I. 295); నాదిండ్ల అందు (S. I. I. IV. 672); ఉత్తరాయణ సంక్రాంత్తియందు (S. I. I. IV. 667); నగరియందు (S. I. I. V. 1172); సరసియందు (భార. అను. I. 289); సంక్రాంత్తి యందు (S. I. I. V. 1308); ఇరుసందియలయందు; ధర్మ్మాన్వులయందు (S. I. I. V. 192); కులములందెల్ల నీ రాచకులము సాలబెట్టిదంబు(భార. భీ. I. 61); ఏ జన్మమందునో (భాగ. VI. 463); భండారమంద్దు (S. I. I. V. 1172); స్థళమంద్దు (S. I. I. IV. 686); ఈ దినమందు (S. I. I. VI. 935); ఘటికాచలమందు, నగరమందు (S. I. I. V. 874); ప్రతిసంవత్సరమందున్ను (S. I. I. V. 1184); విజయనగరమంద్దును (S. I. I. IV. 280); ప్రాణునియందు (భార. అను. V. 260).

ii. నగాగమముతో 'అందు': లేతప్రాయంబునందు (కాశీ. VI. 3); ఆతనిడాల్పునాభిదలితాబ్జమునం దుదయించె (S. I. I. VI. 628); మద్గృహంబునం దునికికి సమ్మతించితి (భార. విరా. III. 67); బండరమునంద్దు (S. I. I. V. 1151); మనమునందు (భాస్క. యు. 2429); అపానునందు (భార. అను. V. 260); రామునందును గార్త్తవీర్యక్షితీశునందు నరునందు భీష్మునియందుఁ డక్కఁ గలుగునే యొందు నీ యస్త్రబలము (భార. ద్రో. III. 134); అర్పితము ... ఈశ్వరునందుఁ జేత (భార. శాం. I. 149); మొద.

(iii) నగాగమము + అందు = నయందు: ఆహవంబునయందు (భార. స్త్రీ. II. 33); రాజవంశమునయందు (హరి. పూ. VIII. 85); రపి వ(-వా?) రమునయందు (S. I. I. V. 1172); అధ్వరమునయందు (భార. ఆర. VI. 67); నాయకత్వమునయం దభిషిక్తుఁడవై (భార. ఆర. V. 226); సమయంబునయందు (హరి. పూ. II. 147); బుజ్జవంబునయందు (హరి. పూ. II. 224); చిత్తమునయందు (హరి. పూ. II. 228); మొద.

(iv) విశేషణములపైఁ గాక యితరపదములపై: దొరకొనినందు = దొరకొనినవానియందు (భార. అను. IV. 244); ఎల్లయందు (హరి. పూ. V. 161; భార. అశ్వ. II. 215); ఇట్టియందు (భార. ఉ. I. 287); మొద.

(v) మాసంబులోనియంద యెక్కుడు దినములు (భార. అను. IV. 151) = లోనివే చాలదినములలో.

(vi) అందులన్: పుణ్యకాలమందులను, విజయనగరమందులను (S. I. I. IV. 279); మొద.

అందు, లో, లోపల, లు స్థలవాచకావ్యయములు; అట్లే క్రిందన్, మీఁదన్, వెలుపలన్, బయటన్, దగ్గఱన్, ప్రక్కన్, పైన్, ఒద్దన్, మొదలగు స్థలవాచక పదములును విశేష్యసర్వనామములపైఁ జేరునప్పుడు వానిని గూడ నధికరణమునవచ్చు సప్తమీప్రత్యయము లని యనవచ్చునేమో. ఉదా. పగఱపైన్ (భా.ర. భీ. I. 154); మేపయిన్ (హరి. ఉ. V. 173); ప్రాణంబుపయివచ్చునంతటి పోరామి (హరి. పూ. III. 207); ఇంద్రజిత్తుపై (భాస్క. యు. 534)— మొద.

'ఒద్ద' యనుపదము వ్యుత్పత్తి యేమో తెలియదు. అది 'వద్ద' యను రూపమున వ్యవహారమునందును గ్రంథములయందును మధ్యయుగమునాఁటనుండియు నున్నది:

గీ. చేరి భుజియించి దూర్వాస - శేఖరుండు
వామదేవ వసిష్ఠుల - వద్దనిలిచి.

(పట్టాభిరామాయణము II. 60.)

ఉ. ముద్దుల గుమ్మ కెంతయును - మోడికనంబడు నేను బ్రేమచే
వద్దకుఁ జేరరాఁగఁ దలవంచుట గన్గొని మోడియాడునా.

(పార్వతీ పరిణయము II. 79.)

గీ. వచ్చియా నరనాయకు - వద్ద నిలిచె

(చిత్ర భారతము V. 168.)

క. ముద్దిచ్చును గోపాలుఁడు
వద్దను నడయాడుచున్న • వార్తలు విన్నన్
గద్దించును లేఁ డన్నను
బద్దించును జూడకున్నఁ • బరితాపించున్.

(రాధామాధవ సంవాదము పుట. 5.)

గీ. వారిజానన వీనుల • వద్దఁ జేరి
బుద్దిగా నిట్టులను రాధ • బుజ్జగించి.

(రాధికాసాంత్వనము II. 107.)

ఉ. పంచనుబొంచి యర్చకులు • వద్దఁ దొలంగిన సందుఁజూచి...

(వైజయంతీ విలాసము IV. 109.)

అధివసించు, అధ్యాసించు, అధిరోహించు, అను క్రియలు సప్తమీ కారకమున నిలిచి యుండును: మూఁడవు దిక్కున శమనుం డధివసించు (వరాహ. X. 111); సైకతమున నధివసించి (ఉ. రా. పు. 50); మింటనధివసించిరి (ఉ. రా. V. పు. 83); ఇచ్చోట నధివసింతున్ (సర్వ. మా. III. 61);

అస్మహానందుఁ డెచ్చోటఁ నధివసించు (పాండు. II. 213); ఏనధివసింతుభక్తుని యందు (పాండు. IV. 101); మండపమధ్యంబున నధ్యాసించి (పాండు. V. 192); అందంబుగా నిందు నధిరోహణంబు (ప్రభులిం. పు. 165); మొద. ఇట్లే, ఉండు, నిలుచు, మొదలగు నాచ్ఛిక క్రియలకును దెలియవలెను.

## సంబోధనము.

సంబోధనమును దెలియఁజేయు విభక్తిని సంబోధన ప్రథమావిభక్తి యందురు. సంబోధనమునవచ్చు రూపమునకు విభక్తిత్వమును సంస్కృత వైయాకరణులు కొందఱంగీకరింపక యది యొకరీతి యవ్యయమని చెప్పిరి.

తెనుఁగున నామంత్రణమున 'ఓ' యనున దొకప్పుడు చేరును. ఇది పదమునకుఁ బూర్వమందు సాధారణముగఁ జేరుచుండును. వ్యవహారమునను గొన్ని యెడల గ్రంథములందును నది పదమునకుఁ బరమందును జేరుట గలదు. ఇది సాధారణముగ దూరాహ్వానమందే యుపయోగింపఁబడును. 'ఓ' యనునది పదముపైఁ జేరునప్పుడే విభక్తి ప్రత్యయ లక్షణమును గలిగి యుండునని చెప్పవలెను. 'ఓ' అనునది 'హోయ్' అనురూపమునఁ బ్రాకృత మునఁ గానవచ్చుచున్నది. 'హోయ్' అనునది తెనుఁగున 'ఓయి' అని నిలిచి మహద్వాచక సంబోధనార్థమున నెలకొనియున్నది. మహత్సంబోధనమున 'ఓరి' యనునది గూడఁ జేరును. సంస్కృతమందలి 'అరే, రే' అనుదానికిని తెనుఁగు నందలి 'ఓరి, ఒరే' లకును సంబంధము గలదు. 'ఓరి' అనునది గ్రంథము లందును వ్యవహారమునందును గూడఁ గలదు; వ్యవహారమున 'ఓరి' క్వాచి త్కముగ మాత్రమున్నది. 'ఒరే' అనునదియే సర్వసాధారణము. ఓరి, ఒరే,లు మిత్రులను, నీచులను సంబోధించు నపుడును గర్హార్థమందును నుపయోగిం తురు. 'ఓయి' అనునది మిత్రులను, బావమఱఁదులను, అల్లుండ్రను, పిలుచు నపు డుపయోగింతురు. అనంతపురమున బావమఱఁదులు మాత్రము 'ఓయి' అని సంబోధించుకొందురు. 'ఓ' ను ఏకబహువచనముల రెంటను జేర్పవచ్చును, ఓయి, ఓరి, అనుదాని నేకవచనమునందు మాత్ర ముపయోగింతురు. ఒక ప్పుడు 'ఓరి' బహువచనశబ్దములతోఁ గూడియుఁ బ్రయుక్తమగుట గలదు. సంస్కృతమందలి 'హే' అనునది 'హేయ్' అయి, తెనుఁగున 'ఏయ్' అనియు నాహ్వానమున వినఁబడుచున్నది. ఓయి, ఓరి, అనువాని తుది యిత్వమునకు దీర్ఘముకలిగి 'ఓయీ, ఓరీ' అనురూపములును గలుగును. ఓ, ఓయి, ఓరి, అనునవి నామపదములతోడనేకాక క్రియాపదములతోడను నవ్యయములతో డను గూడఁ బ్రయోగింపఁబడును. ఓయి, ఓరి, అనునవి మహద్వాచకముల సంబోధనమున మాత్ర ముపయోగింపఁబడును. మహతీవాచకపదములతో 'ఓసి, ఓసీ' లుపయోగింపఁబడును. ఇవి గ్రంథములందు మాత్రము కొన్నిం

చుచున్నవి. వ్యవహారమున వీని యుపయోగము క్వాచిత్కము. వ్యవహారమున మహద్వాచకములతో 'ఒరే' ఉపయోగింపబడునట్లు మహతీవాచక పదములతో సంబోధనమున మిత్రత్వనీచత్వ సంబోధకములగు 'ఒసే, ఏమే' లుపయోగింపబడును. వీని తుది యేత్వముపై 'య' 'వ' శ్రుతులు కలుగుటయుఁ గలదు. 'ఒసేవ్, ఏమేవ్, ఒరేవ్, ఒసేయ్. ఎమేయ్, ఒరేయ్' 'ఏమో !' అని స్త్రీలలో దగ్గఱ మైత్రి కలవారు పరస్పరముఁ బిలిచికొందురు.

ఓ.

ఉదాహరణములు:—i. పదములకుఁ బూర్వమందు: (అ) ఏక వచనమున: ఓ కర్ణ (భార. ఆర. VII. 284); ఓ యన్న (భార. ఆర. VII. 391; శాం. III. 315); ఓ యమ్మ (భార. స్త్రీ. II. 178); ఓ రాజ (భార. స్త్రీ. II. 127); ఓ యభిమన్యుఁడా (భార. ద్రో. II. 242).

(ఆ) బహువచనమున: ఓ జనసంఘములార ! (భార. ఆర. IV. 358.)

(ఇ) అవ్యయమునకుఁ బూర్వమందు: ఓ చెల్ల (భార. ఆర. V. 327);

ii. పదములకుఁ బరమందు: వ్యవహారమున సాధారణముగ దూరాహ్వానమునందును, సత్వరాత్యంతోచ్చైరాహ్వానములందును 'ఓ' అనునది పదములకుఁ బరమందు చేరును: అయ్యో ! అమ్మో ! రాముడో ! మొదలయినవి. పదములపై 'ఓ' చేరి కొన్ని యవ్యయము లేర్పడుచున్నవి: మొఱ్ఱోయనుచు (ఆంధ్రనా. శత. 71); మొఱరో (భార. ఆర. V. 17).

iii. వ్యవధానముతో: ఓ వినువీథినున్న ఖచరోత్తములార (వీర.II.); ఓ తోయజనేత్రుఁ గాంచిన వధూమణి (విజ. III).

ఓయి.

i. పదములకుఁ బూర్వమందు: ఓయి సత్యకాత్మజ (హరి. ఉ. VI.153).

ii తుదిదీర్ఘముతో: ఓయీ విప్రకులావతంస.

iii. ప్రత్యేకప్రయోగము: సంగతియ యోయి యినుమంత తింగణావు; ఓయీ ననుఁ జెనకరాకు.

iv. అవ్యయములపై: ఏమోయి, ఎందుకోయి, అందుకేనోయి.

v. క్రియలపై : సాధారణముగ నన్నిక్రియలమీఁదను 'ఓయి'ని చేర్చవచ్చును. ప్రార్థనార్థక క్రియల మధ్యమ పురుషైకవచనమున వాని వ్యతిరేకార్థక రూపముపై 'ఓయి' చేరును : రావోయి, పోవోయి, చెప్పవోయి, చూడవోయి; రమ్మోయి, పొమ్మోయి, చెప్పుమోయి, మొదలగు రూపములును గలవు. వ్యవహారమున 'రావోయి, పోవోయి' మొదలగు రూపములే కలవు.

## ఓరి.

i. పదములకుఁ బూర్వమందు : ఓరి ధాత్రీసురాధమ (భార. సౌ. II. 59); ఓరి దుర్మద (భాగ. V. 144); ఓరి మహోగ్రపాతకుఁడ యోరి నిషాదుఁడ (భాస్క. బాల. 9).

ii. ప్రత్యేకప్రయోగము : ఓరి వినుము (భార. అర VI. 82.)

iii. ద్విర్వచనము : ఓరోరి దీనిదాటునఁ బొడిచిపైపడితివి (భాస్క. యు. 698); ఓరోరి వెడంగువానర (భాస్క. సుం. 43).

iv. 'రా' పై 'ఓరి' : వినరోరి జీవన్మృత (భాగ. V. 144); వినరా యోరి (భాగ. III. 656); పోరోరి దురాత్మ (భాస్క. బాల. 9).

## ర, రా.

i. అది, అద్ది, అను సర్వనామములపైఁ జేరి యవ్యయముల నేర్పఱచుటకు; అది(ద్ది) ర (రా).

ii. ఏమి, ఏ, ఏల,లపైఁజేరి ప్రశ్నార్థద్యోతకమగుటకు: ఏమిరా వాను దేవుఁడ (హరి. ఉ. VI. 236); రక్షోనాయకుఁడగ్గెనేని వళ మేరా ! (భాస్క. అర. I. 164); ఏరా దతు (వీర. విజ.) గోపాలుఁడవు పూజఁగొందు వేరా (ఆంధ్రనా. శత. 34); పనేమిరా (ఒం. రఘు. శత. 20); ఏలరా = ఎందుకురా (ఒం. రఘు. శత. II.)

iii. ప్రార్థనార్థక క్రియలపై : పొమ్మురా (భాస్క. యు. 117); ముద్దులయ్యగా ! రార (మాతృశత. 39); రార (రామతా. శత. 54); నుమ్మర (భార. శాం. I. 39); కానీరా, ఉండురా, చెప్పరా, మొద. అను, విను, కొను, కను, చను, మను, లపై 'ర, రా'లు చేరునప్పుడు వాని యుత్వమున కత్వమును వచ్చును : వినరా సుమతీ, కనరా, కొనరా, మొద. ఏలరా= ఏలుమురా (ఒం. రఘు. శత. 11).

iv. 'అఁట' పై : ఏ మున్న వెఱతునఁటరా (భాస్క. బాల. 199).

v. ఇతరక్రియలపై : ఔనురా ! (మహతి : ఔనే !); కొల్చెదవురా, ఎంతురా (ఒం. రఘు. శత. 20.) వ్యవహారమున పడతావురా, వస్తానురా, పోతానురా, మొద. రావద్దురా (ఒం. రఘు. శత. 66); వ్యవహారమునందు మాత్రము 'అర్రా' అనునది బహువచనమునఁ జేరును : రార్రా, పోర్రా, వస్తానుండర్రా, ఉండండర్రా, ఏమర్రా, పట్టుకోర్రా, పట్టుకోండర్రా, మొద.

vi. అగు, బళి, మొదలగువానిపైఁ జేరి: అగురా, అవురా, ఔరా, బళిరా, మొద.

vii. ప్రత్యేకముగ : నీమంత్రంబె మంత్రంబురా (ఒం.రఘు. శత. 7).

viii. ఏది, ఏఁడి, ఏరి, ఎట్లు, ఎక్కడ, ఎప్పుడు, మొదలగువాని మీఁదను 'రా' చేరును : ఏఁడిరా (రాజగో. శత. 14); ఎట్టిటట్రా (భాగ. X. I. 1261).

రో.

i. స్త్రీవాచక పదమునకుఁ బరముగ : కమలదళాక్షిరో, రమణిరో, హావల్లభరో (భాస్క. కిష్కిం. ౕ౫), మొద. ఇట్టిరూపములు వ్యవహారమున లేవు.

ii. మహద్వాచకపదములపై : బసవయ్యరో ! (బస. పు.)

iii. తిర్యగ్జడవాచక పదములమీఁదను నామంత్రణమున 'రో' చేరునని కొందఱందురు. కాని, సరియగు గ్రాంథిక ప్రయోగములు కానరాలేదు.

iv. మహదర్థమునఁ బ్రార్థనార్థక క్రియలపై నేకవచనమున : రారో, పోరో, మొద.

v. ఇతరపదములపై : ఏమిరో, ఎప్పుడువచ్చినావురో, మొద.

vi. బహువచనార్థమున అత్యంత సంబోధనమునఁ గ్రియలపై వ్యవహారమున 'అర్రో' చేరును; రార్రో, చంపుతున్నాడర్రో, రక్షించండర్రో, మొద.

రే.

ఇది చేరునప్పు డాశ్చర్యార్థకావ్యయములు చేరును : భళిరే, అఠరే, చెల్లరె ! (హరి. ఉ. VII. 237); అయ్యరె ! అయ్యారె !—కాని, అమ్మరె, అప్పరె, అక్కరె, మొదలగు నవ్యయములు నాకు వినరాలేదు.

ఏ.

'ఏ' అనునది సంస్కృతమందలి 'హే' అనుదాని వికారమైయుండును. వ్యవహారమున నిది పదములకుఁ బూర్వమందు విడిగాఁ జేరునప్పుడు యశ్రుతితో వినఁబడుచుండును. గ్రంథములయందును వ్యవహారమునందును నత్యంత ప్రార్థనమున నమహద్బోధక మధ్యమ పురుష క్రియలమీఁదను గొన్ని యవ్యయములమీఁదను ఏ చేరుచుండును : ఉదా. ఏమే యెక్కడనున్నదానవిటురావే యుల్లమల్లాడెడిన్ (భాస్క. అర. 260); జానకి యెక్కడనున్న దానవే (భాస్క. అర. II. 262.) మహద్వాచక పదములమీఁదను నిది చేరుటగలదు : రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా (భాగ. VI.) నేఁటి వ్యవహారమున స్త్రీలను సంబోధించునప్పుడే

'ఏ' చేరును. ప్రార్థనార్థకమధ్యమ పురుషక్రియలపై నది చేరునప్పు డేకవచన మున 'వు, అవు'లును, బహువచనమున 'రు, అరు'లును నాక్రియల కంతాదేశము లగును: రావే, చెప్పవే; రారే, చెప్పరే. ఇతర ద్రావిడభాషలందు 'ఏ' అనునదే సంబోధనమునఁ బదములపైఁ జేరుచుండును; తమి. మళ. కన్న. రామనే, మొద.

## తుది యచ్చునకు వైకల్పిక దీర్ఘము.

(i) తెనుఁగున సాధారణముగ న దిదంతపదముల ప్రథమైకవచన రూపమే సంబోధన ప్రథమైకవచన రూపముగ నిలుచును. దీనికి దీర్ఘము కలుగును: దూత, దూతా; మామ, మామా, సీత, సీతా; అత్త, అత్తా; మేఁక, మేఁకా; శాఖ, శాఖా; కొమ్మ, కొమ్మా; హరి, హరీ; మఱఁది, మఱఁదీ; దమయంతి, దమయంతీ; చెల్లి, చెల్లీ; మయూరి, మయూరీ; పంది, పందీ; నది, నదీ; మొద. ఎదంతపదములమీఁదను సంబోధనమున నిట్లే కలుగును: వదినె, వదినే; గేఁదె, గేఁదే; పెట్టె, పెట్టే; మొద. ఎదంతాచ్ఛిక పదములకు గ్రంథములందు గలుగు సంబుద్ధిరూపముల నిర్ణయించుట కష్టము. కొన్ని ప్రయోగములు: మామా! (భార. శల్య. I. 395; భాస్క. కి. 579); బేలా! (భార. శాం. III. 391); స్వామీ! కోపం బుపసంహరింపుము (భా. శాం. V. 441); పూఁబోఁడీ (భాగ. IV. 791); వైదలీ! (భాగ. VIII. 466); లేమ! (భాగ. VIII. 467).

(ii) ఉదంతపదముల తుది యుత్తుపై సంబోధనమున అ, ఆ, లు చేరును: రాముఁడ, రాముఁడా; వృక్షమ, వృక్షమా; శంభువ, శంభువా; కొడుక, కొడుకా; కోడలు, కోడలా; పాపజాతురాల (భార. అర. VI. 307).

వ్యవహారమున నుదంతశబ్దములపై సంబోధనమున నత్వముచేరి కొన్ని మండలములందు మాత్రము వినఁబడుచున్నది. మైసూరిలోని బెంగుళూరు, కోలారు జిల్లాలలోను, హైదరాబాదు సంస్థానమందలి గద్వాలు, అమరచింతల లోను 'రాముఁడా' అను సంబోధనము వినఁబడును. తూర్పుతీరపు తెనుఁగు జిల్లాలలోఁగాని దత్తమండలములలోఁ గాని నా కట్టి పలుకుబడి వినఁబడలేదు. అచట అ, ఇ, ఎ, లకువలె నుత్తునకును దీర్ఘమే కలుగును: రాముడూ! తమ్ముడూ! చెల్లెలూ! ఆవూ! మొదలయినవి. ఇట్లుత్తునకు సంబుద్ధియందు దీర్ఘము (ప్లుతము) సంస్కృతోదంతనామముల మీఁదనే కలుగుచుండుట గ్రాంథిక భాషా సంప్రదాయము. ఉదా. విష్ణూ, శంభూ, మొద. కాని వ్యవహారమున నీ కార్య ముదంతాచ్ఛికపదముల మీఁదను గలుగునని గ్రహింప వలెను. ఆచ్ఛికోదంత నామములమీఁద చేరు డుజ్జునకు సంబుద్ధిని లోపము గలుగదు: తమ్ముఁడా (భా. అర. VII. 387).

'కృతోక్తంబగు సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్జునకు లోపంబు విభాషనగు'నని చిన్నయసూరి చెప్పెను. -డుజ్జు లోపించుటచేఁ దత్పూర్వావు ఉత్వముగూడ లోపించునని యాతని యభిప్రాయము: 'కర్ణ! కయ్యపు బలు పాడెదు' (భార. కర్ణ. II. 25); రామ, రామా; కృష్ణ, కృష్ణా; మొ.వ. వ్యవహారమున ముద్దుగఁ బిలుచునపుడు 'రాముా, భీముా,' అని కూడఁబిలుచుటగలదు.

ము విభక్త్యంత పదములకు వ్యవహారమున సంబుద్ధి యందు మువర్ణము మీఁది యుత్వము లోపించును; లేదా, అట్టి యుత్వము లేని రూపమే ప్రథమైకవచన రూప మనియు, నదియే సంబోధనయం దుపయోగపడు ననియుఁ గూడఁ జెప్పవచ్చును. 'గుఱ్ఱం! గుఱ్ఱం! ఎందుకు మేసినావు కావే?' గ్రంథముల యందు 'గుఱ్ఱ(మ)మా!' అని యుండును. 'మాయ దైవమ! యేనేమి సేయువాఁడ' (భార. విరా. II. 62); పసరము; (భార. కర్ణ. III. 221); మహద్విషయం దమహద్వాచక పదములకును సంబోధనమున మహద్రూపములే కలుగును: 'సహకార! మత్ప్రియ సహకారుఁ, బున్నాగ! పున్నాగుఁ, దిలక! భూభువన తిలకుఁ, జందన! బుధ హరి చందనుఁ, బుష్పితాశోక! సుహృజ్జన శోకదమను, వకుళ! కులైక దీపకు, విభీతక! భయభీతార్తి హరు, నలుఁ బ్రీతితోడ' (భార. అర. II. 221); యేనేమి సేయువాఁడ (భార. విరా. II. 62); పసరమ! (భార. కర్ణ. III.

బలరామా ఘనబాహా (భాగ. X. II. 502) లో 'బాహు' శబ్దముపై సంబోధనమున అత్వము చేరినది. 'బాహు' పదమునకు 'బాహ' అను రూపాంతర మున్నది గావున దానికి 'బాహ' అని హ్రస్వము గలిగి, దానిపై, నుత్వ డుజ్జులు కలిగిన వనియు, నపుడుదానికి రామశబ్దమునకువలె సంబోధనమునఁ గార్యము కలిగినదనియు సమర్థింపవచ్చును.

'మహారాజా! వినుము' (భార. ఉ. III. 276) అను ప్రయోగమున 'రాజన్' శబ్దము తత్సమమయి బహువ్రీహి సమాసమున నుత్తర పదముగ లేనప్పుడు 'రాజు' అను రూపమేర్పడును గావున, దానిపై 'అ, ఆ'లు చేరి 'రాజ, రాజా' అను సంబోధన రూపము లేర్పడునని చెప్పనలెను.

'మాలవిధియా! యని దైవము దూఱు' (భార. విరా. II. 104) అను ప్రయోగమున నిదంత 'విధి' శబ్దము సంబోధనమున నిత్తునకు దీర్ఘము కలుగక 'ఆ' చేరినది.

'అయ్య, అన్న' లను పదములకు సంబోధనమున ఆత్వము చేరునప్పుడు వాని య్య; న్నల ద్విత్వము వైకల్పికముగ లోపించును: అనా! (భార. శాం. III. 315; అను. IV. 335); వేవేగ విల్లీవనా! (భార. మా. I. 123); కావింపు మనా (భాస్క. అర. I. 113); రావనా (భాస్క. యు. 227); ఇల్లే;

రావయా, పోవయా, మొదలయినవి. అయ్య, అన్న,లు క్రియలకుఁ బరముగఁ జేరునప్పుడే య్య, న్న, లకు ద్విత్వ లోపము కలుగును; అవి ప్రత్యేకముగఁ బ్రయు_క్తము లగునప్పుడు కలుగదు. అయ్య, అన్నలకు వలె అమ్మ, అక్క, అప్పలకు సంబోధనమున ద్విత్వలోపము కలుగునో కలుగదో తెలియదు.

'ముద్దులయ్యగా! రార' (మాతృ. శత. 39) అను ప్రయోగమున 'అయ్యగాఁడు' అను పదమునందు సంబోధనమున డుజ్జునకు లోపము గలిగినది. 'అయ్యగా!' లోని తుదియచ్చునకు హ్రస్వము కలిగి 'అయ్యగ!' అనియగునేమో తెలియదు. సంజ్ఞా పదములగు 'రామిగాఁడు, భీమిగాఁడు' మొదలగు వానికిని సంబోధనమున నిట్లే డుజ్జు లోపించును. కాని, 'కాఁడు' చేరిన యన్ని పదములకును సంబోధనమున డుజ్జు లోపింపదు. విలుకాఁడు, విటకాఁడు, నేర్పుకాఁడు, మొదలగు వానికి 'విలుకా! విటకా! నేర్పుకా!' యను నిట్టి సంబోధనరూపములు గలుగవు. '-ఈఁడు, ఏఁడు' అంతమందు గల మహద్వాచక పదముల డుజ్జును సంబోధనమున లోపింపదు: బాపినీఁడు, కన్నమనేఁడు మొదలగు వానికి 'బాపినీ!, కన్నమనే!' మొదలగు సంబోధన రూపములు గలుగవు.

బల్లిదాదులు సంస్కృత తుల్యము లయినను వాని గ్రాంథిక సంబోధన రూపములను సంస్కృత శబ్దములకు వలె నసందిగ్ధముగఁ జెప్ప వీలులేదు. 'రామా!' అనునట్లు బల్లిదా, అక్కజా, కావలా, బెట్టిదా. బెడిదా, మిసిమింతా, మొక్కలా, మొదలగు సంబోధనరూపములు కావ్యభాషయందు గానరావు: వ్యవహారమున లేవు.

మగాదులలోఁ జేరిన 'రాయ' శబ్దమునకు 'రాయఁడా, రాయా' అను సంబోధన రూపములు గలుగును; కాని, మగా, మనుమా, మొదలగునవి కలుగవు. వ్రేఁడు, ఱేఁడుల తుది డుజ్జు సంబోధనమున లోపింపదు. ఈ, కా, ప్రత్యయాంతములకు నిట్లే. కైరాదులలోని జన్న, నీల, లకు జన్నా, నీలా, అను సంబోధన రూపములు కలుగవచ్చునేమో కాని, కయిరా, కత్తళా, అను రూపములు గలుగవనియే తోచుచున్నది. ఇట్లే, పగతాదు లందలి తుది డుజ్జు సంబోధనమున లోపింపదు. పగతా, అల్లూ, నెయ్యా, బలియా, మార్తా, మొదలగు సంబోధన రూపములు లేవు.

బహువచనమున సంబోధనము.

సంబోధనమున బహువచనమున కారగాగమ మగును. ఉదా. అకల్మషులారా (భార. సౌ. II. 67); అన్నలారా (భార. ఆర. V. 177); అయ్యలార (భార. ఆర. VI. 20); ఓ జనసంఘంబులార (భార. ఆర. IV. 358); తపసివరులార (భార. అశ్వ. II. 263); దుర్మదులార (భార. ఉ. III. 403): ధార్మికు

లారా (భార. అశ్వ. II. 216); నిర్మలాత్మకులార (భార. అశ్వ. II. 214); మునీంద్రులార (భార. సౌ. II. 67); వేదుఱులార (భార. అశ్వ. IV. 82); సంయమీంద్రులారా (భార. స్వర్గా. I. 89).

సంబోధ్యవాచకములును వానికి సంబంధించిన క్రియలును బహువచనమున నున్నను క్రియలపైఁ జేరు 'అమ్మ' మొదలగునవి యేకవచనమందే యుండును: మన యశోద సిన్ని మగవానిఁ గనెనఁట, చూచివత్తమమ్మ సుదతులార (భాగ. X. i.)

మధ్యమపురుషక్రియలతో నన్వయించునపుడు పదముల బహువచనమున సంబోధనమునం దారగాగమము కలుగకుండుటయుఁ గలదు. 'వీని వధించిరండు దనుజుల్' (భాగ. VII. 187); తప్పొప్పనకుఁ డొప్పు తప్పని చెప్పకుఁడీ కవు లుపాస్తి సేసెద మిమ్మున్ (ఆంధ్రభా. భూ.) జనక తనూజ నాకుఁ బరిచర్యలు సేయుతఱిన్ దపస్వినీజనపరిచర్య లేమఱెనొ, సంభ్రమ కారణమేమి సంయముల్ (భాస్క. అర. 1); అప్పలు! (ఉ. హరి. IV. 302).

'దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబులగు సంబోధ్య వాచక శబ్దముల మీఁద నేకవచనంబునఁ గాన శబ్దం బొందును, 'అల' యను నవ్యయంబొందును గానంబడియెడి. 'అల దీర్ఘాంతంబు నగు'* అని ప్రౌఢ వ్యాకరణము, శబ్ద. 15-వ సూత్రము. ఉదా. భవ్యరతి దేవతాచార పరమ పుణ్య ధర్మమేమఱకుండు మీ తల్లికాన (నైష. VII.); మా సామికాన (సా. I.); మొద. 'కాన' అనునది 'కృష్ణ' శబ్ద భవము. కృష్ణ = ప్రాకృతము: కణ్హ; తె కన్న. ఇది ప్రేమ సూచకపదముగ ననుబంధముగ సంబోధన మునఁ జేరుచుండును. 'కాన' శబ్దము వ్యుత్పత్తి మఱుఁగుపడుటచేతను, సంబోధనమున మాత్రము తఱచుగ నా శబ్దము చేరుచుండుట చేతను, ప్రేమ సూచకముగనే కాక యది తిట్లయందును జేరుచు వచ్చినది: ఉదా. లంజకాన! మొద. ఈ యర్థభేదము ననుసరించియే సానందోపాఖ్యానకర్త 'పాపజాతి కాన!' అని ప్రయోగించినాఁడు. 'కాన' అనునది తొలుత శబ్దమే యయినను, 'అల' మాత్రము ప్రౌఢవ్యాకరణకర్త యనిన ట్లవ్యయముకాదు. సంబోధన మున 'అ, ఆ' లేకవచనమునరూపములమీఁదనే కాక బహువచన 'లు' వర్ణ కము మీఁదను గొన్నియెడల జేరుచుండునని చెప్పవలసియుండును: అయ్యలు, అక్కలు, అమ్మలు, అన్నలు, అనువానిపై 'అ,ఆ' లు సంబోధనమునఁ జేరుటచే అయ్యల (-లా), అక్కల (-లా), అమ్మల (-లా), అన్నల (-లా) అనురూపము లేర్పడినవి. ఇవియన్నియు నాశ్చర్య సంతాపార్థములం దవ్యయ ములుగ నిలిచి బహువచనస్ఫోరకములు కాకుండుటచే వాని నేకవచనార్థము

నందును కవులు వాడుచువచ్చిరి: అక్కలకన్యకాత్వమిటు లాఁడివ్రోవ నకార ణంబ నీకెక్కఁడిచూలు వచ్చె (నిర్వ. II.); తోడఁబడనమ్మలక్కలని తూలుచు (ఆము. II.); సెలవులలాలలు దోఁటఁగంగ నన్నలా యని యెలుఁగున్ (ఉ. హరి. IV.);—వ్యవహారమున నిట్టిపదముల బహువచన రూపములపై సంబోధ నమున 'ఓ' కూడఁజేరును; అప్పుడు లకారమునకు ద్విత్వమును గలుగును: అమ్మల్లో! అక్కల్లో! మొద.

బహువచనమున లువర్ణము చేరునపుడు దానిపై 'అర' అనునదిచేరి '-లార!' అనియగునుగాని 'రు, ఱు, ండ్రు' అనునవి బహువచనమున వచ్చు నప్పుడు వాని సంబోధనరూపము లెట్లుండునో నిర్ణయించుట కష్టము. బహువ చన రువర్ణమునకు సంబోధనమున 'ల'వర్ణమే వచ్చునని చెప్పవలెనేమో. బాలురు, బాలులార!('బాలురార!' అని యనఁగూడదేమో) ఇట్లే, నృపాలు లార, దయాళులార, మొద.

మగఁడు. బ. మగలు, సం. బ. 'మగలార' యనవచ్చునా? ప్రయో గము? మహత్తు; పాపఁడు; మహతి: పాప; రెంటికిని బహువచనము: పాపలు; సం. బ. పాపలార! తేఁడు. బ. తేండ్లు, సం. బ. 'తేండ్లార' అనికాదు; 'తేఁడులార' అనవచ్చునా? వ్రేఁడు. బ. వ్రేలు, సం. వ్రేలార! అనికాదు; బ. వ్రేండ్లు? సం. వ్రేండ్లార అనికాదు; 'వ్రేండులార!' అనవచ్చునా?- పగతురు. సం. పగతులార! అనవచ్చునేమో; 'పగతురార!' అనఁగూడదు.- అల్లురు, సం. 'అల్లులార!' అనవచ్చునా? 'అల్లురార!' అని యనరు. అల్లుం డ్రు. సం. అల్లుండ్రార!' అనఁగూడదు. నెయ్యురు, సం. నెయ్యులార! బలి యురు. సం. బలియులార! మార్తురు-మార్తులార? ప్రయోగము?- గండండ్రు. సం. 'గండండ్రార, గండండురార!' అనఁగూడదు; 'వ్రేఁడులార' అనునట్లు 'గండఁడులార!' అనియు ననఁగూడదు; 'గండలార!' అనవచ్చునా? ప్రయోగము?-మిండండ్రు. సం. మిండలార! మిండండ్రార, మిండండురార, మొదలగు సంబోధనరూపములు గలుగవు.- విలుకాండ్రు, విలుకాఱు, వేట కాండ్రు, వేటకాఱు, వేడుకకాండ్రు, వేడుకకాఱు; మన్నీలు(-ండ్రు?), సుంకరీండ్రు, దుండగీండ్లు, ఆండ్రు, చెలియండ్రు, చెల్లెండ్రు, కోడండ్రు, మఱఁదండ్రు- వీరినందఱను బహువచనమున గ్రాంథికభాషచొప్పున నేమని పిలువవలెనో తెలియదు.—కూఁతురు, బ. కూఁతులు, సం. కూఁతులార! అని సంబోధింపవచ్చునా? ప్రయోగములు? 'కూఁతురులు, కూఁతుళ్లు' అనునవి యర్వాచీన బహువచనరూపములు. వీనికి సంబోధనమున గ్రంథములందు 'కూఁతురులార, కూఁతుళ్లార, అనురూపములు గలుగునా? వ్యవహారమున 'కూతుళ్లారా' అని పిలుతురు. గుండ్లు, గిండ్లు, కాళ్లు, మొసళ్లు, గొంట్లు,

తుంట్లు, గోర్లు, గోళ్లు, సీవిర్లు, త్రాళ్లు, గుమ్మళ్లు, మొగిళ్లు, పిడికిళ్లు, ఊళ్లు, పందిళ్లు, తాళ్లు, విళ్లు, సిళ్లు, అన్నట్లు, పనంట్లు, గోంట్లు, తేంట్లు, ఏండ్లు, కాండ్లు, కొడవండ్లు (-ళ్లు), మొదలగువాని నొకవేళ పిలువ వలసివచ్చినయెడల (పిలుచుట తప్పుకాదు- గిరులార, తరులార, మొదలగు ప్రయోగములు కలవు; వ్యవహారమందును చరాచర ప్రపంచమునఁగల జంతువస్తుజాలమును బిలుచుటగలదు) వానియంతమందలి సంయుక్త బహువచనరూపములపై నారగాగమము గలదు. గుండులార, గిండులార, కాళులార, మొసళులార, అనఁటులార,-ఈ రీతిగ నసంయుక్తబహువచన లువర్ణముమీఁదనే యీ యాగమము గలుగును. వ్యవహారమున బహువచన లవర్ణమునకు సంబోధనమున ద్విత్వము వైకల్పికముగఁ గలుగును: తల్లుల్లారా! పిల్లల్లారా ! పిల్లుల్లారా ! పక్షుల్లారా! మొద.

వ్యవహారమునందు నీవా ! రా, నీవా ! రా, అని పేరపేర పిలిచినాఁడు; మీరా ! కాపాడండి, మీరా ! కాపాడండి, అని దేవతల దేవతలకు మ్రొక్కినాడు; ఓ వారా ! రండి, ఓవీరా ! రండి, అని కేకలువేసినాఁడు;' అనునట్టి సంబోధనములు కొన్ని సర్వనామములమీఁదను వినఁబడుచున్నవి. ఇట్టివి గ్రంథములకెక్కలేదు.

గ్రాంథికభాషయం దనేకనులగు నాచ్ఛికపదములకు సంబోధనమున రూపములెట్లుండునో నిర్ణయించుటకుఁదగిన ప్రమాణములుగానరావు. వ్యవహారమున నాయారూపములను వాడుకనుబట్టి యుపయోగించుకొనవలెను.

తెనుఁగువ్యాకరణములందు సంస్కృతమార్గము ననుసరించి తెనుఁగు విభక్తుల నేడుగా విభాగించినారు. వీనిలో నొకవిభక్తిలోఁజేరవలసిన ప్రత్యయములు మఱియొక విభక్తిలోఁజేరినవి. న్యాయ్యముగ నాయా ప్రత్యయములిట్లుండవలెను.

ప్రథమః ఁడు, ము, వు, లు;-ద్వితీయ: ని, ను, ల;-తృతీయ, అన్; చతుర్థి: కు (కి); పంచమి; అన్; -షష్ఠి: ఏకవచనమున ప్రాతిపదికరూపము, బహువచనమున 'అ';- సప్తమి: అన్.

కూర్చి, గుఱిచి, గుఱించి; చేతన్, చేన్, తోడన్, తోన్; కై, కొఱకు, పొంటెన్; వలనన్, పట్టి, కంటెన్; కోలెన్, ఉండి; లో, లోపల; అందు, -ఇవి అవ్యయములు; విభక్త్యర్థములందు వాడఁబడునవి.

వీనిలో గుఱిచి, చేన్, తోడన్, కై, పొంటెన్, కోలెన్, అందు, అనునవి పూర్వమునందువలె నేఁడు వ్యవహారమున లేవు.

తెనుఁగునవిభక్తులే డేయున్నవని చెప్పఁ గూడదనియు, నెన్నిసంబంధములనుదెలుపు నెన్ని ప్రత్యయములుండిన నన్ని విభక్తులున్నవని చెప్పవలెననియు

కాల్దువెల్లు నభిప్రాయము. ఇందు సత్యము లేకపోలేదు. కాని, విభ_క్త్యర్థము లందువచ్చు పదములకును విభ_క్తిప్రత్యయములకును భేదమును గమనింప వలెను. 'డు, ము, వు,' అనునవి మహదమహదర్థములందు వచ్చు ప్రత్యయములును, ప్రథమావిభ_క్త్యేకవచన ప్రత్యయములు గూడనై యున్నవి. అట్లే. 'లు, ల' అనునవి బహువచన బోధకము లయియున్నవి. ఇక నాయావికారములను విడిచినయెడలఁ దెనుఁగునఁ బ్రత్యయసంజ్ఞనుబొందఁ గలవి నకారమును, కువర్ణకమును మాత్రమువిగులును. కావుననే యర్థవిశేషములను దెలుపుటకు వేర్వేఱుపదముల సాహాయ్య మావశ్యకమగుచున్నది.

ఇది యిట్లుండఁగా వైయాకరణులు వివరించిన ప్రత్యయములు వారు విధించిన విభ_క్తులయందేకాక యితర విభక్తుల యర్థమునందును వచ్చుచుండుట సంభవించినది. ఈ విషయమునే యాంధ్రశబ్ద చింతామణికారుఁడు 'అన్యస్యాఁ క్వచి ద్భవే చ్చాన్యా' 'ఒకప్పుడొక విభ_క్తికి మఱియొకవిభ_క్తియు రావచ్చును' అని చెప్పవలసినవాఁడయ్యెను. ఒకవిభ_క్తికి మఱియొకవిభ_క్తి వచ్చుట కీక్రింద నుదాహరణములు పొందుపఱుపఁబడుచున్నవి:—

ప్రథమకు ద్వితీయ.

భూవినుత ! నిన్నశుచివని యెట్లు వలుకనగును (భార. ఆది. I. 96);

ప్రథమకుఁ దృతీయ.

మహిమచేత మెఱసి (భాగ. VI. 287); నన్నయ: నుహిమ మెఱసి.

ప్రథమకు షష్ఠి.

తనయిచ్చిన దివియ (S. I. I. IV. 1008); భీమనాథుని పెట్టినదీపము (S. I. I. V. 1056); చిన్నమనాయకుని పెట్టిన దీపము (S. I. I. V. 1054) తమకట్టించిన శనివారమండపము (S. I. I. V. 138); నాకుం బోక గర్జంబు (భార. ద్రో. IV. 138); కర్ణున కెఱుంగ నెంతదవ్వు (భార. ఉ. IV. 425); నాకు నిన్ దెలుప నేల (భార. ఆర. VI. 184); పుణ్యున కొనరింపవలయు కార్యము (భార. ఆర. V. 108); వెక్కులు వల్కఁగాదు నీకు (భార. ఆర. VI. 156); అతనికిఁబడవలసె నకట (భార. భీ. I. 59): పార్వతి దేవుల యిచ్చిన యినుపయెద్దు (S. I. I. VI. 228); నీచెప్పెడుమెయి (భార. కర్ణ. II. 359); నీకుఁ బోలేదు (భార. అను. V. 287); నింగికి నేలకుం జాలి (భార. ద్రో. V. 144); నీకు నిట్లు భయమందఁగ నేటికి వచ్చె (భాస్క. యు. 889) తగు నీకేమని పల్కినన్ (నిర్వ. VII. 91); నాకుఁగల తెలుంగు సెప్పవలయు=

నేను నీకు (నిర్వ. VII. 98); రాజులకెల్లను నెక్కుడు (భార. అను. V. 353); మీకు సాధింపరాని కార్యంబు (నైష. III. 64).

ద్వితీయకుఁ బ్రథమ.

i. విశేషణముల ద్వితీయకుఁ బ్రథమ: అహీనబహుబలసారఘనుల్ మధుకైటభాది దైత్యపతులనెల్ల (నిర్వ. V).

ii. జడము ద్వితీయకుఁ బ్రథమ: ఋణమీఁగిరాను (వరాహ. II. 76); ఉత్తరము ముట్టినట్టి తూర్పున (భార. శల్య. II. 5); నెఱను నోనాడునవియు (భార. విరా. III. 162); నీవిక్కడ యేతెంచుట వింటి = యేతెంచుటఁగూర్చి (భార. కర్ణ. III. 46); చిచ్చొడిఁగట్టినయట్లు (భార. ఉ. III. 118); దురితంబు లెన్నండుఁ బొరయక (భార. ఆర. VI. 307); కుశలం బడిగితి (భాస్క. సుం. 330); నీ తోడుగు పాదుక లానతియిమ్ము (భాస్క. అయో. 269); చాతుర్యము మెఱసి (భార. విరా. I. 70); మేను దొఱంగుచుండి (నిర్వ. V. 19); యోగముఁ దొడఁగుట (భార. అను. IV. 208); శర మరినమర్చి (భార. ద్రో. II. 373), శర మరిఁ బోయు (భార. ద్రో. I. 169.)

iii. అజడము ద్వితీయకుఁ బ్రథమ: అనిలజవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱించిన పరికాడు ప్రోలె (భార. ఆది. IV.); తనవారణేంద్ర మక్కురుకుల వీరుమీఁద నెసకొల్పిన (భార. ఆర. VI); తత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంపుచున్ (జై. భార. V).

ద్వితీయకుఁ దృతీయ.

మనకు లవణ మెంతేని నడుగు యాదవులచేత (ఉ. హరి. IV. 152); నాగ నాగతోఁ దాఁకన్ (భార. కర్ణ. II. 248); మైత్రుండు చైత్రునితోడ నిట్లనిమె.

ద్వితీయకుఁ జతుర్థి.

అతఁడొకనాఁడు వేటకొఱకై తను నేలినవారు వేడ్కతోఁ బొతముఁగ బైనహూటఁగని (భల్లా. VII.) అడవికి వేటకై యరిగి (పాండు. V).

ద్వితీయకు షష్ఠి.

పాండవులు గౌరవులతోడి పగకు నొల్లరు (భార. ఉ. I. 233); ఆజ్ఞకుఁ దప్పఁడు (భాస్క. కి. 485); అతనియాజ్ఞకు మిగులకు (పద్మపు. V. 25); తన కెదిరి (భార. భీ. I. 48); మాబోఁటి వారలు (భాగ. V. 150); నీ బోఁటికిన్ (భాగ. VII. 43); నాబోఁటికిన్ (భాగ. I. 522); నాకుఁబోలె (నిర్వ. V. 10); అతనికి మెచ్చి (హరి. పూ. IV. 19); వలతు నే భక్తకోటికి భక్త

కోటియు వలచు నాకు (హర. వి. II. 13); విభుని యాజ్ఞకు మీఱవెఱచి (పద్మపు. VII. 100); శీలంబునకు మెచ్చి (పద్మపు. VII. 211); కష్టదశకు నోర్వఁ జాలను (పద్మపు. VI. 166); దుష్పికిం గవియన్ (పాండు. V. 14); ఎంతటి కీనోపదు (పాండు. III. 42); ఎవ్వనికి వలచె నొకో (పాండు. III. 66); పాపరే నాకు నీ యింతిబాధ (శకుం. పరి. II. పు. 31); దానికెదిరించి (ప్రభా. I. 73); దండకంబునకు మెచ్చుచు (కళా. I. 184); చిరముగ బ్రహ్మకుం దపము సేసి (భార. ఆది. II.); విరహంబున కోర్వఁగ లేక (కళా. III. 6), పురీనివాసమునకుం బెడఁబాసె (వరాహ. II. 37); మైత్రుండు చైత్రున కిట్లనియె.

## ద్వితీయకు సప్తమి.

ప్రేమాతిశయంబునం బొంది (పద్మపు. X. 42); అంతర్ధానంబునం బొందె (వరాహ. I. 101; పద్మపు. VII. 157); కాని 'అంతర్ధానమునొందు' (కళా. II. 95); అది ప్రకృతియందుఁ బొందును (పద్మపు. VI. 13); అ ఉ ఉమ్ మూఁడును నేకవర్ణత్వమునఁ బొంది (వరాహ. II, 158); వైలక్ష్యంబునం బొంది (వరాహ. V. 80); కీడ్పాటునం బొంది (హరి. ఉ. IV. 85); వెంపునఁ గల మానికంబు (హరి. పూ. VII. 41); పుణ్యమునం బొంద్దిడిది = బొందెడిది (S. I. I. V. 193); కడు నను రాగచిత్తమునఁ గల్గి (S. I. I. IV. 672); బ్రుంగుడుఁ బాటునఁ బొందు (భార. విరా. II. 192); పరిభవంబునఁ బొందక (భార. విరా. II. 140); కొంపలమునఁ బొందకుండ (భార. ద్రో. II. 247); మోదంబునఁ బొందుచు (నిర్వ. II. 90); ఉల్ల మచ్చెరువున నూనన్ (భార. అశ్వ. I. 69), మాత్రమునఁ బురీషమున నూనుచును (భార. శాం. IV. 292); సంతసంబునఁ బొందితిమి (భాస్క. కి. 750); మోదంబునొందున్ (భాస్క. యు. 2211); ఆతంకంబునఁ బొంది (హరి. పూ. I. 189); సిగ్గునఁ జెందనేఁటికిన్ (భాగ. IV. 755); మీ రివ్వీరునం దధికయత్నంబు సేయునది గార్యంబు (భాస్క. యు. 1020.)

## తృతీయకుఁ బ్రథమ.

విగతరోషుఁడవై సుఖముండు మీరు (భార. ఆది. VII); మా తండ్రి పరాశరుచేతం బడసితి ననుజ్ఞ (భార. ఆశ్ర. I.); తల్లి ద్రౌపదితోడన్ (జై. భార. 1.); చక్కఁ జలము పెనఁగఁ జనదు = చలముతో (భార. ద్రో. IV. 312.)

## తృతీయకు ద్వితీయ.

ధేను నివహంబుఁ ద్రొక్కించి = నివహముచేత (భార. అను. III. 48); జగదంబ నిన్ను నేమని చెప్పెన్ = నీతో (హరి. ఉ. VII. 112); రామునిఁ

బల్కెన్ (సమీ. IV. 90); చదివించ వచ్చిన శాస్త్రులనెల్లఁ జదివించఁగాఁ జూచి సతియును బతియు (ప్రభులిం. II. పు. 50); త్రైలోక్యంబును సృష్టిం బొందె (వరాహ. II. 163); రాముఁడు వాలి నొక్కకోలం గూలనేసె; అర్జునుఁడు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె. అతని దోర్మధ్యసరసి నోలాడుచున్న ఘనతరస్తనచక్రవాకముల నలరు నంబను.

తృతీయకుఁ పంచమి.

దుష్టమృగ శిక్షణంబువలన (శకుం. పరి. I. పు. 16).

తృతీయకు షష్ఠి.

లోకోత్తర చరితుండగు నా కావ్యతనూజ నీకు నారాధ్యను (భార. ఆది. III); అతివ యీ గర్భమెవ్వరికైతి (కాశీ. IV. 226); తోపువడుటకుఁ గోపమొంది (హరి. పూ. VII. పు. 169); అనురులకును బూజనీయులు (హరి. పూ. II.); అరిమదభేది నీకు విషమాజిముఖంబుల మార్కొనంగ నోపరు నరు లెవ్వరున్ హరి కిభంబులు మార్కొను నయ్య (భార. అర. IV); అంగపతి కెదిరించెన్ (కళా. VIII); రూపున నాశ్వినేయుల సరి (భార. అర. VII. 181); నాకుఁ బల్కుము (భాగ. V. i. 28); శత్రులోకమునకు నీవు వధ్యుఁడవుగావు (భార. అర. VII. 286); ఎందుఁగలుగునె యర్జును నీడువాఁడు (భార. విరా. II. 204); నేలకుఁ గోలకుఁదెచ్చు (భార. ద్రో. III. 107; V. 219, 333; హరి. పూ. V. 210); ఏమిసేట్లకుం జెడుటకు నొక్కొ (భార. ద్రో. III. 199); మారుత పుత్త్రునెన (భార. ఉ. IV. 266.)

తృతీయకు సప్తమి.

అనివారణన్ (భార. భీ. I. 255); నీయాన గాండివంబునాన దివ్యశరంబులాన (భార. ద్రో. II. 311; ఎగువన్ = ఉద్ధతితో (భాస్క. యు. 123); ఏడ్తెఱన్ (భార. భీ. I. 256, 284; ద్రో. I. 14); ఒయ్యనన్ (నిర్వ. IV.3); కింకన్ (భాస్క. కిష్కి. 155); ములుకోలం బొడుచుచు (భార. అను. V. 371); భూవిభున్ గదవ్రేయంగ (నిర్వ. VII. 55); చెచ్చెరన్ (భార. అర. V. 77, 379); తివుటన్ (భాగ. IV. 12); మచ్చికన్ (భాగ. VIII. 39); రమణన్ (భార. శాం. III. 62); వరుసన్ (భార. అర. V. 102): వర్తనన్ (భాగ. I. 62); వరుసన్ (భార. అర. V. 102); వర్తనన్ (భార. I. 62); శంకంగూరు (భాగ. III. 520); ఆసంగూరిరి (భార. శల్య. I. 110);— అర్మిలిన్ (భార. అను. V. 416); అతిమురిన్ (భార. ద్రో. I. 89; భీ. II. 71,88; వృషా. శత. 97); అలంతింబోదు (భార. ఉ. IV. 26); ఉరవడిన్ (భార. ద్రో I. 156); ఒక్కయుమ్మడిన్ (హరి. పూ. VI. 37); కడిమిన్ (భార. భీ. II. 372); కను

కర్నిఁ (భార. ఆర V. 24), కరణిఁ, కై వడిఁ (భాస్క. సుం. 558), చిడిముడిఁ (రాజగో. శత. 14); చెయిదిఁ (భాస్క. యు. 1732); తరవారిఁ (హరి. ఉ. X. 107); నెమ్మిఁ (భార. ఆర. IV. 250); నెఱిఁ (భార. ఉ. IV. 114); పగిదిఁ (భాస్క. సుం. 558); పరిపాటిఁ (హరి. పూ. I. 196); పృథువడిఁ (భాస్క. యు. 678); (దాని) బడిఁ (హరి. పూ. VI. 78); (గోవుల) బడిఁ (హరి. పూ. VIII. 80); మాఁబడిఁ (హరి. ఉ. I. 25); బడిబడిఁ (హరి. పూ. IX. 92); బలువిడిఁ (భార. ఆర. VI. 219); (వింటి) బలిమిఁ (భార. ద్రో. III. 206); బల్విడిఁ (భార. ఆర. V. 391, 393; నిర్వ. I. 41. 42; II. 85; III. 21); రాయిడిఁ (హరి. పూ. VI. 5); (శ క్తి) లేమిడిఁ (మాతృశ. 95); విచ్చలవిడిఁ (నిర్వ. I. 62); విన్కిఁ (భార. విరా. V.393) సంగడిఁ (భార. విరా. III. 166.)— అదటునఁ (భాస్క. యు. 1131); అన్నునఁ (భార. ఆర. V. 434); ఉక్కునఁ (భార. ఆర. IV. 303); ఉఱరిపాటునఁ (భాస్క. అర. II. 51.) పేరుబ్బునఁ (భార. ద్రో. I. 138), ఎత్తునఁగొందుఁ గౌరవులనెల్లను (భార. విరా. IV. 19); ఏనుఁగున నేనుఁగువైచుచు (భాస్క. యు.) ఏపునఁ (భాగ. IV. 328) ఒడికమునఁ (భార. ఆర. V. 306); క్రమమునఁ (భాస్క. సుం. 383); పొట్టక్రొవ్వునఁ (భాగ. VI. 281); గరువంబునఁ (భార. ఆర. V. 271); చాడ్పునఁ (భాగ. III. 822). మిడుతలతఱచునఁ (భాస్క. కిష్కి. 612); కులిశంబుతాఁకునఁ (భార. ద్రో. III. 62); తెలివునఁ (హరి. ఉ. VI. 165), తోడంటునఁ (సర్వే. శత. 44); భూమిదానమునను బోవు నక్కోడఁ (భార. శాం. I. 307); సిరిపట్టునఁ (భాగ. VI. 281); పరుసునఁ (భార. ఆర. VII. 311); పుయిలోటమున మోముపుల్లగిలఁగ (భార. విరా. II. 70); పురుడునఁ (భార. ఆర. VI. 272); భీ. II. 130); బరవసమునఁ (భార. విరా. IV. 62); బిఱుసునఁ (భాస్క. అర. I. 15), మెలపునఁ (భార.భీ. I. 93; ద్రో. I. 95); మెల్పునఁ (నిర్వ. VI. 58 VIII. 26. 38); వడువునఁ (భాస్క. సుం. 383), వినయంబునం గేలుమోగిచి (భార. శాం. I. 385); సాకతమున నేలుదురు (భార. విరా. I. 298); సావరమునఁ (పాఠాం. సావనమునఁ) భాస్క. యు. 202;— సాత్యకి యలఁతులఁ బోయెడివాఁడె (భార. ఉ. I. 268); అలంతులం బోయెడివాఁడుగాఁడు (భార. ద్రో. II. 104); అలంతులంబోవక (భార. విరా. II. 228); ఆసానలఁ (భార. ఆర. VI. 327; భాస్క. యు. 521); ఆశాపాశంబులఁ గట్టువడినారు (నైష. IV. 79); ఏ కొలఁదులఁ (హరి. పూ. I. 21); కఱదులమాటలఁ (హరి. ఉ. X. 252); కాళులఁ (భార. విరా. I. 78); తెవుళ్లఁ (భార. అను. V. 429) బిరుదుతనంబులఁ (భార. విరా. I. 95), విండులఁ (భార. ఆర. VI. 233);

 

అఱచట్లమోచి (హరి. ఉ. IX. 63); కురుపతి ప్రాణంబులం గలఁడే (భార. శల్య. II. 16).

బిడియమునన్ = బిడేనన్ (యయా. పు. 17); శీర్షమునన్=సీసమునన్; సీసానఁబట్టి (భార.విరా. II. 15); కళ్యములన్=కళ్యాలన్ (భార.విరా. I. 95.)

చతుర్థికిఁ బ్రథమ.

నీరాకవార్చి = రాకకై (భార. శాం. VI. 582); నారాకవార్చి (భార. శాం. VI. 593);- ఇట్లే, సంధ్యవార్చు = సంధ్యాకాలముకొఱకు వేచియుండు; రాను రానర్థభేదము గలిగినది. నరపతి కార్యమేఁగెద = కార్యమునకై (భాస్క. సుం. 50.); కాలంబువేచెదము (భార. ఉ. I. 175).

చతుర్థికి ద్వితీయ.

వలసినపనిఁబంపుము = పనికై (భాస్క. బాల. 416); కాలంబు వేచెదము (భార. ఉ. I. 175.)

చతుర్థికి షష్ఠి

వానికిఁ బూనివచ్చు (హరి. పూ. IX. 67); మాకుంగా దీనిని విడువవలయు (భార. అర. V. 433) ఎవ్వరి దెసకున్ (భార. భీ. I. 197); తమ్ముఁడు నాకెత్తిపోయి (భార. భీ. I. 43); నీకుఁగా నని సేయుట (భార. భీ. I. 157); ఆఁగుటకు = ఆఁగుటకొఱకు (భార. మౌ. I. 50); ఏమి గార్యమునకు (భాస్క. యు. 1813); ఖగేంద్రుఁడు హతుఁడయ్యె నాకుఁబూని (భాస్క. అర. II. 369); ఎవ్వరికాచరితంబు = ఎవ్వరికొఱకు (నిర్వ. I. 32); పెండ్లికని పిల్వఁబంచినన్ (భార. ఉ. I. 42); ఇయ్యెడ కేఁగుదేవలయు నీపనిఁ బూని (భార. విరా. II. 40; నీవర్జునునిపాలి కరుగుము నాకున్ = నాకొఱకు (భార. ద్రో. III. 296).

చతుర్థికి సప్తమి.

ఉపజీవితన్ = ఉపజీవించుటకొఱకు (భార. శాం. I. 110).

పంచమికిఁ బ్రథమ.

తేరుడిగ్గి (నిర్వ. IX. 69).

పంచమికి ద్వితీయ.

ఎక్కడన్ వచ్చితివో (కళా. II. 70); సౌధమున్ డిగ్గి (కళా. VI. 135); విచ్చేయు మదితిగర్భముఁ జెచ్చెర వెలువడు మహాత్మ (భాగ. VIII); అహింసధర్మవితతికెల్లను మేటి (భార. అర. V. 48); రాజులకెల్లనునెక్కుడు (భార. అను. V. 353); మముఁ జింతం బాపరాదో (భార. ఉ. III. 72) సరసిన్ వెడలెన్ (భా. అను. I. 288); ఇట్టిదాని నిన్నేలపాపుదు (భార.అను. IV. 77).

పంచమికిఁ దృతీయ.

పవనాత్మజుచేత వినఁబడ్డ (భార. భీ. II) ; మహాజనాలు అందరిచేత నున్ను క్రయంగొని (S.I.I. IV. 280); పడసెను ... పార్వ్వతివల్లభుచేత ... జనపాలకుచేత (S. I. I. VI. 117); ఒదయభట్టోపాధ్యలచేత బెట్టి కొన్న ... చేను (S. I. I. V. 136); మీ చేత నెఱుంగవలయు (నిర్వ. II. 51). నాచేత నిన్ను వినిన యపుడె పుత్తెంచె (భార. ఉ. IV. 280); చిన్నా దేవమ్మంగారిచేత సమర్పించిన (S. I. I. VI. 695); (భీష్మునకు) తనయందు గలిగె భంగంబు శిఖండిచేత (భార. భీ. I); కౌంతేయులు నాచేనడఁగ రెట్లు (భార. ద్రో. I. 71) మహిమచేత మెఱసి (భాగ. VI. 287 ; -నన్నయ: మహిమ మెఱసి); ఎవ్వరిచేత న్నగుబాటుదేక (ఉ. హరి. II.97) ఆ వనితయొప్పు లోకులచేత వినుట (దశ. కు. VI. 181) ద్రుమముతోఁ బాసిన తీఁగఁబోలి (భాస్క. యు. 1930); కదుపుతోబాసిన కోదమజింకయుఁ బోలె ( భాస్క. యు. 2283); దాక్షాయణితోఁ బాసి (కాశీ. IV. 243).

పంచమికి షష్ఠి.

సకల దురితంబులకుఁ దొలఁగింతు నిన్ను (భార. భీ. I. 224); మము నాపదలకుఁబాపితి (హరి. ఉ. X. 255); ఆహవమహికిం దొలఁగెను (హరి. ఉ. VIII. 130); కొలఁదికి నెక్కుడై (హరి. ఉ. III. 107); కొంకుగొలఁదికి మీఱె (భార. విరా. II. 106); ఆపదలకువిడుమడఁగాంచి (భార. విరా. I. 49); నీ వాహారంబు గొనక నిలువం దొడంగిన నాఁటికి నేఁ డాఱవు దినంబయ్యె (భార. శాం. VI. 568); రుద్రునకు నీవేమిటఁ దక్కువ (భార. ద్రో. III. 25); (ఇది) బాంధవమునకు నీతికి బాహిరంబు (భార. ఉ. III. 216); నీ వలుగులఁబడుటకు దుఃఖావేశము (భార. విరా. III. 50); పుణ్యలోకములకుఁ బాసి (భార. అర. V. 242); అహింస ధర్మవితతికెల్లను మేటి (భార. అర.V.48) (మనసును) అహంకారంబు పజ్జకుం బాపి (భార.అర.V. 3); సమరప్రదేశంబున కుఁదొలంగి (భార. అర. VI. 8); రణభూమికిం దొలంగి చనియె (భార. అర. V. 401); అవ్వివాహంగంబు నాకుఁబెద్ద (భార. అర. IV. 364); రాజులకెల్లను నెక్కుడు (భార. అను. V. 353); భోజనంబు వెట్టు టెల్లపుణ్యములకుఁ బెద్ద (భార. అను. V. 33); అంతకు నీవలట (నిర్వ. VIII. 10); దానము లన్నిటికిని భూదానం బెక్కుడు (భార. అను. II. 350), జాతికిం బెడఁబాపి (భార. అను. I. 130); అహింస ధర్మవితతికెల్లను మేటి (భార. అర. V. 48); రాజుల కెల్లను నెక్కుడు (భార. అను. V. 353); చెఱకుఁబాపరా ? (భార. ఉ. II. 204); అంతకుముందఱ (నిర్వ. VI. 124); కుబేరుని వీటికిఁబెద్ద (నిర్వ. I. 45); ఆజికిం ...

దొలంగందోలె (భార. ద్రో. IV. 31); పసులు పులికిం బాఱు (భార. ద్రో. IV. 156); తుంగమడుపునఁ జొచ్చిన మాతంగంబునకు మిగిలి (భార. ద్రో. III. 101); విష్ణుండు వాసెం బోరికిఁ (భాస్క. యు. 1752); మము నీ యాపదకుఁ బాపి (భాస్క. యు. 629); వనరాశికి మిగిలెనేని (భాస్క. యు. 278); విలువిద్యనోరులు నీకగ్గలముగ లేకుండ (భార. ఆది. V.); దుష్కృతము నీకుఁ దొలంగు (వరాహ. XII. 9); అఘముము భక్తజనాళిలో వెడలి (బస. పు. 236, పం. 28); నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె (భార. ఆది. III).

పంచమికి సప్తమి.

వీతెంచె నొకవాక్య మాకసమునఁ (భాస్క. అయో. 307); నేఁడాదిగ దీనఁ బాయఁబడెనో మనకుఁ (కాశీ. V. 43); (రక్తంబు) వదనగహ్వరమున వఱదవాఱ (భాగ. X). ఉడుపథంబున జాఱు నుడుపప్రతతిభాతి మెడహార ముల పెన పుడమిఁదాఁక (పాండు. V). నలుఁ దొల్లి యాక్రమించిన కలి గర్కోటకవిషంబుఁ గ్రక్కుచు నొడల న్వెలువడి (భార. అర. III); పెచ్చిన సంభ్రమంబున ననేకులు బ్రద్దలవారలెక్కడన్ నచ్చిరియొ మోది రాకొలువు వారి (కళా. II); వేఱొక చోటిగొని వచ్చితినే (భార. శాం. IV. 440).

షష్ఠికిఁ బ్రథమ.

నీ విక్కడ యేతెంచుట వింటి (భార. క. III. 46); నా ప్రతికూల దుర్లలితవాక్యంబుల్ సహింపందగుఁ (భార. అర. VII. 202); నా బాల్యంబు గరుణసైఁపవలయు (భార. అర. VII. 333); వేదనములు సైచె (భార. అర. V. 334); వేఁటరారెరి (వరాహ. II. 51); వేఁటసని (భార. అర. IV. 335). వేఁటవొయినారు (భార. అర. VI. 163); ప్రాణమానపడక (భార. ఉ. IV. 257); పరమదుర్లభపదమానపడి (భార. అను. I. 96); ఈ విధమేను నచ్చి (హరి. పూ. IV. 181); కీడు తెరువు ననరు (భార. స్త్రీ. II. 170), నే నీతెరువేలవత్తు (భార. క. III. 57); వీఁ డెల్లఁ బోఁటి బాలుండు గాఁడు (హరి. పూ. V. 149); ఇక్కడవచ్చి (హరి. ఉ. VII. 101); నీ విక్కడ యేతెంచుట వింటి (భా. క. III. 46); భూరిశ్రవుండు నచ్చుట సైరింపక (భార. ద్రో. IV. 279); ఉద్ధతిసైఁపక (భార. విరా. V. 105); మనను వచ్చినన్ని దినములు నలుపుఁ డిచ్చోట (భార. విరా. I. 206); ఆజ్ఞమిగిలినచోటఁ (భార. విరా. I. 124); వేఱపొగడ్త లానపడక (నిర్వ. I. 38); లంక యానపడుట (నిర్వ. III. 94); క్రయముగాం గొంన (S. I. I. V. 155); కలుపు లియ్యకొనుట (భార. విరా. I. 268); కృష్ణుఁడురాక (భార. ఉ. IV. 165); జూదపుసిరి యా నపడంగాదు (భార. ఉ. I. 316); యమలోకం బేగి (భాస్క. కిష్కి. 425); నాపని గాలి వొవదె (భాస్క. సుం. 71); వీఁడునికి పర్ణశాలతటొగ్రాటవుల్

(భాస్క. యు. 335). ఇందురాకకు (భార. శాం. VI. 564); గొంతి కూర్చు మనుమఁడు (భార. ద్రో. II. 236); నేఁడు పదినాళులు (భార. భీ. III. 363); పోయిరి క్రమ్మఱ నెక్కడేని (భార. ఉ. IV. 339); భవన్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయ వాంఛ (భార. విరా. III. 62); అక్కడ వాసి చనిమె (భార. అర. VI. 64); అటయేఁగి (భార. అర. V. 27); అది గర్భమై = దానికి (కాశీ. VI. 107); ఒడలిసుఖము లాసపడఁగరాదు (విష్ణుపు. VII. 372); నేఁ డేనాళ్లనుండి = నేఁటికి (పాండు IV. 153); ఇటవచ్చి (పాండు. IV. 61); కీడువలనుబాచి = వలనికి (పాండు. I. 147); వేఁటవచ్చి (శకుం. పరి. పు. 32); వేఁట యే నేల వచ్చితి (శకుం. పరి. II. 26); చెట్టొ కఁడుగాఁగ (మను. IV. 103); నేఁడు మూనాళ్లనుండి (మను. IV. 73); మీ రెక్కడవ్రాయెదరు (వరాహ. X. 81); తీర్థయాత్రవ్రాయి (వరాహ. IX. 4); జయము రక్షకుండు శౌరికి (కవిలో. చిం.); పరిపంథి మదోన్మథనుఁడు రాముని కెనయే పృథివిం జిఱుదొరలు (సర్వ. సా. సం.); యుద్ధంబయ్యె రిపుభయద భుజుఁడు భీముని కపరిమితబలుండు గౌరవాధీశునకుఁ (భార. భీ. II); విద్యా రాజీవభవుండు మారయకు 'బుణ్యాచార భీమాంబకుం బుత్త్రుండు; ఖడ్గ వ్యాఘ్రి మిమ్మంచుఁ గొండకు రావచ్చునె (మను. II); భుజాటోపభయంకరుఁ డర్జును కోపానలము (భార. ఉ. I); పార్థివప్రాగ్రసరుండు ధర్మజునిపన్పు (భార. అర. VI).

## షష్ఠికి ద్వితీయ.

అప్పరిపాటి నిన్ను మును వినుపించితి (భార. అను. IV. 186); నాకు నీకఁ దెలుపనేల (భార. అర. VI. 184); ఎక్కడం దిరిగి (హరి. పూ. II. 44); ఎక్కడఁబోయెదు (భాస్క. సుం. 43); నీవెక్కడఁబోయెదు (భాస్క. కి. 362); కట్టుము పట్టుమతనిఁ (భార. ద్రో. I. 62); అవిభుం గట్టెదఁబట్టుము (భార. విరా. I. 27); ఆ వంకఁబోఁడు (భాగ. VII. 117); నాచనసోము నెఱిఁగి (భాగ. VI. 11); దీనిసై రింపఁదగు (హరి. పూ. VII. 201; 'దీనికి' అని నన్నయ); మిమ్ము నేల సహింతుఁ (హరి. పూ. VI. 162; 'మీకు' అని నన్నయ); దక్షిణదిక్కుఁ బోవఁగా (హరి. ఉ. I. 25); చన్నకడం జను (భార. ఉ. IV. 178); అడవిఁబోయి (భార. అర. IV. 382); అయ్యుధిష్ఠిరు రాజ సూయంబు చిదురపాలిం బోల దీమఖంబు (భార. అర. VI. 90); సహించునె నకఁ మరుఁడు (భార. విరా. II. 296; 'నాకు' అని నన్నయ); వారియం దొకరి లోని చిదురపాలును బోలండు (భార. ఉ. II. 160); మమ్ముఁ గినియకుము (భార. అను. I. 76); 'మాకు' అని నన్నయ); నన్ను సైఁచునె=నాకు (హరి. పూ. V. 224); దానిసైఁపక (హరి. పూ. IV. 177); మనమునందు నతనిఁ

గినియవలదు = అతనికి (భాస్క. యు. 2429); క్రూరంపుఁ జరితంబులను మిగిలి వర్తింతురు వారు నామెచ్చుగారు=చరితంబులకు, నాకు (భార. శాం. V. 11); వెనుంబడుర్ (భార. విరా. II. 303), సహించునె నర్ (భార. విరా. II. 104, 296); భూతమయుర్ మ్రొక్కెద (భాగ. I. 55); నిన్నేమిసెప్పుదు= నీకు (నిర్వ. V. 123); నాకు నిర్ దెలుపనేల = నన్ను నీకు (భార. అర. VI. 184); ఎక్కడం దిరిగి (హరి. పూ. II. 44); నిద్రంబెడఁబాసి (ఉ. హరి. II. 97); లక్ష్మణకుమారుండు మిమునెల్ల మిగులు (భార. ఉ. IV. 224); ఇతఁడు మిము మెచ్చింపంగఁజాలున్ (భార. విరా. II. 10); ఎక్కడనేనియుం జను వాఁడు (కాశీ. IV. 107); జగదంబ నిన్ను నేమనిచెప్పెన్ = నీకు (హరి. ఉ. VI. 175); నిన్నినుపించువేళ (ప్రభా. III. 94); అతని బలుకున్ (పాండు. V. 6); అతనిఁగరుణించి (పద్మపు. VII. 220); నిన్ను నోర్వఁగవచ్చుటన్ (పద్మపు. VII. 81.)

### షష్ఠికిఁ దృతీయ.

విధితో నెవ్వాఁడు నేర్చుంగటా = 'విధికి' అని నన్నయ (భాస్క. అయో. 113); నేలతో వ్రేసి = నేలకుఁ బడునట్లు (భార. భీ. II.); నా తెఱఁగు నాబలంబును నీతో నెఱుఁగింతు (భాస్క. అర. II. 93); యక్షునిచే నగపడ్డ వీరిప్రాణంబులు (భార. విరా. I. 183); నాచే నగపడియె శుష్కనగఖండము (దశకు. X. 56); పురందరుతో నరకుం డాదిర్చె = 'పురందరునకు' అని నన్నయ (ఉ. హరి. I. 44); వైరిచే నగపడనీక (ఉ. రా. V. పు. 84).

### షష్ఠికిఁ బంచమి.

వీరి మాటలవలన సంశయము మానుము (శకుం. పరి. II. పు. 31).

### షష్ఠికి సప్తమి.

గదారణము వచ్చెం బెద్దగాలంబునన్ (భార. ఉ. II. 218); నామీఁదం గృపగలవు = 'నాకు' అని నన్నయ (హరి. పూ. VII; 39); చేడియమీఁద నధిక్షేపించి = చేడియకు (హరి. పూ. V. 229); (భీష్మునకు) తనయందు గలిగె భంగంబు శిఖండిచేత (భార. భీ. I); చిరకాలమున నుపార్జింపఁబడ్డ (నైష. III. 68); పార్థుని శిర మాఱునెలల కుర్విం ద్రెళ్లశపియించి (జై. IV).

### సప్తమికిఁ బ్రథమ.

గోకులమిల్లులు (హరి. పూ. V. 202); ఘోయియ్యెడుదు (భార. విరా. I. 78); ఇట్టి యవగాథపుఁ బొత్తు మనంగవచ్చునే (భార. విరా. III. 32); నిష్ఠమడుఁగు (భార. అను. III. 291); పొత్తు మనఁగవలయు (భార. శాం. III. 527); శరములు నెఱఁకులాడి (భార. అర. I); విహీనశౌచులు దీర్ఘము

లాడనోపరు (భార. అర. II); మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ (భార. శల్య I); ఎండి యవియుటయును నావమిడినఁ బగిలిపోవుటయును (భార. స్త్రీ. I.); భావంబులో భయముజ్జగించి చొరుఁడీ భవ్యాద్రిచాటందఱున్ (హరి. పూ. VII.) కనుఁగొంటిం బరమేష్ఠిఁదొట్టి సురసంఘం బేకతం బుండఁగన్ (హరి. పూ. V.); అదియున్ నేనుచ్చి (భాస్క. అర. II.); జనయిత్రి చిచ్చుటికిన దాదు లాబాలకునిఁ గొంతలంబునకుఁ గొనివచ్చి (జై. భార. VIII.); పంకము గొరిజ దిగఁబడి పఱవలేవు మన్ను లివ్వేళ రేగటిమన్నులందు (మను. IV.); ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె (ఆము. III).

## సప్తమికి ద్వితీయ.

వెన్నడింబోయి (భాస్క. కిష్కి. 730); ఎవ్వరు నెక్కాలము నిట్టునేసిరె (భార. విరా. V. 247); ఎందునుండి వచ్చితివి (విష్ణుపు. II. 27); లంకం గలకలంబువుట్టె; మీనంబులు జలంబుల నుండు; బలిమిఁగొనిన ధనముఁ బది వేల యొంటెలఁబెఱికి (భార. సభా. I.); శబ్దముల మంత్రమును మనుజుల విప్రుండు సమధికత్వ భాజనములండ్రు (భార. ఆది. III).

## సప్తమికిఁ దృతీయ.

కాముచేఁ జిక్కిన నెమ్మనంబు (భార. విరా. II. 23).

## సప్తమికిఁ బంచమి.

విభునివలన నేరము లెన్నుదురు (శకుం. పరి. I. పు. 14); నీవలని నాకుఁ బ్రేమ గలదు (శకుం. పరి. I. పు. 4); ఆ గుణంబులు వీనివలనఁ గాన రావు (వరాహ. IX. 22).

## సప్తమికి షష్ఠి.

ఆదిత్యులు పన్నిద్దఱకుఁ బెద్దవాఁడు = పన్నిద్దఱియందు (వరాహ. V. 89); నక్షత్రేటికి నెదురీదినగతి (వరాహ. II. 53); అవనికి డిగ్గిరి (కళా. III. 5); ధరణికి దిగివచ్చు (కళా. III. 7); ఇలకుడింప నుద్యోగించి (కళా. VI. 130); కోమలి నీ కనురక్త (భార. అర. II.); ఈ పాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁ గంటిమే (మను. II.); చిత్రమున రూపుంబోలె (భార. అర. VII. 407); తోటకలివెరమునవారు (S. I. I. V. 1116); తూర్పుకొన పొలాన (S. I. I. V. 132); అందుల తామ్రశాసనాలు (S. I. I. IV. 279); ఇందుల సంకీర్తనశాల (S. I. I. IV. 280); మొద.

# సర్వనామ ప్రకరణము.

ద్రావిడభాషలలోని సర్వనామములను (1) యుష్మదస్మదర్థక సర్వనామములు (2) నిర్దేశార్థక సర్వనామములు (3) ఆత్మార్థక సర్వనామములు (4) సంబంధార్థక సర్వనామములు (5) ప్రశ్నార్థక సర్వనామములు (6) సంఖ్యావాచకములు అని యాఱువర్గములుగా విభజింపవచ్చును. తెనుఁగునందలి యా యా సర్వనామముల కితరద్రావిడభాషలలోనివానితోడి సంబంధమును, ద్రావిడభాషలలోని సర్వనామములకు ఇండో - ఆర్యభాషలలోనివానితోడి సంబంధమును ఈ క్రింద సంగ్రహముగా చూపఁబడినది:—

i. నిర్దేశార్థక సర్వనామములు.

కాల్డువెల్లు వీనినిగూర్చి యెక్కుడుగఁ జర్చించి యున్నాఁడుగావున వానివిషయమై ముందుగఁ జర్చించుట యుక్తము. వివిధద్రావిడభాషలలోని వాని రూపము లీక్రిందిపట్టికలో నీయఁబడినవి.

| | | మ. ఏ. | మహతి. ఏ | ఉభయ బ. | అమ. ఏ. | అమ. బ. |
|---|---|---|---|---|---|---|
| తమిళము | దూర | అవ్ - అన్ | అవ్ - అళ్ | అవ్ - అర్ | అద్ - ఉ | అవ్ - అవ్ - ఐ. |
| | అంతిక | ఇవ్ - అన్ | ఇవ్ - అళ్ | ఇవ్ - అర్ | ఇద్ - ఉ | ఇవ్ - ఇవ్ - ఐ. |
| | | ఉవ్ - అన్. | ఉవ్ - అళ్ | ఉవ్ - అర్ | ఉద్ - ఉ | ఉవ్ - ఉవ్ - ఐ. |
| మళయాళము | దూర | అవ్ - అళ్, ఓన్ | అవ్ - అళ్, ఓళ్ | అవ్ - అర్, ఓర్ | అద్ - ఉ | అవ్ - అ. |
| | అంతిక | ఇవ్ - అన్ | ఇవ్ - అళ్ | ఇవ్ - అర్ | ఇద్ - ఉ | ఇవ్ - అ. |
| కన్నడము | దూర | అవ్ - అను | అవ్ - అళు | అవ్ - అరు | అద్ - ఉ | అవ్ - ఉ. |
| | అంతిక | ఇవ్ - అను | ఇవ్ - అళు | ఇవ్ - అరు | ఇద్ - ఉ | ఇవ్ - ఉ. |
| | | ఉవ్ - అను | ఉవ్ - అళు | ఉవ్ - అరు | ఉద్ - ఉ | ఉవ్ - ఉ. |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తుళు | దూర / అంతిక | ఆమ్ - ఎ | ఆళ్ | ఆర్ (పూజ) | అవ్ - ఉ | ఎయ్ - సలు. |
| | | ఇమ్ - బ్ - ఎ | మోళ్ *ఉమ్.అళ్ | మాకేళు*ఉమ-కుళు | ఇద్ద్ - ఉ | |
| | | ... | ఇమ్బళ్ - ఇమ్బాళ్ | ... | ... | ... |
| | | ... | ... | .. | ఉద్ద్ - ఉ | ... |
| | | ... | ... | ... | ... | ఇవ్ - ఇ. |
| | | ... | ఇమ్త్ - ఓళు | ... | ... | ... |
| | | ... | ... | మ్ - ఏర్ | ... | ... |
| | | | | (* ఇమ్ - అర్) | | |
| | | ... | ... | ఇమ్బ్- ఏర్ (పూజ) | ... | ... |
| | | మ. ఏ. | మహతి. ఏ. | ఉభయ. బ. | అమ. ఏ. | అమ. బ. |
| చెన్నరాజధాని లోని గోంది | దూర | ఓణ్డ్ - ఉ | అద్ద్ - ఉ | ఓర్ - ఉ | అద్ద్ - ఉ | అవ్ - ఉ. |
| | అంతిక | వీణ్డ్ - ఉ | ఇద్ద్ - ఉ | వీర్ - ఉ | ఇద్ద్ - ఉ | ఇవ్ - ఉ. |
| గోంది | దూర | ఓర్ | అద్ | ఓర్ - క్ | అద్ | అవ్; అడు. |
| | అంతిక | ఏర్ | ఇద్ | ఏర్ - క్ | ఇద్ | ఇవ్; ఇడు. |
| కూఈ | దూర | ఎ అణ్జు ఓ అణ్జు | ఏరి | ఏఅర్ - ఉ | ఏర్ - ఇ | ఏవ్ - ఇ. |
| | అంతిక | ఇ అణ్జు | ఇరి | ఇఅర్ - ఉ | ఇర్ - ఇ | ఇవ్ - ఇ. |
| తెలుఁగు | దూర | వాఁడు (*అవఁడు) | అది | వారు = (*అవర్ - ఉ) | అద్ - ఇ | అవ్ - ఇ. |
| | అంతిక | వీఁడు (*ఇవఁడు) | ఇది | వీరు (* ఇవర్ - ఉ) | ఇద్ - ఇ | ఇవ్ - ఇ. |

పైఁ జూపిన రూపములలో ననేకముల యంతమున ఉకార మున్నది. అది ధాతుగతము కాదు; ఉచ్చారణ సౌకర్యమునకుఁ జేరినది.

ఇవిగాక (1) అ, ఇ, ఉ, అను నిర్దేశార్థక చిహ్నములు: ఉదా. తమిళము: అక్కుదిరెయ్ (ఆ గుఱ్ఱము); ఇమ్మనెయ్ (ఈ యిల్లు); ఉవ్వణి, మొద. (2) ఆ, ఈ, ఊ, ఏ, ఓ, అను నిర్దేశార్థక విశేషణములు: ఉదా. తెలుఁగు: ఆ గుఱ్ఱము; తుళు: ఈ జన; కురుఖ్: ఊ ములుక్; కూఈ: ఏ దేశ; ఓ కోగజ్జ=ఆ పిల్లవాఁడు, మొద. అనువానిఁ గూర్చికూడ నీ సందర్భమున విచారింపవలెను.

దూరార్థమును దెలియఁజేయు నీ సర్వనామములందలి అవ్, అవ అనునవే మళయాళము, కూఈ, గోండీ, చెన్నరాజధాని గోండీ భాషలందు కొన్ని రూపములలో 'ఓ' గాను, తుళు భాషలో 'ఆ' గాను మాఱియున్నది. తుళు భాషయందలి ఈ 'ఆ' కారము ప్రథమేతర విభక్తులలోను, బహువచన మందును 'ఎయ్' గా మాఱుచున్నది. ఉదా. ఎయ్కు = దానికి; ఎయ్కులు =వారు. కొన్ని తెలుఁగు రూపములలో (వాఁడు, వీఁడు, వారు, వీరు) అ, ఇ లు పదముల లోని తమ ప్రథమస్థానమును పోఁగొట్టుకొన్నని. ఇట్లే తుళులోని (మోళ్, మేర్, మోకుళు) పదాది అ, కార ఉకారములును దమ ప్రథమస్థానమును పోఁగొట్టుకొన్నవి. తెలుఁగులోను, మద్రాసు గోండీలోను ప్రథమావిభక్తి యందు (అది, అవి, ఇది, ఇవి, మొద.) పదాదిని అకార ఇకారములు నిలిచినను, ప్రథమేతర విభక్తులం దా యచ్చులు తమ స్థానమును గోల్పోయినవి (దాని, దీని, వాని, వీని, మొద). తుళు భాషలో సర్వనామములందు కాన్పించు మకారము ధాతుగతమేకాని కాల్డువెల్లు తలంచిన ట్లుచ్చారణ సౌకర్యమునకు వచ్చిన వకారమునకు మాఱురూపము గాదు.

అ, ఇ, ఉ, అను మూఁడు నిర్దేశార్థక వర్ణములలో 'అ' దూరపు వస్తువును, 'ఇ' దగ్గఱి వస్తువును దెలుపును. 'ఉ' అనునది రెండిటికి మధ్యనున్న వస్తువును దెలుపునని కిట్టెల్ మున్నగువా రూహించిరి. కాని, యాయా భాషల వ్యాకరణములను వ్రాసిన ప్రాచీనులు దాని కట్టి యర్థమును నిరూపించి యుండలేదు. ప్రాచీన తమిళమునందుగాని హళగన్నడమునందుగాని ప్రయోగములందు దానికట్టి యర్థములేదు. అది దూరపువస్తువునే తెలుపుచుండెను. తమిళమున 'ఉకుబర్' అనఁగా 'దూరపు ప్రక్క'; 'ఊజ్జు' అనఁగా 'ఎత్తైన', 'మీఁది' అని యర్థము; 'ఉప్పక్కమ్' అనఁగా 'వెనుక ప్రక్క' 'దూరముగా నున్నప్రక్క' అని యర్థము; 'ఉప్పాల్' అనఁగా 'దూరపుదిక్కు' అని యర్థము. తెనుఁగున 'ఉల్ల' అనునది దూరపు వస్తువును నిరూపించుట యందే ప్రాచీన వాఙ్మయమున క్వాచిత్కముగ వాడఁబడినది. నేఁడు తుళు

భాషయందు తప్ప మఱి దేనియందును ఈ 'ఉ' కారము నిర్దేశార్థమున వాడుకయందు లేదు. అందైనను 'ఇందు', 'ఉందు' అనునవి 'ఇది' అను నర్థముననే వాడఁబడుచున్నది. 'ఇందు', 'ఉందు' లు తుళు భాషయం దేకార్థమున వాడుటను బట్టి 'ఉ' అనునది మధ్య ప్రదేశ సూచకము కాదనియే తెలియుచున్నది. దూరార్థ బోధకమయిన 'అవ' అనునది ఇండో-ఐరేనియను భాషలలోనిదనియు, అదియే పెర్షియనుభాషలో 'ఊ' గాను, ఉత్తర హిందూస్థాన భాషలలో ఓ, ఊలుగాను మాఱినదనియు, ద్రావిడ భాషల లోని హ్రస్వ 'ఉ'కారమునకును నట్లే యుత్పత్తిని చెప్పుకొనవలె ననియు తోఁచుచున్నది.

తమిళ వ్యాకరణమైన 'నన్నూలు' 13-వ శతాబ్దారంభమున పుట్టినది. అందు "అ, ఇ, ఉ, ఎ"ల తర్వాత 'య, వ'లు వచ్చినయెడల 'వ' కార మాగమముగా వచ్చుననియు, నితర హల్లులు పరమైనయెడల నా హల్లులకు ద్విత్వము కలుగుననియుఁ జెప్పఁబడియున్నది. ఉదా:

అ + అణి = అవ్వణి; ఆ + వళై = అవ్వళై; ఆ + యానై = అయ్యానై ఆ + కుదిరై = అక్కుదిరై; ఆ + మనై = అమ్మనై, మొద.

ఈ సూత్రము ననుసరించి అవన్, ఇవన్, ఉవన్, ఎవన్, అను సర్వ నామములను అ + వ్ + అన్; ఇ + వ్ + అన్; ఉ + వ్ + అన్; ఎ + వ్ + అన్, అని విభజించుట యాచారమైనది. కాల్డ్వెలు ఈ విభాగమునే యనుస రించినాఁడు. కాని, నన్నూలునందే మఱియొకచోట అవ్, ఇవ్, ఉవ్, ఎవ్, లు ప్రాతిపదికములుగ చెప్పఁబడినవి. దీని ననుసరించి ఆ + యానై = అవ్వానై; ఇ + యానై = ఇవ్వానై; ఉ + యానై = ఉవ్వానై, అగును. ఇట్లే అ, ఇ, ఉ, లకు పరుషాక్షరములు పరమైన యెడల 'ం' ఆద్యము ఆగ మముగా వచ్చునని చెప్పఁబడియున్నది. దీనినిబట్టి అ + కుదిరై = అంకుదిరై అగును. ఇట్లే అందు = అవ్ + తు; ఇందు = ఇవ్ + తు; ఉందు= ఉవ్+తు యగును. కాఁబట్టి ఆద్యముతోఁ గూడిన రూపములే ప్రాచీనము లనియు, అంకమ్, అంకేనమ్, ఎంకు అను ప్రాచీనరూపములు అక్కమ్, అక్కేనా, ఎక్కులుగా మాఱినట్లే "అంకుదిరై" మొదలగు రూపములనుండి "అక్కుదిరై" మొదలగు రూపములు పుట్టినవనియు, వ-కార మాగమాక్షరము కాదనియు, అది ధాతుగతమే యనియు, అవ్, ఇవ్, ఉవ్, ఎవ్,లే నిర్దేశ వాచకములు గాని, అ, ఇ, ఉ, ఎ, లు కావనియు, అ, ఇ, ఉ, ఎ, లా సంపూర్ణ రూపములందలి ప్రథమాక్షరములు మాత్ర మనియు, కావున అవన్, ఇవన్, ఉవన్, ఎవన్, లను అవ్ + అన్, ఇవ్ + అన్, ఉవ్ + అన్, ఎవ్ + అన్, అని విభజింపవలెననియు తేలుచున్నది. ఇట్లే, 'అదు, ఇదు, ఉదు, ఎదు'లలో

అద్, ఇద్, ఉద్, ఎద్,లు ధాతుగతములు, కావున వానిని అద్ + ఉ, ఇద్ + ఉ, ఉద్ + ఉ, ఎద్ + ఉ, అని విభజింపవలెను గాని అ + ద్ + ఉ, ఇ + ద్ + ఉ, ఉ + ద్ + ఉ, ఎ + ద్ + ఉ లు గ కాల్డువెల్లుచేసినట్లు విభజింపఁగూడదు.

## సంస్కృతమున నిర్దేశార్థక సర్వనామములు.

సంస్కృతమున 'తద్, త్యద్' లు ప్రథమపురుషసర్వనామములుగను, నిర్దేశార్థక సర్వనామములుగను గూడ వాడఁబడును. ఇవిగాక అదస్, ఇదమ్, ఏతద్, అను అ, ఇ, ఏ, లు ఆదియందుగల నిర్దేశార్థక సర్వనామములును సంస్కృతమునఁ గలవు. 'అయమ్ (పుంలింగము)' ఇయమ్ (స్త్రీలింగము), ఇదమ్ (నపుంసకలింగము) అనునవి యంతికార్థమును గలిగినవి. వీని ప్రథమేతర విభక్తులందు అన,-ఇమ అనునవి ప్రాతిపదికములుగఁ గొన్నియెడలఁ గాన్పించుచుండును (అనేన, అనయా, అనయోః; ఇమా, ఇమే, ఇమా; ఇమాని.) 'అసౌ (పుం. స్త్రీ), అదస్' లు దూరార్థకములు. వీని ప్రథమేతర విభక్తులందు 'అమ్' ప్రాతిపదికముగాఁగల 'అము, అమూ, అమీ,' అను రూపములు కానవచ్చును. 'అవ' అనునది గూడ నతిప్రాచీనకాలమున దూరార్థక సర్వనామముగ ఋగ్వేదమున రెండు, మూఁడు సార్లు షష్ఠీద్వివచనమునఁ గానవచ్చినది. 'అవ'కు రూపాంతరమగు 'అమ' అనునది అథర్వవేదమున 'అమోహామస్మి' అను ప్రయోగమున నొకసారి కానవచ్చినది.

## ఐరేనియనుభాషలో నిర్దేశార్థక సర్వనామములు.

ఐరేనియను భాషలో (i) పుం. అఎత; స్త్రీ. అఎతా; నపుం. అఎద్; (ii) పుం. ఇమ; అ; స్త్రీ. ఇమా, అ; నపుం. ఇమద్. ఇద్. (iii) పుం. అవ; స్త్రీ. అవా; నపుం. అ ఒమ్, అవద్. వీనిలో i-వ వర్గములోనివి సంస్కృతములోని 'ఏతద్' వలెనే యున్నవి. ii-వ వర్గము ప్రథమేతరవిభక్తులలో "అద్, ఇద్, అ, ఇ, ఇమ" అను ప్రాతిపదికములు కానవచ్చుచున్నవి. ఇవిగాక ప్రథమా, ద్వితీయా విభక్త్యేకవచనములలో నపుంసకలింగమున "అద్, ఇద్, ఈద్"లును, నపుంసకలింగ ప్రథమా బహువచనమున 'ఈ, ఇమా' పుంలింగమున 'ఇమే,' స్త్రీలింగమున 'ఇమాఏ' అను రూపములును గాన్పించుచున్నవి. iii-వ వర్గము ప్రథమేతరవిభక్తి రూపములన్నియు 'అవ్' అను ప్రాతిపదికమునుండియే కలుగుచున్నవి. ప్రథమా బహువచనమున వీనికి 'అవే' అనురూపము కలుగును. 'అమ్' అను ప్రాతిపదికమునుండి యేర్పడిన అరూపములు తప్ప, తక్కిన యన్నిరూపములును కొన్ని వికారములతో ఐరేని

యను భాషయందును గాన్పించుచున్నవి. ఈ రూపము లన్నిటిలోను 'అ, ఇ, అవ్, అన్, ఇద్' అనునవి సంస్కృత, ఐరేనియను భాషలయందుండుటయే కాక, ఇండో-జెర్మానికుయుగమునుండియు నున్నట్లు బ్రుగ్మన్ వ్రాసిన ఇండో-జెర్మానిక్ భాషల చరిత్రమువలనఁ దెలిసికొనవచ్చును. లాటిను భాషలోని 'ఇద్', ఇంగ్లీషులోని 'ఇట్' అనునవికూడ ద్రావిడభాషలలోని 'ఇద్' తో సంబంధించిన వనుట స్పష్టము.

ఆధునిక పెర్షియనుభాష.

ప్రథమ పురుషైకవచనమున ఆధునిక పెర్షియను భాషలో 'అవ్' అనునది నిర్దేశార్థక సర్వనామము. దీనిని 'ఊ' గా ఉచ్చరింతురు. దీనికి ప్రాచీనరూపము 'ఊఎ' = వాఁడు, ఆమె, అది. ఇది అవెస్తాభాషలోని 'అవ'కు వికారము. ఆధునిక పెర్షియను 'ఊ; (ఓ)' = పజేందుభాష 'ఓ' = ప్రాచీన పెర్షియను 'అవ.' ఆధునిక పెర్షియను 'ఈ' = పజేందుభాష 'ఓయ్' = ప్రాచీన పెర్షియను 'అవ+హ్యా.' 'వై' అనునది 'అవ' 'ఓయ్' ల సమ్మేళనమువలన గలిగియుండవచ్చును. దీనికి బహువచనరూపము : "ఈ-షాన్. = వారు."

ప్రాచీన పెర్షియనులో 'ఇమ్' అను మఱియొక నిర్దేశార్థక సర్వనామ మున్నది. ఇది సంస్కృతములోని 'ఇమ' తో సంబంధించినది. 'రోజ్=వినుట' షప్ = రాత్రి; సాల్ = సంవత్సరము; కొన్నియెడల 'బార్ = కాలము' అను శబ్దములకు పూర్వమందు వచ్చు 'ఈన్' అను పదమునకు బదులుగ 'ఇమ్, వచ్చుచుండును.

ఇవిగాక 'ఈ' (ప్రాచీనరూపము 'ఏ') అనునొక నిర్దేశార్థక విశేషణ ముగూడ నాధునిక పెర్షియనునం దున్నది. దీనిని విశేష్యములకుఁ బూర్వ మందు ఏకవచనమందును, బహువచనమందునుగూడఁ జేర్పవచ్చును. ఇది ప్రాచీనపెర్షియనులోని 'అఎత' అనుదానినుండి కలిగినది.

అధునిక ఇండో-ఆర్యభాషలలో నిర్దేశార్థక సర్వనామములు.

| | దూర | అంతిక |
|---|---|---|
| | ప్ర. ఏ. | ప్ర. ఏ. |
| హిందీ | ఉ, ఓ, వహ్ | ఇ, ఇహ్, ఏ, ఏహ్, యహ్. |
| పంజాబీ | ఉహ్ | ఇహ్, ఏహ్. |
| సింధీ | ఊ, వూ, హూ | ఈ, హీ, హే. |
| గుజరాతీ | ఆ | ఏ |
| బంగాలీ | ఓ | ఏ |

అవెస్తాభాషలోని 'అవ' అను రూపము భారతీయార్యభాషలలో లేకుండినను, దాని వికారములైన 'ఓ; ఊ, ఉ'లు హిందూదేశార్యభాషలయందెల్లఁ గలవు. ఇవి యీ భాషలయందెల్ల దూరార్థనిర్దేశక సర్వనామములుగా నున్నవి.

వైదికభాషలలోని అ, ఇ, ఏ, లను నిర్దేశార్థకములలో 'అ' అను నదొక్కటే స్వతంత్ర ప్రయోగము గలదైనను, ఆమూఁటికిని భారతీయార్య భాషలందు స్వతంత్ర ప్రయోగముగలదు.

ద్రావిడభాషలయందును నార్యభాషలందును
నిర్దేశార్థక సర్వనామములకుఁ గల సంబంధము.

ఈ క్రిందిపట్టికవలన ద్రావిడభాషలందును నార్యభాషలందును నిర్దేశార్థక సర్వనామములకుఁ గల సంబంధము స్పష్టపడఁగలదు.



| ఐరేనియను అవెస్తాభాష. | | ఇండో- ఆర్యభాషలు వైదికభాష | | ద్రావిడభాషలు. | |
|---|---|---|---|---|---|
| దూర | అంతిక | దూర | అంతిక | దూర | అంతిక |
| 1. అద్ | ఇద్ | అద్-అస్ | ఇద్-అమ్ | అద్ | ఇద్ (గోంది) |
| | | | | అద్-ఇ | ఇద్-ఇ (తెలుఁగు, |
| | | | | అద్-ఉ | ఇద్-ఉ (తమిఴి. మళ. కన్నడ.) |
| 2. అవ్ | ఇమ్ | అవ్ } అమ్ } | ఇమ్ | అవ్ | ఇవ్, తమి. గోంది.) |
| | | | | అవ్-ఐ | ఇవ్-ఐ } (తమి.) |
| | | | | అన్ద్-అ | ఇన్ట్-అ } (తమి.) |
| | | | | అవ్-ఆ | ఇవ్-అ (మళ.) |
| | | | | అవ్-ఉ | ఇవ్-ఉ (కన్న.) |
| | | | | అవ్-ఉ | ఇన్ద్-ఉ, ఉన్ద్-ఉ ఇమ్బ్-ఎ, ఇమ్బ్-ఎర్ ఇమ్బ్-అళ్, ఇమ్బ్-ఆళ్, ఇమ్బ్-ఓళు, మేర్. (తుళు) |
| | | | | అవ్-ఇ | ఇవ్-ఇ } తెలుఁగు |
| | | | | అన్ద్-ఉ | ఇన్ద్-ఉ } తెలుఁగు |
| 3. అన్ | | అన్ | | అన్ | (క్రియాప్రత్యయము. తమి.) |
| 4. అ | ఇ | అ | ఇ | అ ఉ ఇ | (తమి, తుళు, కన్నడ.) |
| 5. ఓ (ఏ. పహ్లవీ భాష) | | ఆ, ఊ, ఓ. | ఈ | (1) సమాసములలో (ఆధునిక గోంది; కూఇ, మద్రాసుగోంది; మళ) | |
| ఊ | ఈ (ఆధునిక పెర్షియను) | ఊ | ఈ (ఆధునికార్యభాషలు) | | |

| ఐరేనియను అవెస్తాభాష. | ఇండో - ఆర్యభాషలు వైదికభాష | ద్రావిడభాషలు. |
|---|---|---|
| | | (2) స్వతంత్రనిర్దేశార్థక విశేషణములు.<br>ఆ, ఈ (కన్న. తుళు, మళ. కురుఖ్, తెలుఁగు.)<br>ఊ, ఏ, ఓ (కూఇ)<br>ఉ (కురుఖ్)<br>ఏ ఓ (బ్రాహూఈ.) |

పై దానినిబట్టి ద్రావిడభాషలలోని నిర్దేశార్థక సర్వనామములు అవెస్తా, వైదిక, సంస్కృత, ఆధునికార్యభాషలలోని నిర్దేశార్థక సర్వనామములతో సంబంధము గలవని సూక్ష్మదృష్టికి గోచరింపఁగలదు. దీనిని బట్టి మూఁడు విధములైన నిర్దేశార్థకపదములు తేలుచున్నవి.

(i) అద్, ఇద్; అవ్, ఇవ్:

అవెస్తాభాషలో అద్, ఇద్, లును, సంస్కృతమున 'అద్-అస్,' 'ఇద్-అమ్, లును నపుంసకలింగైకవచన రూపములు. అట్లే ద్రావిడభాషలలో అద్, ఇద్; అద్-ఉ, ఇద్-ఉ; అద్ - ఇ; ఇద్ - ఇ - అనునవి కూడ నపుంసకలింగైకవచనరూపములే.

నపుంసకలింగ బహువచనమున అవెస్తాభాషలో 'అవే, ఇమా, ఇను, ఈ, లును, సంస్కృతమున 'అమూని, ఇమాని, ఇమా' లును, ప్రాచీన పెర్షియనుభాషలో 'అవై, ఇమై' లును వచ్చును. నపుంసకలింగబహువచనముననే ద్రావిడభాషలలో 'అవ్, ఇవ్' అను ప్రాతిపదికనులనుండి అవ్, ఇవ్; అవ్-ఐ, ఇవ్-ఐ; అవ్-ఇ, ఇవ్-ఇ; అవ్-ఉ, ఇవ్-ఉ—అనునవి గలవు.

నపుంసకలింగైకవచనమున 'ద' కారము అజ్మధ్యగత పరుషమునకు వికారముగాదు; అది ధాతుగతమే. కావుననే తెనుఁగున నది పదాదిని జేరినను 'ద'కారముగనే నిలిచినది: అది, దాని; ఇది, దీని, మొద. ఇట్లే నపుంసకలింగ బహువచనమున 'వ'కారము ధాతుగతమేకాని కాల్డువెల్లు చెప్పినట్లు ఆగమవర్ణము కాదు.

అవెస్తాభాషలో అవ్, ఇమ్,లకు పుంస్త్రీ నపుంసకలింగ ప్రత్యయములను జేర్చుటవలన నాయా సర్వనామము లేర్పడును: పుం. అవ; స్త్రీ. అవా; నపుం.అవద్, అఐమ్; పుం. ఇమ; స్త్రీ. ఇమా; నపుం. ఇమద్. ఇండో-ఆర్య-

గ్రాంథికభాషలలో వైదికకాలమున 'ఇమ్' అనుదాని పోలికను 'అమ్' అనునొక ప్రాతిపదికము చేరినది. 'అవ్' అనునది లోపించినది. లేదా, 'అవ్' లోని 'వ'కారము 'మ'కారముగా మారినదనియైనను జెప్పవచ్చును. ఇట్లే. తమిళము మొదలగు ద్రావిడభాషలలో అవ్, ఇవ్,లు సర్వనామముల ప్రాతిపదికములైనవి. ఉదా: అవ్-అన్; ఇవ్-అన్; అవ్-అళ్, ఇవ్-అళ్; అఃందు, ఇఃందు, మొద.

ఇండో-ఆర్యభాషలకును ద్రావిడభాషలకును నీరీతిగా నిర్దేశక సర్వనామముల విషయమున సంపూర్ణ సంబంధ మేర్పడినది. 'మ'కారమునకు మాఱుగ 'వ'కారము కనఁబడుట యొకభేద మనవచ్చునుగాని, ఆ 'మ'కారము తుళు భాషయందు కానవచ్చుచునేయున్నది.

(ii) అ, ఇ, ఉ, ఎ, ఆ, ఈ, ఊ, ఏ, ఓ:

అవెస్తా భాషలోని 'అవ' 'ఓ'గాను, 'ఇవ' 'ఈ'గాను ప్రాచీన పెర్షియను భాషయందే మాఱినవి. ఆధునికార్యభాషలందును నివి కాన్పించుచున్నవి. గోండీలో 'ఓర్', మద్రాసుగోండీలో 'ఓణ్ణు'; కూఈలో 'ఓఅణ్జు' అనునవి 'వాఁడు' అను నర్థమునఁ గానవచ్చుచున్నవి. ఈ 'ఓ,యో' 'ఒ,ఊ, ఉ'లుగ మాఱినది. అ, ఆ, ఇ, ఈ లు సర్వసాధారణముగ నన్నిద్రావిడభాషలయందును గాన్పించుచునే యున్నవి. 'ఏ' అనునది అవెస్తాలో 'ఎయ్‌త' గను ప్రాకృతమున 'ఏ' గను, కొన్ని యాధునికార్యభాషలలో 'ఏ'= గా కాన్పించుచున్నది.

(iii) అన్:—గ్రాంథికమగు తమిళభాషలో క్రియాప్రత్యయములందు 'అనన్, అనళ్, అన్ఱు, అనర్, అన' అనునవి 'ఇరున్దవన్, ఇరున్దవళ్, మొదలగు రూపములందువలెనే ఏర్పడుచున్నవి. అవన్, అవళ్ లకు, 'అవ్' ప్రాతిపదికమైనట్లే, వీనికి 'అన్' అనునది ప్రాతిపదికము.

(iv) త:—తెలుఁగు: అతఁడు, ఆతఁడు, అతను, ఆతను; ఇతఁడు, ఈతఁడు, ఇతను, ఈతను; కన్నడము: ఆతమ్, ఈతమ్, ఊతమ్; తుద: అతమ్, ఇతమ్—ఈ రూపములలోని 'త' వర్ణము సంస్కృత ప్రాతిపదికము 'ఏత', అవెస్తా ప్రాతిపదికము 'ఎయ్త' అనువానిలోని 'త' వర్ణము ననుసరించియున్నది.

## ద్రావిడభాషలలో ప్రశ్నార్థకసర్వనామము.

ముఖ్యములయిన ద్రావిడభాషలలోని ప్రశ్నార్థకసర్వనామము లీక్రింది పట్టికలో చూపఁబడినవి.

| పు. ఏ. | మహ. ఏ. | ఉభ. బ. | అమ. ఏ. | అమ. బ. |
|---|---|---|---|---|
| ప్రాచీనతమిళము-<br>యావ్ - అన్ | యావ్ - అళ్ | యావ్ - అర్<br>యార్ | యా-దు | యా; యావ్ |
| (లింగరహితమగు రూపము యార్; ఎవన్, ఎన్న.) | | | | |
| ఆధునికతమిళము-<br>ఎవ్ - అన్ | ఎవ్ - అళ్ | ఎవ్ - అర్ | ఎ - దు<br>ఏ - దు } | ఎవ్ - ఐ. |
| మళయాళము-<br>యావ్ - అన్<br><br>ఏవ్ - అన్ | యావ్ - అళ్<br><br><br>ఏవ్ - అళ్ | యావ్ - అర్<br>యార్<br>ఏవ్ - అర్<br>ఆర్ } | యా - దు<br><br>ఏన్దు<br>ఏ - దు } | ఏవ్ - అ. |
| హళగన్నడము-ఆవ్ - అమ్ | అవ్ - అళ్ | ఆ - ర్ | ఆవ్ - ఉదు | ఆవ్ - ఉవు. |
| హొసగన్నడము-<br>యావ్ - అను<br><br><br>దావ్ - అను | యావ్ - అళు<br><br><br><br>యావ్ - అళు | యావ్ - అరు<br>యా - రు<br>ఆ - రు<br>దా- రు | యావ్ - అదు<br><br><br><br>దావ్ - అదు | యావ్ అవు.<br><br><br><br>దావ్ - అవు. |
| తెలుగు-ఎవ్ - అఁడు | ఎది, ఏ - ది | ఎవ్ - అరు | ఎ - ది<br>ఏ - ది | ఎ - వి.<br>ఏ - వి. |

(అవ్యయము: ఏమి)

పై రూపములలో కొన్ని 'యా' తోను, కొన్ని 'ఆ' తోను, కొన్ని 'ఎ,ఏ'లతోను, కొన్ని 'దా'తోను ఆరంభించుచున్నవి. వీనిలో 'యా'తో నారంభించు రూపములు ప్రాచీనములు. తమిళమున 'తొల్కాప్పియ' మందు 'ఎ' తో నారంభించు రూపములు లేవు. ఆంధ్రశబ్దచింతామణి ప్రకారము తెనుఁగున పదాదిని 'య'కార ముండవచ్చు ననుట ప్రాచీనసంప్రదాయమును స్మరింపఁజేయుచున్నది. కాఁబట్టి 'యా'తోడి రూపములు ప్రాచీనము లనియు 'అ, ఆ, ఎ, ఏ'లతోడి రూపము లర్వాచీనము లనియుఁ దెలిసికొనవలెను.

'దా' తోడి రూపములు యా = జా = దా అనురీతిగ మాఱుటవలన నేర్పడినవి. ప్రాకృతములలో యకారము జకారముగ మాఱును. ఉదా. యష్టి = జట్ఠి; యశస్ = జసో; యక్ష = జక్ఖ, మొద; 'ఇష్లే యావత్' 'జావ' గా మాఱును. సంస్కృత 'య'కారము అర్ధమాగధీ, సింహాళీభాషలలో దకారముగా మాఱును. ఉదా. జుగుప్సా = దుగుంఛా; జ్యోత్స్నా = దోసినా; రాజన్ = రాద; తేజస్ = తేదు; మజ్జా = మిదుల్, మొద. కొన్ని ఉత్తర హిందూస్థానభాషలలో 'జామాతా' = దామాదా, మొద.

ఉత్తర హిందూస్థాన భాషలనుండియు, భారతీయేతర భాషల నుండియుఁ జేరిన పదములలోని జకారముగూడ ద్రావిడభాషలలో దకార

ముగా మాఱును. ఉదా. జినుసు = దినుసు; జవన = దవన (ఒక ఓషధి), మొద. కన్నడమున నేకాక తుళుభాషలో 'జానే (ఏమి) = దానే, అను రెండు రూపములును, దా, దాయే, అను రూపములునుగలవు. ఈ బ్రాహూ ఈ భాషలో 'దేర్' = ఎవరు అను రూపను గలదు. ఈ యుదాహరణము లన్నిటినిబట్టి, 'యా' ఆదియందుగల రూపములు ప్రాచీనము లనియుఁ దక్కిన యన్నిరూపములు నర్వాచీనములనియు, ఈ ప్రశ్నార్థక సర్వనామ ప్రాతిపదికము సంస్కృతము, అవెస్తా, ఉత్తర హిందూస్థానభాషలు, ద్రావిడభాషలు— అన్నిటికిని సామాన్యమనియుఁ దేలుచున్నది.

'యా' అను సర్వనామ ప్రాతిపదికమునకు వ్యుత్పత్తిని దెలుపుచు సంబంధార్థక యచ్ఛబ్దమునుండి యది గలిగియుండవచ్చు నని తెలిపియుంటిమి. తెనుఁగున 'ఏమి' మొదలగు ప్రశ్నార్థకశబ్దములను వైయాకరణులు 'యతి మర్థకము' లని తెలిపియున్నారు గదా. ఇట్లే, సంస్కృతాద్యార్యభాషల యందును యచ్ఛబ్దమునకు కిమర్థముకూడ కొన్నియెడల సంక్రమించినది. కాఁబట్టి 'యా' అనునది యచ్ఛబ్దభవ మనుట యసంగతము కానేరదు.

లేదా, 'యా' అనుదానికి వేఱు విధముగఁ గూడ సంస్కృతమందలి కిమ్ శబ్దమునుండియే వ్యుత్పత్తి నేర్పఱుపవచ్చును. కిమ్, కియత్, కీవత్ (వేదము) మొదలగువానియందు కకారముతో తాలవ్యాచ్చు చేరియున్నది. కావుననే హిందూస్థానీ మొదలగు భాషలందు 'క్యా' మొదలగు రూపము లేర్పడినవి. తాలవ్యాజ్ఝల్సంయోగమున కకారము తాలవ్యహల్లుగా మాఱుట సహజమే. ఇట్టి మార్పు గుజరాతీ భాషయందు గలిగినది. ఆ భాషలో పుంలింగమున 'శో,' స్త్రీలింగమున 'శీ,' నపుంసకలింగమున 'శుమ్' అనునవి ప్రశ్నార్థక సర్వనామములుగ నున్నవి. సింధీభాషలో 'ఛా' అనునది నపుంసలింగ ప్రశ్నార్థక సర్వనామము. కావున కకారము చ, శ, లుగా మాఱి, తుదకు యకారముగ మాఱియుండును. ఇట్లు ప్రశ్నార్థక కిమ్ శబ్దభవమగు యకారమును, యచ్ఛబ్దభవమగు యకారమునుగూడ ద్రావిడభాషలందుచేరి, రాను రాను వాని వ్యుత్పత్తి మఱుఁగుపడి, యారెండును నొక్కటే యను భ్రాంతిని గలిగించి యుండవచ్చును.

## సంబంధార్థక క్రియాజన్య విశేషణములు.

వీనికిఁ దమిళమున 'పెయరెచ్చమ్' అందురు. భూత, వర్తమాన, తద్ధర్మ కాలబోధకములగు మూఁడు విధములగు నిట్టి విశేషణములు గలవు.

| | తమిళము | కన్నడము | తెనుఁగు |
|---|---|---|---|
| భూత. | శెయ్ద | గెయ్ద | చేసిన |
| | కట్టిన | | |
| వర్తమాన. | శెగ్గిఱ | | చేయుచున్న, చేస్తున్న |
| తద్ధర్మ | శెయ్యుమ్ | గెయ్యువ | చేయు |

క్రియలకు సర్వనామప్రత్యయములు చేరని రూపములకు సాధారణముగ 'అ' అనుదానిని చేర్చుటవలన నిట్టి యనేక విశేషణము లేర్పడును. సర్వనామప్రత్యయములు చేరని క్రియారూపములపై (తమి: శెయ్యుమ్; తెనుఁగు: చేయు ఈ'-అ'కారము చేరదు. ఈ'-అ' కారమునకు మూల మేది యని కాల్డువెల్లు పెద్ద చర్చచేసి తుదకది షష్ఠీవిభక్తియైన '-అ'వర్ణకముగా నిర్ణయించినాఁడు. గుండర్టు ఈ '-అ'వర్ణము సంబంధార్థక సర్వనామ ప్రాతిపదికమగు 'అ-' అని నిర్ణయించినాఁడు.

### సర్వనామముల లింగ – వచన బోధక ప్రత్యయములు.

సంబంధార్థక సర్వనామములకును, ప్రశ్నార్థక సర్వనామములకును లింగ - వచనబోధక ప్రత్యయములు సమానములని యిదివఱకు చెప్పఁబడినది.

i. మహద్వాచకము - ఏకవచనము: '-న్' అనునది ఈ యర్థమున తమిళ-మళయాళములందు వచ్చును. ఆంధ్ర - గోండీ భాషావర్గములలో నీ 'న్' అనునది ప్రథమేతరవిభక్తులలో మాత్రము కానవచ్చుచున్నది. ఆ భాషలలో ప్రథమైకవచనమున -ండ్, 'ఁడ్, ర్, ఞ్' అనునవి చేరును.

ii. మహతీవాచకము - ఏకవచనము: '-ళ్' అనునది తమిళ-మళయాళములలో నీయర్థమున వచ్చును. ఆంధ్ర-గోండీ భాషావర్గములలో నీ ప్రత్యయము లోపించినది. అందు మహత్యేతరామహత్ప్రత్యయమే మహత్యమహత్తులకు సమానముగ నుపయోగింపఁబడుచున్నది.

iii. మహన్మహతీ బహువచనము: సాధారణముగ 'ర్' అనునది యీ యర్థమున వచ్చును. గోండీభాషయందు 'ర్క-' అను రెండు బహువచన ప్రత్యయములు చేరును.

iv. మహతీతరామహత్ప్రత్యయము:—ఏకవచన బహువచనములలో నీ యర్థములందు ప్రాతిపదికములు వేఱుగ నుండుటచేఁ బ్రత్యేక ప్రత్యయముల యావశ్యకత లేదు.

యుష్మ దస్మ దాత్మార్థక సర్వనామములందు మహదమహద్వివక్ష లేకపోవుటచే నవి యేక, బహువచన భేదములను మాత్రము గలిగి

యున్నవి. వీని కేకవచనమున న-వర్ణకమును, బహువచనమున '-మ' వర్ణకము గాని, కొన్నియెడల '-ర' వర్ణకము గాని వచ్చును.

పైని వివరించిన ప్రత్యయములకు మూలములను గూర్చి విచారింపక పూర్వము ద్రావిడభాషలలోఁగల కొన్ని నామవాచకములను గూర్చి తెలుపవలసియున్నది. వీని తుదను నిర్దేశార్థక సర్వనామములు ప్రత్యయములుగాఁ జేరును. ఇవి సంస్కృతరూపములను దగ్గఱగఁ బోలియుండుటచే కాల్డువెల్లు ప్రభృతు లీ విషయమున సంస్కృతము ద్రావిడభాష ననుకరించుచున్నదని తెలిపియున్నారు.

ఇండో - ఆర్యభాషలు ద్రావిడభాషల ననుకరించిన కొన్ని విషయములను నిరూపించుచు స్టైన్‌కోనోగా రొకపట్టిక నిచ్చియున్నారు. ఈరూపములు ప్రాచీన వేదభాషయందు గానరావు గాని, సంస్కృతమునందు సర్వసాధారణముగఁ గానవచ్చుచున్నవి. అవి యేవన—i. సంబంధార్థక భూతకాల క్రియాజన్య విశేషణమునకు మతుప్ప్రత్యయము చేరినది. ఉదా. కృతవాన్, మొద. ii. ఉ. పు. కర్తాస్మి, కర్తాస్వః, కర్తాస్మః; మ. పు. కర్తాసి, కర్తాస్థః, కర్తాస్థ; ప్ర. పు. కర్తా, కర్తారౌ, కర్తారః, ఇట్టి భవిష్య దర్థక రూపములవంటి (1) తెనుఁగు: (నేను) రాజను; (మేము) రాజులము; రాజవు, రాజులరు; రాజు, రాజులు (2) తమిళము: శెయ్దవన్ మొద. (3) గోండీ: కీ ఆతోనా, కీఆతోనీ, కీఆతోర్, మొద.

సంస్కృత మీ విషయమున ద్రావిడభాషల ననుకరించుచున్నదనుట సరికాదు. ఇట్టి రూపములే అవెస్తా భాషయందును గలవు. చూడుఁడు—

| i. ధాతువు | క్రి. జ. వి. | క్రియారూపము. |
|---|---|---|
| వ్ అ ర అ జ్=పనిచేయు | వర్ స్త | వర్ స్తవత్ |
| షా=మంగళకరమగు | షాన | షానవత్. మొద. |

(కాంగా : అవెస్తా వ్యాకరణము, పు. 563)

ii. పా = రక్షించును; పాత = వాఁడు రక్షించును; పాతారో = వారు రక్షింతురు; పాతాహ్మి = నేను రక్షింతును; పాతమహి=మేము రక్షింతుము; పాతస్తో = మీరు రక్షింతురు; మొద. (కాంగా : అవెస్తా వ్యాకరణము పు. 471.) పై దానివలన నొక రూపము సంస్కృతమునందును ద్రావిడభాషలయందును నుండి, వేదభాషలో లేనంతమాత్రమున ద్రావిడమునుండి సంస్కృత మెరవు తెచ్చుకొన్న దనుట పొరపాటని తెలియఁగలదు. సంస్కృత మీరూపములను ద్రావిడభాషలతోఁబాటు వైదికేతర ఇండో - ఆర్య భాషలనుండి గ్రహించినదని చెప్పవలెను.

ద్రావిడ భాషలనుండి యిండో - ఆర్యభాష లెరవు తెచ్చుకొన్నవని స్టెన్‌కోనో ప్రభృతులు తెలుపు ప్రత్యయములను గూర్చి విచారించినచో నా ప్రత్యయము లిండో - ఆర్యభాషలయందు మొదటనుండియు నున్నవే కాని, ద్రావిడభాషలనుండి యెరవు తెచ్చుకొన్నవి కావని స్పష్టము కాఁగలదు. ఈ క్రింద ప్రథమైకవచన మహత్ప్రత్యయములు చూపఁబడినవి:—

| ద్రావిడ భాషలు. | ద్రావిడ ప్రత్యయములు | ఆర్య రూపములు | ఆర్యభాషలు. | ద్రావిడప్రథమేతర విభక్తి ప్రాతిపదికములు |
|---|---|---|---|---|
| తమిళము, మళయాళము, కన్నడము | అవన్, అవను | భరన్ | వేదము | అవనై |
| హాళగన్నడము, బడగ | అవమ్ | భరమ్ | అర్ధమాగధి | అవనమ్ |
| తెలుఁగు | వాఁడు, వాణ్డు | భరన్తో | పాలి | వాని |
| మద్రాసుగోండీ, గోండీ | ఓణ్డు, ఓర్ | భరన్తు | అపభ్రంశము | ఓన్, ఒన్ |
| కూఇ | ఏ అఞ్జు, ఓ అఞ్జు | బరస్ =బరన్స | అవెస్తా | ఏ అన్ |
| తుళు | ఆయె | ద్రావ్య =ద్రు | అవెస్తా | |

పై రూపములను బరిశీలించినచో హాళగన్నడమందలి 'అవమ్' అనునది మాగధీ, అర్ధమాగధీ ప్రాకృతములలోని 'భరమ్' ను బోలియున్నదనియు, జైన, బౌద్ధమతముల ప్రోద్బలముచే నట్టిరూపము వెలసెననియు, తమిళ మందలి 'అవన్' అనునది వైదికరూపమగు 'భరన్త్స'లోని 'త్స' లోపింపఁగా మిగిలిన 'భరన్' అను రూపమును బోలియున్నదనియు, బ్రాహ్మణమత ప్రోద్బల మీ ప్రత్యయవిషయమునఁ గానవచ్చుచున్నదనియు తెలియనగును. అట్లే, తెలుఁగు, మద్రాసుగోండీ భాషలలోని మహత్ప్రత్యయము పాలి, అపభ్రంశ భాషలయందలి 'అన్తో,' 'అన్తు'ల నుండి యేర్పడినది. కూఇ-భాష లోను 'ఞ్జు' రూపము 'ణ్డు' నకు తాలవ్యరూపమనిమైనను, లేదా, అవెస్తా భాషలోని 'బరస్' వంటి రూపముగలిగిన యొక నష్టప్రాకృతమునుండి

వచ్చినదనియైనను జెప్పవలెను. '-అన్స్' రూపము సంస్కృతములోని 'విద్వాంస్' మొదలగువానియందు గానవచ్చుచునే యున్నది.

తుళుభాషలోని ప్రథమైకవచన ప్రత్యయమగు 'ఆమె' అనునదియు నొక నష్టప్రాకృతమునుండి వచ్చినదనియైనను, లేదా, ఇందలి తుది 'ఎ' కారము మాగధిభాషనుండి కలిగిన దనియైనను చెప్పవలెను. మాగధీ ప్రాకృతమున ప్రథమైకవచన ప్రత్యయముగ 'ఏ' వచ్చును. ఈ క్రింది శ్వేతాంబరజైనుల వాక్యమును జూడుఁడు.

| | | | |
|---|---|---|---|
| | శే భగవం | మహావీరే | మహామాహానే |
| సం. | స భగవాన్ | మహావీరో | మహాబ్రాహ్మణః |
| తెనుఁగు: | ఆ భగవంతుఁడు | మహావీరుఁడు | మహాబ్రాహ్మణుఁడు |

ప్రథమైకవచనమున 'ఏ' ప్రత్యయము తుళుభాషయందును, కన్నడమునకు మాండలికభాషయగు కోతభాషయందును విస్తారముగఁ గాన్పించుచున్నది. ఈ 'ఏ' ప్రత్యయమును, హాళగన్నడ, బడగభాషలలో ప్రథమైకవచన మహత్ప్రత్యయములందలి 'మ్' అనునదియు మాగధీ ప్రాకృతమునుండి కలిగిన వనుటకు సందేహము లేదు.

గోందీభాషలో ప్రథమైకవచనమున 'ఓర్' కానవచ్చుచున్నది. ఇందలి రేఫము బహువచనబోధకమనియు, నారూపమే యేకవచనమున వాడుకలోనికి వచ్చెననియు స్టెన్‌కోనో పండితుని యభిప్రాయము. ఇది సరియైనట్లు తోఁచదు. ఈ రేఫము ప్రథమైకవచనమున మాత్రము కానవచ్చుచున్నది. తక్కిన విభక్తుల యేకవచనములందు 'ఓన్' అనునది ప్రాతిపదికమగుచున్నది. ఇట్లే, నిర్దేశార్థక సర్వనామమగు 'ఏర్,' ప్రశ్నార్థక సర్వనామమగు 'బోర్' అను గోందీరూపములందు ప్రథమైకవచనమున రేఫమును, ప్రథమేతర విభక్తులందు వానికి 'ఏన్,' 'బోన్' అనునవి ప్రాతిపదికము లగుచున్నవి. ఇట్లే, గోందీ 'తమ్ముర్' = తమ్ముఁడు అనుదానికి ప్రథమేతర విభక్త్యేకవచనమున 'తమ్మున్' అను రూపము గలుగుచున్నది. దీనినిబట్టి పై రూపములందలి రేఫము బహువచన బోధకము కాదని చెప్పవచ్చును. అది తెనుఁగునందలి 'ఁడ్'='ఞ్'='ర్' అని నిర్వచింపవచ్చును.

తెలుఁగు: 'ణ్డు' ప్రత్యయము ఇండో - ఆర్యభాషలోని 'న్తు' యొక్క వికారము.

పైని వివరించిన మహత్ప్రత్యయములలో తెనుఁగునఁగల 'ణ్డు', 'ఁడు' ప్రత్యయములు సంస్కృతమునందలి 'న్త' ప్రత్యయముతో సరిపోవుచున్నది' తమిళకన్నడములలోని దంత్య త, ద, లు తెనుఁగున మూర్ధన్య ట, డ, ళుగఁ గానవచ్చును. చూడుఁడు—

| గ్రాంథిక తమిళము | కన్నడము | తెలుఁగు. |
|---|---|---|
| కున్రు | | కొండ |
| ఒన్రు | ఒందు | ఒండు |
| ఎన్రు | | ఎండ |
| ఇన్రు | | నాఁడు = దినము |
| ఎన్రేన్ | ఎందెను | అంటిని |
| తిన్రేన్ | తిందెను | తింటిని |
| పుఱ్రు | హుత్తు | పుట్ట |
| శుఱ్రు | సుత్తు | చుట్టు |

ఈ క్రిందివానిలో తెనుఁగునఁగల-'ండ' సంస్కృతమందలి 'న్త'కు సరిపోవుచున్నది:

i. మధ్యమపురుష క్రియలలోని అండు, - ఉండు : రండు, వినుండు. - చూ. సం. ఆగచ్ఛ - అన్తు, శృణ్వ - అంతు.

ii. మానార్థక '-ఎడు' ప్రత్యయము:— ఉదా. మూతెడు, మానెడు-చూ. వైదికప్రత్యయము '-యత్': ఇ-యత్, కి-యత్, మొద.

iii. -వంటి = పోలిన = మావంటి, అటువంటి. -చూ. వైదికరూపములు: 'మావంత్' = నావంటి; 'త్వావంత్' = నీవంటి, మొద.

iv. అండ = సమీపము; సం. అంత; అంతిక; అంతేవాసిన్, మొద

v. వెరడు; సం. పర్యంత; ప్రా. పేరంత.

## ద్రావిడభాషలలో మహత్ప్రత్యయము.

ద్రావిడభాషలలో మహత్ప్రత్యయము ప్రథమైకవచనమున నొకొక్కదానిలో నొకొక్కరీతిగ నున్నట్లు కాన్పించుచున్నను, ప్రథమేతర విభక్తులందు 'న'కార మన్నిభాషలయందును దప్పక కనఁబడుచున్నది. చూ. తమిళము : అవనై ; హళెగన్నడము : అవనమ్ ; తెలుఁగు : వాని; గోండీ: ఓన్; కుఇ : ఒలన్. వీని యన్నిటికిని సరిపోవు నిండో-ఆర్య చిహ్నములు గలవు. ఈ యార్యరూపములందు 'న్త' అను సంయుక్తహల్లు కనఁబడుచున్నవి. ఇది ఇండో - జెర్మానికభాషావస్థలోనిది; కాలక్రమమున దానికి వివిధరూపభేదములు గలిగినవి. ఈ 'న్త' గల రూపములు ఇండో- ఆర్యభాషలలో (1) వర్తమాన, తద్ధర్మ, భవిష్యదర్థకములగు 'అన్త' 'స్యన్త' అనున వంతమందు గల క్రియాజన్య విశేషణములందును (2) భూతార్థమున 'వన్త' అంతమందుగల క్రియాజన్య విశేషణములు (3) మతుప్ప్రత్యయాంత శబ్దములు—వీనిలో గాననగును. ఈ శబ్దము లన్నియు బలవద్రూపము లనియు, బలహీన రూపము

లనియు రెండువిధములుగ నుండును. బలవద్రూపములు 'న' కార సహితములుగను (బలవాన్, బలవన్తౌ, బలవన్తః; బలవన్తమ్, బలవన్తౌ); బలహీనరూపములు 'న' కార రహితములుగను (బలవత్, బలవతీ, బలవంతి) నుండును. అందు పుంలింగరూపములు ప్రథమావిభక్తి మూఁడు వచనములందును, ద్వితీయావిభక్త్యేక, ద్వివచనములందును బలవంతముగ నుండును; తక్కిన విభక్తులు బలహీనములు. నపుంసక లింగమున 'న' కారము ప్రథమ, సంబోధన ప్రథమ, ద్వితీయల బహువచన రూపములందు మాత్రము బలవద్రూపములు కాననగును. ఇతర విభక్తులయందును, వచనములందును నవి బలహీనము లగును. దీని స్త్రీలింగ ప్రథమైకవచన రూపములు నపుంసకలింగ ప్రథమైకవచన రూపములకు 'ఈ' చేర్చుటవలన నేర్పడును. అప్పు డవి ఈ-కారాంత స్త్రీ లింగ శబ్దములవలె విభక్తి ప్రత్యయములను పొందును.

సంస్కృతమున పుంలింగప్రథమైకవచనమున న-కారాంతములయిన రూపములు—ద్యుతిమాన్, బలవాన్; విద్వాన్; బలీయాన్; భరన్; వృధన్; భరిష్యన్— అను రీతిగనుండును. ద్రావిడభాషలయందలి ప్రథమైకవచన న-కార మీ ఇండో-ఆర్య రూపముల పోలికను దాల్చినవని చెప్పనచ్చును.

ఈ యూహ కొక యాక్షేపణము రావచ్చును. "సంస్కృతములోని లింగము వస్తువుల జాతినిబట్టి కాక, శబ్దముల యంతముఁబట్టి యుండును; సింహ, వృక్ష, మనుష్య, దారాః, అనున వన్నియు సంస్కృతమున పుంలింగములే. కాని, యవి ద్రావిడభాషలలో కొన్ని మహద్వాచకములును గొన్ని యమహద్వాచకములు నగును. 'న్' అనునది ద్రావిడభాషలలో నిండో-ఆర్య భాషలయందు న-కారము చేరు సందర్భములం దెల్ల చేరదు. కావున, సంస్కృతములోని 'అన్' ప్రత్యయమునకును ద్రావిడభాషలలోని దానికిని నెట్టి సంబంధమును లేదు" అని యెవరైన ననవచ్చును. కాని, దీనికి సమాధానము లేకపోలేదు. తమిళమున నిప్పుడు అన్నంతశబ్దములు మహద్వాచకములుగఁ గాన్పించుచున్నవి గాని, మొదటినుండియు నవి యట్లు లేవనుటకు నిదర్శనములు గలవు. తొల్కాప్పియము (శొల్లదిగారమ్: పిఱప్పు 49)లో తొమ్మిది యమహచ్ఛబ్దములందు మాత్రము తుది న-కారము మకారముగ మాఱదని చెప్పఁబడియున్నది. నన్నూలు (121 సూత్రము) నందు తమిళభాషలోని యమహద్వాచకముల తుది మకారమునకు బదులుగ న-కారమును జేర్పవచ్చు కొన్ని శబ్దములు గలవని చెప్పఁబడినది. ఈ రెంటిని జేర్చి సమాలోచించినచోఁ దమిళమునఁ బ్రాచీనకాలమున న-కారాంతామహచ్ఛబ్దము లనేకము లుండెడివనియు, నవి యిప్పుడు మ-కారాంతములుగ మాత్ర

ననియు నూహింపవచ్చును. ప్రాచీన తమిళగ్రంథములందు న-కారాంతము లుగనుండి నేఁడు మ-కారాంతములుగ నున్న కొన్ని యమహచ్ఛబ్దములు—

పులమ్, పులన్; వళమ్, వళన్; తిఱమ్, తిఱన్; మరమ్, మరన్, అఱమ్, అఱన్; నిలమ్, నిలన్; ఇడమ్, ఇడన్; మొద.

మహతీవాచకపదములుగూడ నొకప్పుడు 'అన్'-అంతములుగ నుండెడివి. ఉదా. (1) పదుమన్ - దేవి = పద్మాదేవి (2) పెణ్ మగన్ = మగళ్ (3) అక్కన్ = అక్కా, అక్కాళ్; (4) అమ్మన్ = అమ్మై, అమ్మాళ్. గంజాము, విశాఖపట్టణము జిల్లాలలో 'అమ్మన్న, కామన్న' మొదలగునవి యాఁడువారి పేళ్లుగా వినఁబడుచున్నవి. ఇందలి 'అన్న' అనుదానికి సోదరుఁడను నర్థము కాదు. 'అన్' అంతముపై అకారముచేరుటవలన నిట్టిరూపము లేర్పడును.

కావున, తొలుత నన్నిశబ్దములును మహదమహద్వివక్షలేక న-కారాంతములుగ నుండెననియు, రానురాను సంస్కృతనపుంసకలింగశబ్దముల, ననుసరించి మహత్యేతరామహద్వాచకపదములు మకారాంతములుగను, మహద్వాచకపదములు అన్ అంతములుగను విడిపోయెననియు చెప్పవలసియున్నది.

### ద్రావిడములోని యుపవిభక్తియగు త-కారము.

తమిళమున మహద్వాచకముల ప్రథమైకవచన ప్రాతిపదికమును ప్రథమేతర విభక్త్యేకవచన ప్రాతిపదికమును నొక్కటే; కాని, అమహద్వాచకములందు ప్రథమైకవచనమునఁగల 'మ-' కారమునకు బదులుగ ప్రథమేతర విభక్త్యేక వచన ప్రాతిపదికమున 'త-' కారము చేరును. ఉదా:—

| | | ప్ర. ఏ. | ప్రథమేతరఏక. | ద్వి. ఏక |
|---|---|---|---|---|
| మహత్. | | మగన్ | మగన్ | మగనై |
| అమహత్ | ప్రాచీనము | అఱన్ | అఱన్ | అఱనై |
| | నవీనము | అరమ్ | అఱత్ | అఱత్తై |
| | ప్రాచీనము | ఇడన్ | ఇడన్ | ఇడనై |
| | నవీనము | ఇడమ్ | ఇడత్ | ఇడత్తై |

ఇందలి తకారము సంస్కృతమందలి నపుంసకలింగైకవచనరూపములగు 'భవత్,' 'భరత్' మొదలగువాని ననుసరించుచున్నది.

### ద్రావిడభాషలందు మహతీచిహ్నమగు 'ళ'- కారము.

తమిళ, మళయాళ, కన్నడములలో స్త్రీవాచక ప్రత్యయముగ 'అళ్' అనునది కాన్పించుచున్నది. క్రియారూపములందును నీప్రత్యయ మా భాష

లయందున్నది. కాని, తెనుఁగునఁ గ్రియలలో నది లోపించినది. తెనుఁగున నేకవచనమున క్రియలలో 'అది,' 'ది' అనునవియు బహువచనమున మహత్తులకువలె 'వారు,' 'రు' అనునవియుఁ జేరుచుండును. తెనుఁగునఁ గొన్ని విశేష్యములందు మాత్రము 'అలు,' 'ఆలు,' 'లు' అనునవి స్త్రీవాచక ప్రత్యయములుగ నున్నవి. ఆలు, కోడలు, చెలియలు, చెల్లెలు, మఱఁదలు, మొదలగున విట్టివి కొలఁదిగ నున్నవి. 'ఆలు' శబ్దవికారమగు 'ఆఁడు' అనునది స్త్రీవాచక విశేషణముగఁ గూడ నున్నది. కుఇ భాషలో 'కు ఆలి' అనఁగా కుఇ - స్త్రీ; కురుఖు భాషలో 'ఆలీ' అనఁగా స్త్రీ.

తెనుఁగున ఆలు, కోడలు, చెలియలు, చెల్లెలు, మఱఁదలు అనుపదములకు వరుసగా ఆండ్రు, కోడండ్రు, చెలియండ్రు, చెల్లెండ్రు, మఱఁదండ్రు, అనునవి బహువచనరూపములు. వీనిలో 'ండ్రు' అనున దెట్లు కలిగినది. 'రు' అనునది బహువచనప్రత్యయ మగుట స్పష్టము. ఇఁక 'ండ్' అనుదాని వ్యుత్పత్తియేమి? ఇది ఉపవిభక్తికాదు. కావున, దీనికిని మహద్వాచక ప్రత్యయమగు 'ండు' నకును సంబంధ ముండవలెననియు, ఇదియును సంస్కృతమందలి 'న్తి' నుండియే పుట్టియుండవలెననియు, ద్రావిడభాషలయం దొకానొకప్పుడు మహన్మహతీరూపములకు భేదము లేకుండెననియు, రానురా నిట్టి భేదము కలుగఁగా, మహన్మహతీరూపములు వేఱయ్యెననియు స్వామినాథయ్యరుగారు చెప్పినారు. ఇది నిజమైనను గావచ్చును. లేదా, 'ఱు' అను బహువచన ప్రత్యయము 'ఆల్, అల్, ల్' లపైఁ జేరఁగా 'ల-'కారము 'న' కారముగా మాఱి 'న్ట' అను సంయుక్తాక్షరమేర్పడి ద్రావిడభాషా సంప్రదాయానుసారముగ 'ండ్రు' అను నుచ్చారణము కలిగిన దనిమైనను జెప్పవచ్చును. అప్పుడు 'ల్' అనునది సంస్కృతమందలి స్త్రీశబ్దభవమగు 'ఇత్థి,' 'తి' లకు వికారములగు 'లి' 'ల్' ల నుండియే ఏర్పడి స్త్రీవాచకమయి యుండును.

## ద్రావిడస్త్రీవాచక ప్రత్యయము లగు 'ది,' 'త్తి,' మొదలయినవి.

కాల్డువెల్లు ఈ ప్రత్యయములు 'అది' అను నిర్దేశార్థక సర్వనామము నుండి కలిగిన వని చెప్పినాఁడు. కాని, యిది స్త్రీశబ్దభవమగు ప్రాకృతమందలి 'ఇత్థి' నుండి కలిగిన దనుట స్పష్టము. పాలిభాషయందు, చతురిత్థియో=నలుగురుస్త్రీలు; మనుస్సిత్థీ = మనుష్యస్త్రీ ; నాటకిత్థియో=నటకురాండ్రు; తరుణిత్థీ = తరుణస్త్రీ—మున్నగు రూపము లెన్నియో కలవు. సంస్కృతమునందలి కృతవతీ, బుద్ధిమతీ, బలవతీ, మున్నగు రూపముల ననుసరించి యైనను ద్రావిడ భాషలోని 'తి, త్తి,' అనునవి కలిగియుండవచ్చునుగాని యిది యసంభవము.

'ది'వర్ణమిట్టి 'తీ' వర్ణకాంత సంస్కృతశబ్దములనుండియైనను, ప్రాకృతము లోని 'ఇత్థి' యందలి 'త' కారమునకు సరళాదేశము కలిగియైనను నేర్పడి యుండవచ్చును. చూ. సం - భవతీ; ప్రా. భోది.

## యుష్మదస్మదాత్మార్థక సర్వనామములు.

యుష్మదస్మదాత్మార్థక సర్వనామములకు మహదమహద్వివక్షలేదు. వాని కేకబహువచనరూపములు మాత్రము గలవు. ఈ క్రింది పట్టికలు కాల్డు వెల్లు వ్యాకరణమునుండి యుద్ధృతము లయినను, అందు నవీన పరిశోధనముల వలనఁ దేలిన కొన్ని మార్పులు చేయఁబడినవి. ఈ పట్టికలలో ఉత్తమపురుష బహువచనమున అస్మదర్థకరూపము మీఁదిపంక్తిలోను, యుష్మదస్మదర్థక రూపము క్రిందిపంక్తిలోను చూపఁబడినవి. ఒకభాషలో నొకదానికి రెండు రూపములు చూపఁబడినప్పుడు మీఁదిపంక్తిలోనిది కేవల గ్రాంథికమయి, వ్యవహారభ్రష్టమయినదో, అగుచున్నదో అని తెలియవలెను.

ఈ పట్టికలలోని యీ క్రింది విషయములను గూర్చి పరిశోధక పండితు లందఱు నేకాభిప్రాయులై యున్నారు:—

(1) క్రియాపదములలోని సర్వనామబోధక ప్రత్యయము లతిప్రాచీన ములు. నేఁటి సర్వనామరూపములు ప్రాచీనరూపములనుండి చాల మార్పు చెందియున్నవి.

(2) ఉత్తమపురుష సర్వనామమునకు 'ఆన్, ఏన్, యాన్,' అను నవియు, మధ్యమపురుషసర్వనామమునకు 'ఈన్, ఈ, నీ' అనునవియుఁ బ్రాచీనరూపములు. 'ఆన్, ఏన్, యాన్, ఈన్, తాన్' అనువానిలోని తుది న-కారము ప్రత్యయము. ఈ న-కారము తొలుత నిర్దిష్టార్థక సర్వనామము లోని న-కారమే యని స్టైన్‌కోనోపండితుఁడు తెలుపుచున్నాఁడు.

(3) సాధారణముగా నీ సర్వనామములందు మ-కారము బహువచన ప్రత్యయము. మధ్యమపురుష, ఆత్మార్థకసర్వనామములం దీ మ-కారమునకు మాఱుగ రేఫము బహువచనబోధకముగ వచ్చును.

(4) యుష్మదస్మదర్థకసాధారణ బహువచనరూప మాదిద్రావిడమందు లేదనియు కోలుభాషలసంపర్కమువలన నది ద్రావిడభాషలయందు చేరిన దనియు స్టైన్‌కోనోపండితుని యభిప్రాయము.

ఈ పట్టికలం దీ క్రింది విషయములను గూడ గమనింపవచ్చును:—

(1) యుష్మదస్మదర్థక సామాన్య బహువచనములు గల ద్రావిడభాష లేడు గలవు. వీనిలో నైదు 'న'-కారముతో నారంభ మగుచున్నవి. ఈ యైదిటిలో మళయాళము, తుళు, కురుఖు, మాల్తో, అను నాలుగు భాషల యందును ఈ సామాన్యరూపములు మాత్రమే న-కారాదిగ నున్నవి. ఈ బహువచనరూపములు తరువాతికాలమున నాయా భాషలయందు చేరియుండ వచ్చును. వీనిలో న-కారమే యుత్తమపురుషములోని యితర రూపములకును వ్యాపించియుండుటయు నసంభవముకాదు.

(2) వ్యావహారిక తమిళభాషలో 'ఎనక్కు', 'ఉనక్కు', అనురూప ములు 'నేక్కు', 'నోక్కు' అనురూపములఁ బొందినవి. ఈ నకార మాదిగఁగల రూపములు తుళు, తెలుఁగు వర్గముల భాషలలో గ్రాంథికముగ వ్యవహా రమునందును రూఢములైనవి. 'ఆన్, ఏన్, ఆమ్, ఏమ్, ఈమ్' అను రూప ములే వైరీతిగ 'నా, నే, నీ, మా, మే, మీ' లుగ మాఱియుండవచ్చును. వీనిపై మరల నాయా విభక్తిప్రత్యయములు చేరినవి.

(3) ఈ సర్వనామములందలి యాదిమ న-కార మంతకు పూర్వమం దుండిన య-కారమునుండి కలిగియుండవచ్చును. చూ. సం. యువ, తమి. నమన్ సం. యుగ, తమి. నుగమ్. మొద. యకారము మళయాళమునందువలె తొలు త 'ఇ' కారముగను, ఆ ఇ-కారము న-కారముగను మాఱియుండవచ్చును.

(4) ద్రావిడభాషలయందలి నిర్దేశార్థక సర్వనామములకును, ఆత్మార్థక సర్వనామమునకును ఇండో - ఆర్యా భాషలయందును, ఐరేనియను భాషయం దును నెన్నియో సంబంధములు కానవచ్చుచున్నవి. అట్లే, యుష్మదస్మదర్థకసర్వ నామములు ద్రావిడభాషల యతిప్రాచీనావస్థయందు 'యా, 'యీ,' లుగా నుండెనని యూహించుట కవకాశమున్నది.

(5) తమిళమునందలి 'నుమ్, ఉమ్, ఉంగళ్' అనువానిలో ఉ-కారము సాధారణము. ఈ రూపములు సంస్కృతమందలి 'యుష్మ' అను రూపమునుండి కలిగియుండవచ్చును. అట్లే, గౌడభాషలలోని 'ఆమి, హామి' మొదలగు రూప ములఁ బోలిన ద్రావిడరూపములగు 'ఆము, అమ్మా, అమ్' మొదలగునవి ప్రాకృతమందలి 'అమ్హ, ఆమ్హి, అమ్హే' మొదలగు రూపములద్వారా, సంస్కృత మందలి అస్మచ్ఛబ్దముతో సంబంధము గలిగియున్నవి.

మాలిని. సురపతి సభఁ జూడం జూడ నజ్ఞారవృష్టుల్
గురిసెం గులిశధారల్ గుణ్ఠితం[1] బ్బంద్దె దిక్కు
ఞ్జర[2] మదములడంగ్గెం సర్వ్వదిక్పాలకాన్తః
కరణములు భయోద్వే[3] గంబ్బునం సఞ్చలిఞ్చ్చెన్[4]. ౭౯

వ. ఇట్టి మహోత్పాతంబ్బులు వుట్టిన సురపతి బృహస్పతిం జూచి యిది యేమి నిమిత్తంబ్బని యడిగిన దానినంత్తయు[1] నెఱుంగ్గి బృహస్పతి సురపతి కిట్లనియె. ౮౦

సీ. బ్రహ్మణ్యుండగు[1] కశ్యప బ్రహ్మవరమున వినుతకుంబుట్టిన యనఘమూర్త్తి
వాలఖిల్యులదయ వరపక్షికులమున కిన్ద్రుండై పరగిన [2]రుద్ర తేజుం
డుదధిలోనున్న యత్యుగ్ర నిషాదుల [3]నారంగ్గ మ్రింగ్గిన ఘోరవీరుం
డిభకచ్ఛపముల రో[4]హిణ శాఖతో నెత్తి కొని దివిం బఱచిన యనిలవేగి
వీంగి[5] తనతల్లి దాస్యంబ్బు నీంగంబూని తడయ కమృతంబ్బు గొనిపోవం
గడంగివచ్చెం
గామరూప సమ్పన్నుండు గామగమనుం డతండు నీకు నసాధ్యుండు శతమ
ఖుణ్డ. ౮౧

వ. అ[1]గ్గరుడని మాహాత్మ్యంబ్బు నీవును నెఱుంగ్గుదు వది యెట్లనినం దొల్లి గశ్యపప్రజాపతి పుత్త్రార్త్థియై భవ[2] త్ప్రభృతులైన దేవగణంబ్బులను వాలఖిల్యప్రముఖులైన[3] మహామునిగణమ్బులను దనకు సహాయులం[4]గాం బడసి పుత్త్రకామేష్టి సేయునాండు నీవు నీబలంబ్బునకుం ద్దగిన యిధ్మ

---

౭౯. (1) 4, 9, 11, 13, 16. కుంఠితంబొందె, 6, కుంఠితంబట్టె; 14, కుష్టితంబొంద్దె (2) 7, 24, 25, 30, 31, 33, 41, 42, 48, 54, దిక్కుంజరుల మదమడంగ్గెన్ 11, దిక్కుంజరములమదమింకెన్ 14, దిక్కుంజరముల మదమిక్కెన్, (3) 5, 6, భయోద్రేకంబ్బులన్ సంభ్రమించ్చెన్ 9, భయోద్యోగంబు 14, భయోద్వేగంబునై 34, భయోద్రేకంబ్బునన్; (4) 7, చంచలించ్చెన్; 28, 33, 47, సంభ్రమించ్చెన్; 35, సంభవించ్చెన్.

౮౦. (1) 4, 7, దాని నెరింగి 5, 6, నెరింగి బృహస్పతి యిట్లనియె. (2) 7. బృహస్పతి యిట్లనియె.

౮౧. (1) 14. బ్రాహ్మణుండగు (2) 1, 6, 7, 9, 12, 18, 24, 28, 31, 34, 35; 39, 40, 43, 45, 51, 53, 90, రుద్రతేజు. 13, 14, 17, 20, 23, యిద్ధతేజు 16. శంద్ర తేజు 19, 22, 25, 27, 29, 36, 47, 48, 50, 54, సాంద్రతేజు; 33, యింద్రతేజు, 91. చంద్రతేజు (3) 4. నారయ (4) 5. రాహిణి (5) 5. వీంక.

౮౨. (1) 18. ఆగరుడని, (2) 4, 5, 6, 8 భవత్ప్రముఖులైన, (3) 4. దేవముని; 24, 27, 29, 34, 35 వాలఖిల్యగణంబుల, (4) 6. సహాయంబ్బుగాంబడసి.

భారంబు [5]మోచికొని వడంకుచు [6] వచ్చువారి నల్పసత్త్వుల నఙ్గుష్ఠప్రమాణదేహుల ననవరతోపవాస [7] కృశీభూత శరీరుల [8] వాలఖిల్య మహామునులం జ్జూచి నగిన నమ్మునులు సిగ్గువడి [9] కడునలిగి. ౨౨

క. రణవిజయుం డనలతేజుం డ్డణిమాది గుణాఢ్యుం డుదితుండయ్యెడ [1] వీరా
గ్రణి శతమఖుకంటెను శతగుణ వీర్యుణ్డైన పుత్త్రకు [2] ణ్డజితుణ్డై. ౨౩

వ. [1] వాండు రెణ్డగు నిన్ద్రుణ్డయ్యెడ[2] మని మహావీర్యవన్తంబులైన మన్త్రంబుల [3] వేల్చుచున్నన్త నన్తయు నెఱింగి నీవు కశ్యపుపాలికిం బోయి నాకుం గ్గరుణింపవణ్డని వారిం బ్రార్థించినం [4] గశ్యపప్రజాపతి యమ్మునుల కిట్లనియె. ౨౪

ఉ. ఉణ్డు నితణ్డు పద్మజు నియోగమునం ద్రిజగంబులందు ని
న్ద్రుణ్డయి భూతరాశిం దనదోర్బలశక్తిం గడంగి కాచుచుఁ
రెణ్డవు నిన్ద్రుండైన విపరీతమగుఁ భువనప్రవృత్తి మీ [౨౫
రొణ్డువిధంబు సేయుండిది [1] కయుక్తమె బ్రహ్మనియుక్తి[2] యుండఁగఁ.

---

(5) 4. యిధ్మభారంబు శ్రమంబునం దాల్చి తెచ్చినవాండవై 5. పలాశేధ్మంబులు భరంప్పడి మోచికొని; 6. యిమ్మహాభారంబు శ్రమంబున దాల్చినవాండవై, (6) 8 మోచికొని వచ్చువారి, (7) 6. అనవరతప్రతాపవాసకృశీభూత, (8) 4. వాలఖిల్యమునులం జూచి నగిన నమ్మహామునులు సిగ్గువడి కరంబలిగి, 7, 8. వాలఖిల్యుల గణంబులం జూచి, (9) 6. కరంబలిగి.

౨౩. (1) 2. డయ్యెడి 4, 6, 16, 17, డయ్యెడు. 5 డయ్యెడ 7, 11, 12, 24, 25, 28-33, 35, 40, 43, 44, 45, 46, 47, 48, 53, 71, 78, డయ్యడ 8, 9, డయ్యడు, (2) 4. 7, ణ్డుదితుణ్డై 9. పుత్రకుడుధీరుడై.

౨౪. (1) 6. వీండు, (2) 7, 11, 12, 17, 18, 19, 20, 22-33, 35, 36, 39-48, 51, 53, 54, 67, 71, 75, 90, 91, డయ్యడమని, 9. డయ్యడుమని, 13. డయ్యెడుమని, 34. డయ్యెడు నని, (3) 4, మంత్రంబులువేల్చి సుపుత్రుంబడసి పుత్రార్థియైన కస్యపునకు...నీవంత్తయు నెరింగిన వాలఖిల్యుల పాలికింబోయి నన్నుంగరుణిప్పుండని వారిం బ్రార్థించుచున్న కస్యప ప్రజాపతి...5, 6, 7. మంత్రంబులవేల్చి సుపుత్రుంబడసి పుత్రార్థియైన కస్యపునకు నిచ్చిన నంతయు నెరింగ్గి నీవు వాలఖిల్యుల పాలికింబోయి నాకుంగరుణించుడని ప్రార్థించుచున్నం..., (4) 9, 11, 12, 17, 23, 24, 26-36, 39, 43, 45, 46, 47, 51, 67, 71, 91, బ్రార్థింపుచున్న.

౨౫. (1) 25, 28, సేయుటది, (2) నియుక్తముండఁగఁ.

వ. మీవచనం బ్బమోఘంబ్బు గావున నింక్క[1] నాకునుద్భవిల్లెడు పుత్త్రుణ్ణు వక్షికులంబ్బునకెల్ల నిన్ద్రుణ్డయ్యెడ[2] మని కశ్యపుణ్ణు వారల[3] నోడం బ్బఱచి నీయిన్ద్రత్వం బేకాధిష్ఠితంబ్బు సేసె నట్టి కశ్యపప్రజాపతి యజ్ఞ మహిమను వాలఖిల్యులతపోమహిమను వినుతకుంబ్బుట్టి విహగేన్ద్రుణ్డైన యాగరుడణ్డిప్పు[4] డమృతహరణార్థం[5] బరుగుదెంచ్చుటం జ్జేసి స్వర్గ లోకంబ్బున మహోత్పాతంబ్బులు వుట్టెనని[6] సురపతికి బృహస్పతి సెప్పిన విని యిన్ద్రుణ్డమృత రక్షకులనెల్ల రావించ్చి మీర లతిప్రయత్నంబ్బున నమృతంబ్బు రక్షించుకొని యుండ్డుణ్డని పంచ్చిన[7] వల్లెయని. ౮౬

క. వారలు బహుప్రకారాకారులు[1] వీరులు నిశాత[2] ఖడ్గాది మహా దారుణశస్త్రధరులు కృష్ణారుణ సిత[3] పీత ఘనతరాజ్గత్రాణుల్. ౮౭

క. సమకట్టి యొక్కమొగి న[1] ప్రమాదులై నిలిచి రేయుం[2] బవలును రక్షా క్షములై యమృతముచుట్టును నమేయబలు లుండ్డిరం త్తఁనతి రభసమునన్.

మ. వితతోల్కాశని పుఞ్జ మొక్కొ యనంగాఁ విస్ఫీథి[1] నుత్క్షిప్త[2] ప క్షతివాతాహతిం దూలి తూల[5] శకలాఁ కారంబ్బులై వారిద ప్రతతుల్ సాల్వడి[3] నల్గడం జ్జెదరంగాం బాఱఁ మనోవేగుండై పతగేన్ద్రుణ్డమృతాన్తికంబ్బునకుం దక్పాలుర్ భ[4] యంబ్బందఁగన్.

వ. అంత్త[1]. ౯౦

క. కల్పాన్తానలకీలా కల్పాయత[1] పక్షుం బక్షిగణవిభు శౌ[1] ర్యాన్ కల్పుంగని యమృతరక్షు లనల్పక్రోధులయి తాంకిరాచ్చిన్ కడంకన్.

౮౬. (1) 7, 31, 33, 34, 43, 44, 46, నింకక్కనయ్యెడుపుత్రుండ్డు, (2) 1. నింద్రుం డగునని, 6. నింద్రుండయ్యెడునని 7, 9, 11, 12, 16, 17, 18, 23-35, 39, 44, 46, 47, 48, 51, 67, 71, 75, 90, డయ్యెడమని, 8. డయ్యెడుమని 19, 93, 94 డయ్యెడుమని, (3) 4. వారినోడంబఱచి, 5. నోడంబరచె, (4) 4. డిప్పుడు...వచ్చుటంజేసి, (5) 5. 6, 7, బువచ్చుటంజేసి, (6) 6. వుట్టెనని బృహస్పతిసెప్పిన, (7) 5. పనిచిన; 93, 94, పంచిన వల్లెయని.

౮౭. (1) 5. ధీరులు, (2) 4, 6, నిశాత ఘనఖడ్గమహా, (3) 4, 5, 6. సితవర్ణఘన...

౮౮. (1) 4 5, 6 నప్రమత్తులై, (2) 5, 6 బగలును.

౮౯. (1) 5, విక్లంపీథి 20, విస్ఫీది, (2) 5, నిక్షిప్త, (3) 5. చాడ్పడి 7. పాల్పడి 8. బాల్పడి 13, 20, 54, చాల్పడి 14, 23-29, 35, 39, 43 చాల్బడి, (4) 4, 6, 13, దశపా లుల్ 5, దిక్పాలుల్, (5) 9, 16, దూలితూలి.

౯౦. (1) ఇది కొన్నిప్రతులలో లేదు.

౯౧. (1) 4. కల్పాతతపక్షు 6. కల్పాతతభక్షు 7, 30, 34, 46 కల్పాతత పక్షుపక్షిగణ, (2) 4. శౌర్యోద్యాతక్కల్పు.

క. తడంబడ [1] నేసియు [2] వైచియుం బొడిచియు వివిధాస్త్రశస్త్రకముల
నుద్ధతులై
కడుకొని [3] యుద్ధము నేసిరి గడిమి మెయిన్ [4] విబుధవరులు[5] ఁగరుడనితోడన్[6].

వ. గరుడణ్డును [1] నిజపక్షవిక్షిప్త రజోవృష్టి నమరవరుల దృష్టిపథంబుఁ గప్పి స్వర్గలోకంబు [2] నిరవలోకంబుఁ గాఁ జేసిన నమరేంద్రు పనుపునం బ్బవనుణ్డారజోవృష్టి [3] సెదరవీంచె [4] నంత ౧౩

మాలిని. పరశు కులిశ కుంత ఁ ప్రాస[1] బాణాసనోద్య
త్పరిఘ కణయ [2] చక్ర ఁ ప్రస్ఫురద్బాహుసేనా
పరివృతుండయి[3] తాంకెన్ ఁ [4]భౌమనుణ్ణన్మహాకి
జ్కురుండు సమరకేళీ ఁ గర్వితున్ వైనతేయున్. ౧౪

క. బలవత్ఖగేంద్ర [1] కోపానలభస్మీభూతుండై క్షణంబున వాండున్
బలమఱి క్రాంగె నుదగ్ర జ్వలనజ్వాలావలీఢ[2] ఁ శలభమపోలెన్. ౧౫

---

౧౨. (1) 4, 7. నేచియు, (2) 23. నడిచియు, (3) 8 కడకొని 11. కుదుకొని, (4) 4, 6, 17. మెయి 14, 19, 20. కడిమిమెరసి, (5) 4, 6, 17. న్నమరవరులు 14, 19, 20. యమరవరులు, (6) 1. మీాందన్.

౧౩. (1) 4, 5. విక్షేపరజోవ్రిష్టి నమరవరుల నంధులంజేసి దృష్టిపథంబు...6. నమరవరుల నంధులంజేసి దృష్టిపథంబు, (2) 4. నిరవలోకంబుజేసిన 5, 14, 16. నిరాలోకంబుగాఁ; 6. నిరావలోక, (3) 4, 9, 12. జరపవీచె; 5, ఛారవిచె 6. ఙరపవీచినంత, (4) 1. వీంచె.

౧౪. (1) 4, 6, బాణాసిశస్త్రపరిఘు... (2) 34, 44, పరిఘముసల. (3) 5, 6, డనిం దాంకెన్, (4) 1. 83, 23, 26, 31, 45, ఛావనుండన్ 4. భవ్యకుండన్ 5, 21, 24, 29, 36, 75, భౌమకుండన్ 6. 13, 20, 41, 54, భవ్యకుండన్ 11, 28, 39, 47, 50, బబ్బరుండన్ 12, భామకుండన్ 16. భావనుండన్ 18. భావనుండన్ 22, భౌమనుండన్ 53, బాధ్వహుండన్ 25. భవ్యతేజుండు తక్కిం 67, 89, భావుకుండన్ 27, 35, 38, 44, 46, 75, 91 పావకుండన్ 34, షాభరావుండన్ 43, భావకుండన్ 71, భవ్యుండుంగ్రా 30 భవ్యుడన్నహాకిం.

౧౫. (1) 6. కోపానల, (2) 7. జ్వాలావలీన, ఈ పద్యము తరువాత కొన్నిప్రతులందు "వ. మరియును" అనుమాట కనఁబడుచున్నది.

సీ. పక్షతుణ్డాగ్ర నఽఖక్షత దేహులై భోరన[1] నవర క్త ఽ ధారలొలుక
విహగేన్ద్రునకునోడి ఽ నిహతులై [2] సురవరుల్ సురరాజు మఱువు సొఽచ్చిరి
గడంగి
సాధ్యుల[3]నాయాస ఽ సాధ్యులై పాటీర పూర్వాభిముఖులయి[4]ఽగర్వ మడిగి
వసువులు రుద్రులు ఽ వసుహీన విప్రుల క్రియ దక్షిణాశ్రితు ఽ లయిరి[5]భీతి
వంద్ది యపరదిక్కుఁ ఽ బొందిరాదిత్యు లాశ్వినులు నుత్తరమున ఽ నరంబటుచి
రనల వరుణ పవన ఽ ధనదయమాసురల్ వీంక[6] దఱిగికాంద్ది ఽ [7]శీకులయిరి.

క. తలరంగ రేణుక క్ర[1]ధన ప్రలిహ[2]ప్రరుజాశ్వ [3]కృంత[4]ఽపదనఖులను [5]ఽ[6]
తుులం గులిశనిశాతనఖావలిం బక్షీన్ద్రుండు వ్రచ్చి ఽ వందఱ[7]లాడెన్. ౯౭

వ. ఇట్లు నిర్జరవరుల [1] నెల్ల నిర్జించ్చి యూర్జితుణ్డై [2] గరుడణ్డమృతస్థానం
బ్బునకరిగి పరివేష్టించి ఘోరసమీర ప్రేరితంబై్బ[3] దుర్వార శిఖా
జిహ్వాల నమ్బరంబ్బు నాస్వాదించ్చు[4]చున్న యనలంబుంగ్గని తత్క్షణంబ
సకల నదీ[5]జలంబ్బుల నెల్లం బుక్కిలించ్చుకొని వచ్చి యయ్యనలంబు
నాఱింజల్లి[6] తీక్ష్ణధారాసమన్వితంబై్బ దేవనిర్మితంబై్బ పరిభ్రమించ్చు[7]
చున్న యన్త్రచక్రంబ్బు న[8]న్తరాన్తరంబ్బున [9] సంక్షిప్తదేహుణ్డై
చొచ్చి యచ్చక్రంబ్బు క్రిన్ద్ద. ౯౮

౯౬. (1) 6, 7, 8, 14, 23-34, 36, 38-40, 43, 44, 46, 47, 53, 54, 67, 71, 75, 90, 93, 94 భోరున, (2) 4. నిహతులై యెటసారి 5. విహతులై, (3) 6. సాధుల నాయస 8, 9, 17. సాధ్యులునాయాస, (4) 6. ముఖులైరి, (5) 4, 93, 94 భీతివొంది 11. భీతినొంది, (6) 5. వీంకు 7. వీకదగిలి 11. వీకదరగి 16 వీంకదప్పి 21. వీకదక్క; 23, 27, వేక 50. 71, వీకదప్పిగాంది, (7) 6. కాంద్దిచీకులయిరి 12. గాందిశీకులయిరి.

౯౭. (1) 4, కోధన 5, 6, 7, 16, 18, 22, 24, 26-33, 38, 40-42, 44, 45, 46, 47, 49-51, 54, 71, 75, 89, కుధర 9, 25, 48, కుధన 12, కుదర 23, కుధరల్ 34, క్రోధన 35, కుందన 67, కృధన, (2) 4, ప్రలిభ 6, ప్రలహ 22, ప్రలుహ 26, ప్రలహిక్రి రుజాశ్వ, (3) 4, ప్రమథాశ్వ 12, ప్రమజాశ్వ, (4) 5, కృత్త 26, కుంత, (5) 5, పతననిమిష 6, పతనఖులను 16, పదనఖముల 22, నఖములనుం బక్షులు 26, పతనఖుల, (6) 6, 16, 24, 27, 30, 33, 34, 35, 38, 47, 51, పక్షుల 26, విపక్షుల 23, యక్షుల, (7) 5, వంద్దరులాడెన్,

౯౮. (1) 6, వరులనిర్జించి, (2) 4, యూర్జితుండైన 9, యూర్జితుండై (3) 4, ప్రేరితంబైన, (4) 6, నాస్వాదింప్పచున్న 13, నాశ్వాసించు, (5) 12, నదీనవజల, (6) 4, 12, యతితీక్ష్ణక్షిప్తధారంబయి 5, తీక్ష్ణదీప్తద్వారంబై్బన, (7) 11, పరిభ్రమింప్ప చున్న, (8) 4, నంబరాంత్తరంబున 5, క్రింద్దనంత్తరాంతరంబ్బున 12, చక్రంబు నంతరాయం బ్బున 13, 16, నంతరాళంబున; 24, నంత్తరానంత్తరంబున; 34, చక్రాంత్తరంబ్బుగని; (9) 11, సంకుచితదేహుండై.

ఉ. ఘోరవికార సన్నిహితఁ గోపముఖంబులు దీప్తవిద్యుదు
[1] ల్కారుణ దారుణాక్షములునై నిజదృష్టి విషాగ్ని నన్యులం
జేరఁగనీక యేచ్చుచుం [2] బ్రసిద్ధముగా నమృతంబు చుట్టు ర
క్షాపతి నున్న యుగ్రభుజగంబుల రెంటినిగాంచి చెచ్చెరన్. ౯౯

వ. అయ్యురగంబులం దనపక్షరజోవృష్టి [1] నన్ధంబులఁజేసి వాని శిరంబులు ద్రొక్కి పరాక్రమంబెసఁగ నమృతంబు గొని గరుడండు గగనంబున కెగసిన. ౧౦౦

క. కలహమున నిట్లు సురవీరులం బల్వురనోర్చి యక్కఖగేంద్రుండ యమృతముం[1] ద్రె
క్కలిగొని యాస్వాదింపక యలోలుండగు వానింజూచి హరియిట్లనియెన్.

క. నీ విజయోత్సాహమునకు లావునకు [1] జవంబునకు నలౌల్యమునకు స
ద్భావమునకు మెచ్చి వరం బీవచ్చితి[2] వేఁడు మెద్ది యిష్టము నీకున్. ౧౦౨

వ. అని ప్రసన్నుండై యానతిచ్చిన [1] యాదిదేవుండగు శ్రీమన్నారాయణునకు నమస్కరించి గరుడం డిట్లనియె. ౧౦౩

సీ. అమృతాశనంబు సేయకయును దేవ నాకజరామరత్వంబు [1] నందుట యును
నఖిలలోకంబుల కగ్రణి [2] వైన నీయగ్రంబునందు ని న్నధికభక్తిం
గొలుచుచు నునికియుం గోరితిం గరుణతో దయసేయు ముద్ధతదైత్యభేది
యనవుడు నారికి నభిమతంబులు ప్రీతుండై యిచ్చి హరియిట్టు లనియె నాకు
ననఘ వాహనంబవై మహాధ్వజనువై యుండుమనినం బక్షి యొసను [3] ప్రసాద
మనుచు మ్రొక్కి పలిచె [4] నంత్త నాతనిమీఁద వజ్రమెత్తివైచె వాసవుండు. ౧౦౪

---

౯౯. (1) 4, ల్కారుణసారజిహ్వాలునునై, (2) 9, యేచుచు.

౧౦౦. (1) 4, 6, నంధులం.

౧౦౧. (1) 4 మిమ్ముఁలగొని 5, 17, 23-25, 27, 29-31, 34-36, 46, 47-51, 54, 67, 91 నెక్కలింగొని 7, నెక్కలియాస్వాదింపకకొని 4, యక్కలిగొని 9, త్రక్కలిగొని 22, 26, 38, 39, 44, 45, వెక్కలిగొని 33, నిక్కలిగొని.

౧౦౨. (1) 4, జలంబునకు, (2) 6, గోరుమెద్ది.

౧౦౩. (1) 4, యానతిచ్చిన నారాయణునకు 6, యానతిచ్చిన నారాయణునకు గరుడం.

౧౦౪. (1) 5, అమరాజరత్వంబు లందుటయును; (2) 4, కగ్రణిమైన, (3) 93, 94, స్వప్రసాద, (4) 11, నంతనగ్గరుడుపై, (5) 8, పరచె.

వ. అదియును నమ్మరంబ్బున నగ్నికణంబ్బులు[1] సెదరం బ్బఱతెంచి పక్షిరాజు పక్షంబ్బులు దాంకవచ్చినం [2]జ్జూచి గరుడణ్ణు నగి నీచేయు వేదన[3] నన్నుం[4] దాంకదు నీవు మహాసమ్భవంబ్బ [6] వగుటను దేవేన్ద్రునాయుధంబ్బ వగుటను నిన్ను నవమానింప్పంగాదు[7] గావున మదీయైక పర్ణ్ణ శకల చ్ఛేదంబ్బు సేయుము నాయంద్దు[8] నీశ క్తి యింత్తియ యనిన సకలభూత సఙ్ఘంబ్బెల్ల నాతని పర్ణ్ణంబ్బుల సుస్థిరత్వంబ్బునకు మెచ్చి సుపర్ణ్ణణ్ణని పొగడిరి సురేన్ద్రుణ్డును నవ్విహగేన్ద్రు మాహాత్మ్యంబ్బునకు మెచ్చి యచ్చెరువంద్ది యిట్లనియె. ౧౦౫

ఆ. వె. నిరుపమానశౌర్య్య[1] ॥ నీతోడం [2] జెలిమి [3] సే
యంగ్గ నా [4] కభీష్ట ॥ మైనయదియు
నిట్టి విక్రమంబ్బు ॥ నిట్టి సామర్థ్యంబ్బుం
గలదె [5] యొరుల కి ॥ జ్జగంబ్బునం[6]ద్దు ౧౦౬

క. [1] అమరుండ వజరుండ వజితుండ వమేయుండవు నీకు నమృత[1] ॥ మది యేల ఖగో
త్తమ దీని నరులకిచ్చిన నమరులకును వారసాధ్య ॥ లగుదురు [3] వ్వారల్.

క. నీ [1] వరులకు నీ యమృతం బ్బీవలువదు నాకు [2] మగుడ ॥ నిచ్చిన నీ కి
ష్టావాప్తి యగు విధంబ్బెం గావించ్చెద ననిన హరికి ॥ గరుడణ్డనియెన్.

వ. ఏను మదీయమాతృదాసీత్వ నిరాసార్థం [1] బ్బమృతంబు దెచ్చియిత్తునని[2] కాద్రవేయులతో నొడివి వచ్చినవాండ నీ యమృతంబ్బుం గొనిపోయి

---

౧౦౫. (1) 6, దలరం 7, చెదరంబరచి, (2) 1, దాంకినజూచి 2, తాకుదెంచినజూచి, (3) 9, 11, 16, వేధనన్నుం, (4) 18, నాకుందాంకదు, (5) 8, సోంకదు, (6) 7, వని, యును, (7) 4, నే నవమానింపంగాదు 13, 14, 18, 25, 31, 42, 48, 53, 54, 67, 75, నవమానింపందగదు, (8) 7, నాయందు నీవుసేయు ప్రయత్నం బింతియె.

౧౦౬. (1) 6, నిరుపమానశక్తి, (2) 4, 5, నీతోడిచెలిమి, (3) 6, జేయంగ్గ, (4) 1, 4, 6, 22, నాకు బుద్ధియయ్యెబ్రీతి 5, నాకు నిష్టమయ్యె బ్రీతి; (5) 9, గలవె, (6) 4, 5, 6, లంద్దు.

౧౦౭. (1) 7, అమరుడవజేయుడవునీ, (2) 7, అమృతమేల వడసితివిఖగో, (3) 4, బోరల్ 18 వారల్.

౧౦౮. (1) 93, 94 వారులకు, (2) 93, 94 మరల.

౧౦౯. (1) 6 నిరాసార్థంబ్బరగులకు నమ్మ, (2) 4, 5, 6 కద్రువపుత్రులతో నొడివి 7, కద్రువపుత్రులకు నొడివి 12, కద్రువపుత్రులతో నొడ్డి,

వారలకిచ్చి[3] మదీయ జననీదాస్యంబు[4] వాపికొనిన నురగు లీయమృతం
బుపయోగింపకుండ[5] ముందఱ నీవు గొని చనుమనిన నగ్గరుడని మహాను
భావంబునకు మెచ్చి నీబల[6] పరాక్రమంబులు వినవలతుం జెప్పు[7] మనిన ౧౦౯
నయ్యింద్రునకు గరుడం డిట్లనియె.

క. పరనిందయు నాత్మగుణోత్కరపరికీర్తనముం[1] జేయంగా నుచితమె స
త్పురుషులకైనను నీ కచ్చెరువుగ నాకల తెఱంగుం[2] జెప్పెదం బ్రీతిన్. ౧౧౦

ఉ॥ స్థావరజంగమప్రవితతంబగు[1] భూవలయంబునెల్ల నా
లావునం బూని[2] తాల్తు నవికలఝషౌఘ పయోధిజలంబులెల్ల ర
త్నావళితోన చల్లుదు బృహన్నిజపక్ష సమీరణంబునన్
దేవగణేశ యీక్షణమ త్రిమ్మరివత్తుం ద్రివిష్టపంబులన్[3]. ౧౧౧

వ. అని చెప్పిన గరుడని జవసత్త్వసామర్థ్యంబులకు[8] మెచ్చి సంతసిల్లి[2] దేవే
నీవు నాతో[3] నెప్పుడు బద్ధసఖ్యుండవై[4] యుండవలయునని[5] వేఁడియు దేవే ౧౧౨
ంద్రుండు గరుడని కిట్లనియె.

క. నాకభిమత మొనరించితి నీ కిష్టము సెప్పికొనుమనిన దుర్మదులై
మాకిట్లహితముం జేసిన యాకద్రువ పుత్త్రులశన మయ్యెడ[2] నాకున్.

క. భవదభిరక్ష్యములగు[1] నీ భువనంబులయందు సర్పముల త్రిమ్మరుటన్
దివిజాధిప నీ కెఱుంగింపవలసె నీ యాజ్ఞ నాకుం[3] బడయంగవలసెన్.

---

నీవుగొనిచనుమనిన గరుడని...శవిను,
త్వంబు వాపికొని చనఁటిది యురగఁలుపయోగింపకుండ
మదీయరి..., వారికిచ్చి నాతల్లి దాసీత్వంబు బాసికొనిన దీనినురగు లుపయోగింపకుండ నీవు
గొని చనుమనిన గరుడని, (4) 1, 22, వాచికొనిన 11, వాచిన దీనినురగులుప, 12, బాసికొనిన
16, 18, 19, బాచికొనిన, (5) 5. బుపయోగింపకుండనీవు...; (6) పరాక్రమ విక్రమం
బులు, (7) 1, వినవలతుం జెప్పవే యనిన.

౧౧౦. (1) 5. కీర్తనయుం; (2) 11. తెరంగు సెప్పెద.

౧౧౧. (1) 5. ప్రతిహితంబగు, (2) 9. లావునజేసి, (3) 4. ద్రివిష్టపంబులున్.

౧౧౨. (1) 6. సామర్థ్యంబునకు, (2) 1. సంతోసిల్లి, (3) 6. నాతోడబద్ధ, (4)
4, ౯, యుండుమని యొడంబరిచి వేఁడియు, (5) 6. ననియొడంబరచివేండ్డియు నింద్రుండ్డు
వానికిట్లనియె.

౧౧౩. (1) 6. సెప్పుమనిన సెరిదుర్మదులై, (2) 7, 11, 12, 18, 24, 28-31,
33, 36, 41, 42, 44, 46, 47, 48, 49, 51, 53, 54, 71, 75, 89, 90, మయ్యడ 8, 22,
మయ్యడు 9, 13, 15, 16, 20, మయ్యెడు 125, మయ్యడి.

౧౧౪. (1) 5 భవదభి రక్షణమగునీ 9. భవదభి లక్ష్యములగు, (2) 34. సర్పముల
గ్రుమ్మరుటన్; (3) 4. బడయవలయుటన్. 12. బడయటవలయున్, 16. బడయగ
వలయున్.

వ. అని గరుడండు దనకు నురగభోజనత్వంబు సురపతిచేతం బ్బడసి తదనుగమ్యమానుండై యురగులయొద్దకు వచ్చి మరకతరుచి [1] భరితంబైన [2] కుశస్థలంబున నమృతకలశంబు [3] నిలిపి యురగులకుం [4] జూపి యిట్లనియె.

క. అనిమిషనాథ సుగుప్తమయిన యమృతము దెచ్చి మీకు నిచ్చితి నస్మజ్జననీ దాస్యము వాసెను దినకరపవనాగ్ని తుహిన దీప్తులు [1] గుఱిగాన్ [2].

వ. మీరలు [1] స్నానాలంకృతులరై వచ్చి దీని నుపయోగింపుండని పంచి తల్లిందనవీం వెక్కించుకొని విహగేన్ద్రుండురగుల కదృశ్యుండై యున్న సురేన్ద్రు వీడ్కొని చనియె నిట నురగులును నమృతోపయోగ కుతూహలంబున నొండొరులం [2] గడవం గృతస్నానాలఙ్కృతులై [3] చనుదెంచుటకు ముందఱ. ౧౧౭

క. అమరాధిపుం డమృతము గొని యమరావతికరిగి తొల్లిటి యట్టుల సుస్థానమున [1] నవిచలితరక్షాకుముండై రక్షించుకొని సుఖస్థితి [3] నుండెన్.

వ. అంత నయ్యురగులు [1] నమృతంబుపయోగింపం గానక దాని యున్న స్థానంబని [2] దర్భలు నాకిన నాలుకలు రెణ్డుగా [3] వ్రయ్యుటం జేసి నాంటంగోలె [4] ద్విజిహ్వులునాం బరగిరి యమృతస్థితిం జేసి [5] దర్భలు పవిత్రంబు లయ్యె. ౧౧౯

క. ఈ సౌపర్ణాఖ్యానము భాసురముగ వినిన పుణ్య పరులకు నధికశ్రీసమ్పద [1] లగు దురితనిరాసంబగుం బాయు నురగ రక్షోభయముల్.

---

౧౧౬. (1) 4, 5, రుచిర 6, 14, 18, 19, 20 22-25, 27, 28, 29, 31, 36, 39, 45, 46, మరకత భరితం 16, మరకత పరిస్తరణంబైన, (2) 4. కుశాస్తరణంబున నయ్యమృతంబు 12. కుశస్థండిలంబున 33, కుశలస్థలంబున, (3) 4, 5, డించి 6, 9, 23-29, 31, 33, 35, 36, 45, 90, నమృతంబు నిలిపి, (4) 6. యురగుల కిట్లనియె.

౧౧౬. (1) 13, దీప్తుల, 20 విప్రులు, (2) 13, గురిగాన్ 18. సరిగాన్ 19. గురిగన్ 20 యెరుగన్ 34, గురిసేన్.

౧౧౭. (1) 6. : గృతస్నానాలంకరణులై 7, 8, 23-26, 29, 30, 35, 45, 47, 49, 54, కృతస్నానులై, (2) 8. నొండొరువులుగృత 9. నొండొరుంగడవ. (3) జనుదేర నంతకముందర 5. చనుదేరనంత 12 చనుదేర నంతకు ముందర.

౧౧౮. (1) 9 సువిధానమున. (2) 5, 6, నమునందచలిత, (3) 1, 2, 3, సుఖంబున నుండెన్.

౧౧౯. (1) 6. నయ్యురగుల కయ్యమృతంబు పట్టుగానక, (2) 5, 6, స్థానంబు దర్భలు, (3) 4. రెండు వ్రయ్యలౌటం జేసి, (4) 4, 5, 6, భాములు ద్విజిహ్వులునాం బరగె, (5) 4, 5. నమృతస్పర్శం జేసి 6. నమృతస్పర్శనంబునం జేసి.

౧౨౦. (1) 4, 6, శ్రీ సంపదయగు.

# అనుబంధము II



నన్నయకాలపు కావ్యభాషకును నానాంటి వ్యావహారిక భాషకును నెంతో భేదము లేకుండెను. శాసనముల భాషవలన నీ విషయము బోధపడం గలదు. ఉదాహరణములుగ నీక్రింది శాసన ప్రయోగముల నీయవచ్చును.

I. నందంపూడి శాసనమందలి సీమలం గెలిపెడు తెనుఁగుభాగము.

(1) పూర్వ్వతః ఇయ్యూ్యరియుం బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున పల్లమున కొణ్డియగుంట సీమా.

(2) ఆగ్నేయతః ఇయ్యూ్యరియుం బిల్లెమ పెద్దపూణ్డియు నెరపులయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా.

(3) దక్షిణతః ఇయ్యూ్యరియు నెరపులయుం బొలగరుసున తాడ్లజేవ సీమా.

(4) నైరృత్యతః ఇయ్యూ్యరియు నెరపులయు ముందరమునయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా.

(5) పశ్చిమతః ఇయ్యూ్యరియు ముందరమునయు మఱకుఱితియుం బొల గరుసున ముయ్యలికుట్ర సీమా.

(6) వాయవ్యతః ఇయ్యూ్యరియు మడకుఱితియుం బిల్లెమ పెద్దపూణ్డి యుం బొలగరుసున ముయ్యలికుట్రన గొల్లజేవ సీమా.

(7) ఉత్తరతః ఇయ్యూ్యరియుం బిల్లెమ పెద్ద పూణ్డియుం బొలగరుసున [యే*]ఱువ గడ్డయ సీమా.

(8) ఐశాన్యతః ఇయ్యూ్యరియు (౦) బిల్లెమ పెద్ద పూణ్డియుం బొలగరు సున మఱ్ఱితోడి తాటియో (=యొ)ద్ద చింతయ సీమా.

II. రాజరాజు కోరుమిల్లి శాసనములోని తెనుఁగుభాగము.

(1) పూర్వ్వతః కూడకు నియ్యూ్యరికి మద్దికొలియ సీమా.

(2) అగ్నేయతః ముణ్డకొలియ సీమా.

(3) దక్షిణతః వానపల్లియు సంపుతటి యయు మామణ్డాదియు సీమేవ సీమా.

(4) నైరృత్యతః గోదావరియ సీమా.

(5) పశ్చిమతః బూరువుతోఁగ య్సీమా.

(6) వాయవ్యతః వీస్సిదియు మాసరయు సీమైవ సీమా.

(7) ఉత్తరతః మాసరపాణ్బిడ్డవమ్మా విల్మిణ్డికొలియ సీమా.

(8) ఈశానతః ఎఱ్ఱవంక్క యుత్తరమున కడలిబాది సీమా.

III. ఏడవ విజయాదిత్యుని ర్యాలి శాసనములోని తెనుఁగు భాగము
(నాయొద్ద నున్నది, ప్రచురింపలేదు.)

పూర్వ్వతః కూహాం, దక్షిణతః కడముంగ్గ, పశ్చిమతః సంప్పనియ, ఉత్తరతః కోరుమల్లి। అస్యైవక్షేత్ర సీమానః। పూర్వ్వతః మామణ్డేటి పొలమునుం గూడపొలమునుం గోరుమిల్లి పొలమునుం గూడిన ముయ్యాలి కుత్రుననుండి దక్షిణ మిఱ్చిపోయిన ముణ్డకోలియ సీమా। ఆగ్నేయతః కూడ పొలములోని కడములకోలి పడుమటి కొమ్మునుం గహాముక్కనయు మామణ్డేటి పొలమునుం గూడిన ముయ్యాలికుత్ర సీమా। దక్షిణతః మామణ్డేటి కాత్రేని వనము దక్షిణంబున ఎంగట్ట పొదల సీమా। నైరృత్యతః కుఱ్ఱులోపుగాం గల పొలమునకు సంపనియ పొలగరుస సీమా। పశ్చిమతః కోరుమిల్లి నారనవెద్దిరి చనిమొల్లి మొననుండ్డి తూర్ప్వఁంచ్చి వచ్చిన నారన పడంగవుల చీననుండి ఉత్తర మిఱ్చిపోయిన కోరుమిల్లి పొలగరుస సీమా। వాయవ్యతః కోరుమిల్లి పొలములో నుత్తర మిఱ్చిపోయిన అడ్డపుంద్రోవ దక్షిణముతలయ సీమా। ఉత్తరతః అడ్డపుంద్రోవ దక్షిణమునతలనుండి తూర్పిఁఱ్చి పోయిన కోరుమిల్లి పొలమును మామణ్డేటి పొలమునడిమి అవుఱుగడ్డలలోని పల్లమ సీమా। ఈశాన్యతః కోరుమిల్లి పొలగరుసున మామణ్డేటి పొలగరుసున నడిమి అవుఱు గడ్డలలోని పల్లముననుండి దక్షిణ మిఱ్చిపోయిన కోరుమిల్లి పొలమున మొల్లి మొన నైరృతిమూలయ సీమా.

IV. ఏడవవిజయాదిత్యుని కుఱందుయి శాసనమునుండి
(నాయొద్దనున్నది; ప్రచురింపఁ బడలేదు)

“ అస్యగ్రామసీమానః। పూర్వ్వతః వీరవిజయాదిత్యబ్రహ్మదేయః, దక్షిణతః పచ్చుఱపల్లిః। పశ్చిమతః పాడిరిపల్లిః। ఉత్తరతః దాఞారామం। అస్యైవక్షేత్రసీమానః। పూర్వ్వతః క్రుండదిపళువ తూర్పునకట్టయు వీరవిజయాదిత్య బ్రహ్మదేయమున పొలగరుసు ఢాకలోమియయు వాడపొలగ రుసునుంగూడిన ముయ్యాలికుత్రసీమా। ఆగ్నేయతః ముయ్యాలికుత్రునుండి దక్షిణమిఱ్చిపొఱిన చోదిపల్లమసీమా। దక్షిణతః వీరవిజయాదిత్య బ్రహ్మదే యమున పొలగరుసునం గ్రుందుదిపొలగరుసునం బొఱిన అవుఱుగడ్డలలోని క్రయ్యయసీమా। నైరృత్యతః కణ్డఱమను నేఱిసీమా। పశ్చిమతఃగాడవా లుంబుట్టల పడుమటి అవుఱుగడ్డలలోని క్రయ్యనుండి రాజరాజవీ ఆనివే ఱనుంగి బెద్దఢాకరేమి పొలమునుం గ్రుందుదిపొలమునం గూడిన ముయ్యాలి కుత్రసీమా। వాయవ్యతః వెద్దఢాకరేమి పుత్తవప పొలమునయుం గరణపుం

భూలమునయుం గ్రిందుదిపొలమునయు నడిమిపెద్దవ్రం_త్తయు దక్షిణమిఞ్చి వచ్చిన పొలగరుసునుం గూచియనాయకు చీఱు(మి) పడుమటి కట్టయు నిచ్చే ఱువున ఆగ్నేయమున మూలనుండి వచ్చిన ఎంగట్ట సీమా। ఉ_త్తరతః క్రిందుది పడువ ఉ_త్తరమునకట్టయు నయ్యావాడ పొలగరుసు నడిమి ఎంగట్ట సీమా। ఈశాన్యతః ఇప్పడువ కీశాన్యమునకట్టయ సీమా॥

V. చాళుక్యఅమ్మరాజు (II) మలియపూణ్డి తామ్రశాసనము.

(శక 867; క్రీ. త. 945. 6. (నెల్లూరు శాసనములు, సంపుటము I. పుట. 181.)

| గ్రామావధులు | క్షేత్రావధులు. |
|---|---|
| 1. పూర్వ్వాతః మంజునూరు | 1. పూర్వ్వాతః గొల్లవి గుంట్ట |
| 2. దక్షిణతః యినిమిలి | 2. ఆగ్నేయతః రావియపేరియచెఱువు |
| 3. పశ్చిమతః కల్వకూరు | 3. దక్షిణతః స్థాపితశిలా |
| 4. ఉ_త్తరతః ధమ్మవురము | 4. నైరుత్య స్థాపితశిలైవ |
| | 5. పశ్చిమతః పల్కపట్టికోట్టబోయు తటాకశ్చ |
| | 6. వాయవ్యతః స్థాపితశిలైవ |
| | 7. ఉ_త్తరతః దువచరువు |
| | 8. ఈశాన్యాం కలలుకురి ఏర్వకచేని సీమైవసీమా |

పై యుదాహరణములు పదునొకండవ శతాబ్దము నాఁటివ్యావహారిక భాషాస్వరూపమును. దిఙ్మాత్రముగఁ బ్రదర్శించుటకుఁ జాలును. ఈ క్రింద "దక్షిణహిందూదేశశాసనములు, నాల్గవసంపుటము నుండి యేర్పఱిచిన పదునొకండవ శతాబ్దమునాఁటి యాంధ్రభాషా విశేషములు గొన్ని చూపఁబడినవి. కుండలీకరణము చేయఁబడిన యంకెలు శకసంవత్సరములను దెలుపును:

(1) ఈక్రింది శబ్దములలో నర్ధానుస్వారములు కానవచ్చుచున్నవి: ఏంట (సం॥రమున) శక. 977; ఏణ్టి (సం॥రపు) శక 1017; కూంతుఱు (శక 977); కూంతు (987); తోఁట (1009); నేంణ్టి (986); నెణ్టి (995); మూణ్టి (1014); ప్రాంకులు (1009); ఆణ్డువాణ్డ్రు (1006); పోంకలు (1006); బోణ్డు = గొల్ల (969); మూణ్డు (986); మీాన్ది (960).

(2) ఈ క్రిందిపదములందు శకటరేఫము గాన్పించుచున్నది :—కూంతుఱు (977); ఎఱియమ (1014), గొఱియలు (960) చెఱువు (1006); ఎఱిదుయ (1022).

(3) ఈ క్రింది కొలతలపేళ్లు దెలియవచ్చుచున్నవి :—
అడ్డమన (అర్ధమాన) 960; అరసోల (1006); ఇరువుసనడ్డొండు (1006) = 2½ కుంచములు; కుంచ్చము (1006); బహు. కుంచ్చాలు (960); ఖ (ఇది

ఖండము లేక ఖండికకు సంజ్ఞ కాఁబోలు; ఇదిపుట్టికి సమానమేమో); తూం (ఇది తూమునకు సంజ్ఞయేమో) 1004; త్రిభువనాంకుశమున (నేమాన)-ఇదియొక ప్రమాణమునకుఁబేరు, 986, 990 (2), 977, 995, 1022; పల 1006 (ఇది పలమునకు గుఱుతుకావచ్చును); పుట్టి (1006); బహు. పుట్లు (1022); పుతి 960 (ఇది యేమానమో తెలియదు. శ. ర. లో పురి=ధాన్యముపోసియుంచుటకు గడ్డితోఁకట్టినకూటు; కూటు=గరిసె, అని యున్నది.); మ 960 (ఇది మానకు సంజ్ఞయేమో); మన (ఇది మానకు రూపాంతరమా? 986); మాన 960, 990, 995, 1003, (2); ముత్తుమ (1009), ముమ్మడిభీమ కుంచ్చము (1006); మె (ఇది దేనికి సంజ్ఞయో తెలియదు; దూరమును కొలుచు నొకమానము).

(4) ఈ క్రింది గ్రామనామములును దేశనామములును దెలియ వచ్చుచున్నవి:—

కూవనూరి వేసూరడయా వేలాగిరి (1028); గంగ్గగొణ్డి చోడవలనాండు (1022); గంజాట్ట పంచనదిముడి (1027); గుద్దవాదినాండు (1022, 1006); గొల్లపల్లు (1009); చోడమణ్డలము (1027); డాకరేమి (960); తిరిముడ పడ రయి నచ్చె (1022), తిరువింజలూరునాండు (1027); నిత్య వినోదవలనాండు (1028); పెద్దడాకరేమి (1006, 1022); ప్రోలునాణ్డు (1006); పెద్దమున్నూఱు (మున్నూరు గ్రామముల యొక సమూహము) 1006; వెన్నకోటము (1028); వెలువలిపలి (ఇది 'పలివెల' యేమో) 1004; విశఖవట్టనము (990); శంక టూరు (ప్రోలునాంటిలోనిది 1006);

(5) ఈ క్రింది శబ్దములు కనఁబడుచున్నవి:

అక్కిపోరి = ? (శ. ర. పోఱఁడు = బాలుఁడు, పడుచువాఁడు) 960; అఖండ్డవర్త్తి (990); అట్లు = ఆ విధము (987); అడపు = ఆజ్ఞ? (1003, 1017, 1022); అనుంగు = స్నేహితుఁడు (1006); అమరన్ (987); అయిన (* అగు) 987; అయ్యపొలము = ఒక పొలముపేరు (1009); అరదివ్య=నగము దీపము (1003); అఱు (నెలలు) = ఆఱు (960); అవ (చూ. శోలవ) = అవ్వ (1014); అసము = యశము (987); ఆకాశ క్షేత్రపలు = క్షేత్రపాలురు? (960); ఆకాస క్షేత్రపాలినికి (960); ఆంకులు = తమలపాకులు (1006); ఆచంద్రార్క్కతారము (990, 995, 1009); ఆణ్డువాణ్డుని (1006); ఆన = ఆజ్ఞ (1022); ఆవ్వారు (960, 969); ఆసారి ( = ఱాళ్లుచెక్కువాఁడు) 995; ఇంద్దుల = ఈ స్థలములోని (1006); ఇనుప ఎడ్లు (986, 1004); ఇనుపఎడ్లు (1017) = గేఁదెలు? ; ఇరువున = శర. ఇరుస, = రెండు.కుంచములు (1006); ఉత్తరాయన సంక్రాన్తి (1003, 1006); ఉప్పు (1006); ఎంగ్గిడ్లు = ఎంగిళ్లు (1006); ఎత్తు (చూ. ఎంగ్గిళ్లెత్తు) 1006; ఎరుపు = పచ్చటనైనను (987);

ఎడ్లు = పశువులు; ఆవులు (969, 990, 995, 1006, 1014, 1022); ఎనవెం బ్రలు = ? ఎన + వెన్ను + ప్రాలు = మంచి యెన్నులనుండి రాల్చిన ధాన్యమును దంపిన బియ్యము ? ; ఏంట = సం॥రమున (977); ౫ంది = ఏంబది (1006); ఐన (చూ. పది యెన్మిదిగా నైన) 1006; ఒక్కణ్టీ = ఒకటి (ప్రథమైకవచనము), 995; ఒక్కణ్టికి (977); ౧ కిన్ (1006); ఓయంగల = పోయంగల (1014); కట్టున = స్తంభముపై (960); కన్యసంక్రాంతి (986); కమల నేత్రి (987), కట్టుపనివానికి (1006); కల = ఉన్న, చూ. దేవభణ్డారమునంగల (1006); కాన్ = చొప్పున (అడ్డెణ్డుగాన్) 1006; పనియెన్మిదిగానైన (1006); కాంత్తలు (987); కిలరము=పశువులదొడ్డి (986, 990, 995, 1003); కిలారము (977), కిలరుము (1006); కుడువన్ (* కుడుచు) 1006; కుడ్వంగల (1006), కూంతు (987); కూంతుఱు (1006); కూంత్తుఱు (1004), కృష్ణపక్షమున (1004); కొడుకు (990, 1017); కొడ్కు (1003); కొణ్డణ్డు = తీసికొన్న వాఁడు, చూ. గంజాట్ట పంచనదిముడి గొణ్డణు (1027); కోమటి (990); కోమట్ల (వసమునా) 960; కోమట్లు (960); గంగ్గ (987); గుడి=దేవాలయము (960); గొజియలు (960); చి(ఇది చిన్నమునకు సంజ్ఞయేమో (1006); (చిడు)ంగల నూనియ=చిఱునువ్వల నూనె? చెల్లంగలనూనె? శ. ర. చిడుఁగు= అల్పము (1006); చెఱువు (1006); జగదేకసుందరి (987); జీవిత చిన్నములు (1006); జీవితమాటి (1006); డంగ్గుంబ్రాలు = దంచి, తౌడుతీసి, మెఱుఁగు పోటువేసిన బియ్యము (1006); డంచ్చి = దంచి (* డంచు) 1006; తనకున్ (987); తులామాసమున (990); తొల్లి = పూర్వము (987); తోణ్ట (1009); తోణ్టపట్టు (1009) = తోఁటయున్న నేల; తోఁటనేల (1009), త్రయోదశి (990); త్రోవ (1009); దక్షు(క్షి?)ణమున (1006); దక్షిణాయన (నిమిత్తమున) 969; దగుంప్రల = దంగ్గుంబ్రాల (960); దణ్డువివియ (1004); దివసపడి (960, 990), (దివియ) 960, 990, 995, 1003); దీనికిన్ (995); దేవని (* దేవండు), చూ. బెజయితదేవని కూంతు, 987; దేవభణ్డారము (1006), నచ్చె=ఒక గ్రామము (1022); నంజుడ్లు=నంచుకొనునవి; మాంసముకాదు (1006); నంబి= పూజారి (1022); ౪ం ది= నలువది (1006); నల్వుర వసమునా (995); నల్వురు (1004, 1022); నవి(య) = పల్లము (1009); నటపంగ్గలవారు (1006) నాణ్టి (* నాణ్డు = దేశము) 1006; నాలవు = నాలవ (1022); నాలువువుట్లు (1022); నాలువురు (1003); నిమిత్తమున (986, 995, 969, 1003); నిమిత్యమున (1003); నిత్యపడి (977, 1003); నివేద్యము (960); నీడ్లు = నీళ్లు (1006); నురువు = నురుగు (987); నూనియ (1006); నెయి (969, 986, 990, 995, 1003, 1004), నెయు (1023); నెలలు (ఆఱునెలలు) 960; నే = నేయి (ఇది

విశేషణమా?) 960; నే = నేయి (960); నేతి (షౌప) 960, నే మాన = నేతిమాన (990, 995), నేణ్టి (* నేణ్డు = ఈ దినము) 995; నేల = క్షేత్రము (1022); నేల (చూ. తోంట నేల) 1009; పట్టు )చూ. ఇల్లు వట్టు = ఇల్లు కట్టుటకుఁ జాలినంత స్థలము (1004); పట్టు (ముత్తుమువడ్లపట్టు)= ముత్తుము వడ్లు విత్తుటకుఁ (జాలినంత పొలము) 1009; పట్టు, చూ. తోంట పట్టు = తోఁట వేయుటకుఁ జాలినంత స్థలము, 1009; పడి (దివసపడి, 986, 990, 995; నిత్యపడి 977) పదియెన్మిది (1006); పప్పు (960, 1006); పరు వడి = ఎక్కువగా 987, పర్య్యఁంతం=మధ్యభాగమున, అవధిగాఁగల (1022); పల్లు = పల్లె, చూ. గొల్లపల్లు (1009); పాలినికి = పాలునికి, చూ. క్షేత్ర పాలినికి (960); పాలు = భాగము (1022); పిరిదేవర (కిలరుమున) = పెద్ద దేవుని కిలారమున (1006); పుట్టము (వెల్లపుట్టము) 960; పుట్లు. బహు. 1006; పురుడించ్చునట్లు (987); పూఁట (1003), పూంట (1004); పూణ్ట (1022) = జామీను; పెణ్డేము = పెండ్లాము (995); పెండ్లాము (1003); పెడరు = పెరడు (శ. ర. పెడలు = పెరడు, కన్న. తెవెడ=వెనుక భాగము) 1004; పెట్టంగ్గల (అంకులు) = ఇవ్వవలసిన, 1006; పెట్టించ్చిన సత్రము 1006; పెట్టిన = స్థాపించిన (990); పెట్టిన = ఉంచిన990, 1003; పేర = నామమున (1006);పోంకలు (1006); పోల్= పోలునట్టి (987); ప్రల=ప్రాల=బియ్యము యొక్క (960); పొరసిన = కలసిన, మొత్తమైన (977, 986, 990, 995, 1003); బెల్ల = బెల్లము (ఆనాఁడు బెల్లమును కుంచములతోఁ గొలుచు చుం డిరి) 1006; బోణ్డు = గొల్ల (969); బోయిని (1003); బోయణ్డు (969); బోయుతోడి (960); బోయుని (1004); బోల (వసమున 960, 990, 1003); బోలు, (ఏక.బోండు) 995, 1003; బ్రాహ్మనికి 1006; బ్రాహ్మలు, బ్రాహ్మ లకు 1006; భీమేశ్వర మహాదేవర (969); భీమేశ్వర వల్లభునకు, 987; భూమి దేవి 987; మణ్డతోన్ = కుండతో (987); మహాదేవి (1004); మాఱ (1006); మానెణ్డు (969); మిరియముల అరసోల (1006); మ్రూణ్డగు (986); మిన్ది (960); ముడి - చూ. పంచనది ముడి = కూడలి 1027; 300 టి = మున్నూటి 1006; ముప్పదివుట్లు (1006); మొదవులు (1003); మ్రాంకులు (1009); రట్టడికము (1022); రాయణ్డు (1022); రెణ్డు (960); లికి (ఖ) తము (995); లోవుగా = లోపల (1004); లోవైన = కూడిన (చూ. నావియ బాదియ కొమ్మనయబోయణ్డును లోవైన యావ్వఁరు బోలవసమున) 969; లోహ దణ్డు దివియ (1004); లోహదివి (1014); లోహదివియ (986); లోహపు దివియ (1003); వట్ల = భట్ల, చూ. సిడమవట్ల తోణ్ట (1009); వడ్లు (1006); వణ్డెడి (1006); వసమున (960, 990, 995, 1003, 1022); వసుమున (986);

వాణ్డురి, చూ. అణ్డువాణ్డురి (1006); విడ్చు = ఉంచు (1028); విడిచిన = ఉంచిన (1022); విత్తుపట్టు (1006); వినివారి = ఆకాశగంగ (987); వెల్ల పుట్టము (960); వేయి (మ్రాంకులు) 1009; శత్రము = సత్రము (1006, 1009); శాక వర్షంబ్బులు (990); శ్రాహి = నడచుచున్న సం॥ రము (1003, 1004); సక్కు = పిండి? పేలపిండి? 1006; సంధ్య దివియలు (960); సన్నిధానమునన్ (1006); సన్మణియుతముగన్ (987); సరసిజాస్య (987); సరించువారు (960); సరింపంగల వారుంగా (1003); సరింప్పంగలవరు (960) = ఇచ్చు; సరియ = సమానమే 987; సరియించువారు (960); సరియిచ్చువారు (995); సరియించ్చువారు (986, 1003); సరియింప్పన్ (960); సరియింప్పం గలవారుగా (1004); సర్వ్వాకర పరిహారముగా (1006); సితమణి బన్ధము (987); సెట్టి, చూ. మేడయసెట్టి; చేసి = చొప్పున, చూ. మానెణ్డు సేసి (969).

(6) ఈ క్రింది మనుష్యులపేళ్లు తెలియవచ్చుచున్నవి: అప్పయ (1009); అయ్తిబోలె ఎఱియడు (1022); ఎఱియడు (1022); ఎఱియమ (1014); కనియ (1006); కన్నియ (1014); కన్మియ (1003); కర్తిరాజు (995); కాటబోల కొమ్మియ (1014); కాటియ (977, 995; 986, 1006); కాటిబోల నావియ (1022); కుపఘు (9777); కులోత్తుంగ్గచోడ (1009); కుసి బోల నానయ (1027); కోటనంబి సిడమువట్లు (1009); కోనముమ్మడిరాజు (1004); కొమ్మకవ తల్లియ (995); కొమ్మబోల కన్నియ (1014); కొమ్మ బోల పెద్దియ (990); కొమ్మబోల కన్నియ (1003); కొమ్మబోల కాటియ (995); కొమ్మయ (969); కొమ్మియ (1014, 1003, 1006, 986); గుడిసాని (1017); చందన (1014); చామబోయు వెంట్టియ (977); చామబోల చం దన (1014); చామబోల నావయ (1004); చామబోల వెంట్టియ (995); చామియబోయు చందియ (1006); చామియబోయు (960); చామియబోయు వంట్టియ (990); చామియబోయు వెంట్టియ (986); చాలుక్య విక్రమ (1003, 1004); చెల్వాయ (960); చోడసెట్టి (969); జయమ (1006); తికలింగా గాధిపతి 1003; తిరుచుట్టంబల ముడయాను శోలవ (1014), తలరాసి నవియ (1017); తలరాసి నావయ (1027); తల్లియ (990, 995); త్రైలోక్య మల్ల దేవర (977); దేవాంను వామయ (1003); దొడ్డన (995); దొడ్డయ (986); దొడ్డియ (990); నవబోల పోలియ (1003); నవియ పోలణ్డు (1003); నవి యబోయు, విణ. (1017); నారాయణ భట్లు (977); నావని. విణ. 1004; నావబోల భీమయ (977); నావయ (1027); నావియ (969, 986, 1022); నూంకయ (1027); పద్మావతి (1003); పరాంతక పరందీవరాయణ్డు (1022);

పరెకాస్యు (తోటనేల) 1009; పాపయ (990), పెడమ రాజపరాజ (మహాదేవి) 1004; పెద్దనాచార్య్యేణ (1003, 969, 987, 990, 986); పెద్దిబోల నావయ (1027); పెద్దియ (990); పెమ్మార్మ నడిగలు (1022); పోతియ (1006, 1003, 1014); పోలిబోల నావయ (1027); పోలియ (1003); బదియబోయు దొడ్డియ (990); బల్ల అప్పయ (1009); బాదబోయు (977, 1027); బాదబోల (995, 1003, 1014); భాదియ (969, 986, 1006); బెజయితదేవని (987); బేతనాచార్య్య (977); బేతినాయకు (1006); బ్రమన (1017); భీమియ (977, 986); భీమీశ్వర దేవర, భీమీస్వరా మహాదేవర (960); మాదియ (1003); మారపాసారి (995); మునియన (1027); మెందియ (1014); మేడియ (990); యమినీశ్వర మహాదేవర (1006); యమేశ్వర మహాదేవర (1003); రాకుదిరి కర్త్తిరాజు (995); రాజకేసరి వర్మ్మ (1022); రాజరాజ దేవర (1003); రాజరాజ మనిత్తరియణ్డు (1028); రాజేంద్ర ... వర్మచక్రవర్త్తి (1003); రాయన (1009); రుద్రయ (1003) రేకమ (995); రేవలదేవి (987); లక్ష్మిదేవి (1004); వంటియ (990); వత్సరాయణ్డు (1027), వలణాంటి వేణాట్టు కరువలి (1022); విష్ణువర్ధన విన్నగనాడ్వాని (గుడిసాని) 1017; వెంట్టియ (977, 995); శ్రీభీమేశ్వర మహాదేవర (990, 995, 1003); శ్రీవిష్ణువర్ద్ధన మహారాజులైన శ్రీరాజరాజ దేవర (969); శ్రీవిష్ణువర్ధన భూవిభు (987); సప్తమ విష్ణువర్ధనుణ్డు (1022); సర్వ్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల (986, 990, 995, 1003); సీలమదేవి (1009); సోమలదేవి (987).

ఈ క్రింది పౌరుషనామములు దెలియవచ్చుచున్నవి :—

ఆణ్డి (1028); దడిపట్టలక (960); పడిహారి (1003); ప్రధాని (977, 1003); మొదలి (1003); సమరమొదలి (1006); స్థానపతులు (986); ముదిసెలి (986).

## (8) వ్యాకరణ విషయములు.

(i) షష్ఠీవిభక్తి రూపములు :

చామియబోయు వెంట్టియ (986); బేతినాయకు కూంతురు (1006); చామియబోయువంటియ (990).

నావని (1004, 1027); ఎఱియని (1022); బోల (969, 1003); డంగ్గుంబ్రాల (కుంచము) 1006.

భూవిభు(దయ) 987.

చక్రవర్త్తి పెండ్లాము (1003); కర్త్తిరాజు పెణ్ణెము (995); కులోత్తుంగ చోడదేవర అనుంగు (1006); రాజరాజ దేవరప్రధాని (1003); నారాయణభట్లు కుంత్తుఱు (977); ఆ రుద్రదేవర ముదిసెలి (986); సెట్టి కొడుకు (990); దేవరప్రధాని (972).

తన (ఌచ్చిన) 969; నేమాన (977, 1003, 1022); నే (మన) 986; నే (కుంచ్చము) 1006.

ఎన పెంబ్రలకుం కుంచ్చ (1006).

(ii) సమాసములు :

త్రిభువనాంకుశ నేమాన (995); లోహదివియ (990); దివసపడి (990, 995); సంవత్సర జీవితమాటు (1006); నమర మొదలి (1006).

నచ్చెనంబి (1022); చెఱువు దక్షిణమున (1006).

ఒకపుట్టి ముత్తుము ( = ఒకపుట్టియు నొకముత్తును) 1009.

మిరియముల అరసోల (1006).

త్రిభువనాంకుశమున నేమాన (986, 990); దక్షిణమున మధ్యమున (1009); విశఖపట్టనమున కోమటి (960); కిలరమున చామబోల వెంట్టియ (995).

అఖండ్డవర్త్తి లోహపు దివియ (1003); లోహపు ధూపారదివియ (995).

(iii) సంధులు : తెచ్చు + అణ్డువాణ్డుౠ = తెచ్చునాణ్డువాణ్డుౠ (1006)
బోయు + అడపున = బోయునడపున (1017)
ఈ + మార్గ్గమున = ఇమ్మార్గ్గమున (1006)
కుంచ్చమునన్+ఇరువున=కుంచ్చమున నిరువున (1006)
కరువలి + ఆన = కరువలియాన (1022).

(* లోపుగా + ఇల్లువట్టు = లోపుగా యిల్లువట్టు (1009).

(iv) నామ విభక్తులు : దీనికిన్ (990); ఇరువంద్రకున్ (1006); ఇద్దఱకున్ (1006), అయ్యపొలమున = అందు (1009); పుర్గోహితునికి (1006); ఆచంద్రార్క్కర్మునకు (నిచ్చిరి) (1009); ఇందుల (1006).

(v) అవధారణము : మానన (1003); వారియంద (1022); దొడ్డియయ కొటియయ (977); తొ్రవయ (1009); నవియ (1009); వీనిక (1004).

(vi) ప్రశ్నార్థకము : సరియ? = సరియే? (987).

(vii) అక్షరలోపము, పూర్వాచ్చునకు దీర్ఘము :

వసమునా = వసమునన్ (995); కుంచ్చాలు (1006).

(viii) బహువచనములు :

వడ్లు (1009); ఇరువణ్ణు (1006); బోలు (1003), నంజుడ్లు (1006); సీడ్లు (1006); ఎంగ్గిడ్లు (1006).

(ix) ఔపవిభక్తికములు :

నాంటి (1022); నాణ్టి (1006); మున్నూటి (1006); ఏణ్టి (1017); నేంటి (986); నేణ్టి (995); ఏడింటన్ (1006); మూణ్టి, 193ణ్టి (1014); ఊరి (1006, 1009), రెణ్టి (960); ఒకంటికి (1006); నేతి (1006).

(x) ఆదేశములు : (అ) ద్రుతమునై :

భీమేశ్వర మహాదేవరకుంబెట్టిన (1003); ఏంబదిం బదిమెన్మిది (1006); మ్రాంకులతోడంగూడన్ (1009); వడ్లుంబ్రాలును (1006), దొడ్డనయుం గొమ్మకవ (995); వెంటియయుం గామబోల (995); దేవరకుం జక్రవర్తి (977); ఇచ్చెందనకు (987) త్రిభువనాంకుశమునం బోయంగల (977); గంగ్గ నాం బరువడి (987); దేవరకుంబెట్టిన (990, 1003), వసమునంబెట్టిన (990, 1003); వినివారిం బురుడించ్చునట్లు (987); భూమిదేవింబోల్ (987); భీమ యయుం గొమ్మబోల (977); ఒక్కంటికిం గిలారమున (977); పోల్పం గాం త్తలు (987); సరియిచ్చువారుగానుం గిలరమున (995); * వెంబ్రలకుం కుంచ్చ 1006, వసమునవెట్టిన 960,—వీనిలో నాదేశము కనంబడదు. దేవ రకుబెట్టిన,—ఒకటి బోయంగలవణ్డు (1003). (ఇచట నాదేశము వచ్చినను ననుస్వారము కనంబడదు.)

(ఆ) గసడదవాదేశము :

నిత్యపడివెట్టంగల (1006); అసమువెరుగన్ (987); బెరసినవారు వంప్ప (1014); దివసపడి వ్రోయంగల (986, 990); ఎనుబదివ్రోంకలు (1006); ముప్పదివుట్లు (1006); మానెణ్డునేసి (969); మత్తేభగమనదొల్లి (987); నీడ్లు దెచ్చు నాణ్డువాణ్డు (1006).

* (1) రుద్రయువెట్టిన (ఇచట నాదేశము రాలేదు); (2) చామబోయు వెంట్టియ (977, 986); చామబోలవెంట్టియ (995); చామియబోయువంట్టియ (990)—వీనిలో 'వెంట్టియ, పంట్టియ' యనునవి శబ్దము లయినయెడల నాదేశము తప్పు. 'వెంట్టియ, వంట్టియ' యనునవే సరియైన రూపములు గావచ్చును. (3) త్రిభువనాంకుశమున వ్రోయంగల (1017); కట్టునవెట్టియు,- (ఇచట నాదేశము రాకూడదు; అయినను కనంబడుచున్నది.)

(xi) వాక్యరచన :

దక్షిణమున మధ్యమున అప్పయతో᳒ట్ట పట్టును రాయనతో᳒ట్ట నవియు నుం జన కోటనంబి సిడమువట్ల తో᳒ట్టనవియ (1009).

(xii) క్రియలు : (1) క్రియావిశేషణములు :

వణ్డైషి (బ్రాహ్మనికి) 1006; అఏ = అయే, 1022, నాలవు (పాలు) 1022; (నంబి)మైన (1022); వెట్టిన (995); అయ్ని = అయిన (1003); కనిన (987); ఇచ్చి(న) 1006; 969; పోయంగల (977, 986; 990); పోయంగ్గల (1006); ఓయంగల (1014); వెట్టంగ్గల (1006); చిడుంగ్గల? (1006); కుడ్వంగల (1006); సరింప్పంగల (1003).

(2) తుమున్నర్థకములు : కా(న్) (1003); పోల్వన్ (987); పంపన్ (1014); నాన్ (987).

(3) సంపూర్ణక్రియలు: ఇచ్చె(న్) 987; ఇచ్చిరి (1022); సరియించు వరు (960); పోయంగలవణ్డు (1003); సరింప్పంగలవరు (990); పోయంగలవారు (1003); సరియింప్పంగలవారు (990); నటపంగ్గలవారు (1006).

---

# అనుబంధము. III

## ఆన్ధ్రశబ్ద చింతామణి

### హృదయము.



ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టవిరచితమా కాదా యను విషయమున భిన్నాభిప్రాయములు గలవు. వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రమును వ్రాయువఱకును పండితసంప్రదాయమున నన్నయయే చింతామణికర్త యని విశ్వసింపఁబడుచుండెను. కాని, వీరేశలింగముపంతులుగారు I. కేతన తనకుఁబూర్వ మాంధ్రవ్యాకరణములు లేవని చెప్పియుండుట; II. ఆంధ్రశబ్ద చింతామణినిగూర్చి యప్పకవి కూర్చిన కట్టుకథ, III. చింతామణి సూత్రములకును నన్నయప్రయోగములకును గల విరోధము, అను మొదలగు కారణములచేఁ జింతామణి నన్నయరచియించినది కాదని వ్రాసిరి. ఈ వ్రాత పండితుల విమర్శకు గుఱియైనది. మొదటనుండియు నన్నయకుండిన శబ్దానుశాసన బిరుదమిప్పుడు పోవునను భీతి పండితుల కావహించినది. కావున చింతామణి కర్తృత్వము నాతనికి నిలుప వా రనేక ప్రయత్నములఁ జేయుచున్నారు.

చింతామణి కర్తృత్వ విషయమున నీ క్రిందివిశేషములను గమనింపవలసియుండును:

(1) బాలసరస్వతికిఁ బూర్వమం దాంధ్రశబ్దచింతామణియునికిని గూర్చి మనమూహింపవలసినదే కాని, మఱియొకరీతి ప్రమాణము కానరాదు. బాలసరస్వతియే యాంధ్రశబ్దచింతామణిని రచించెనని చెప్పు వాదమునకును నాధారములేదు. అతఁ డథర్వణుని కారికల నుదాహరించుటచేత నా గ్రంథమాతనికిఁ బూర్వమున నుండెననియే చెప్పవలెను.

(2) అథర్వణుని కారికావళి యాంధ్రశబ్దచింతామణికి వివరణమునకును సవరణమునకును నేర్పడిన గ్రంథమనుటకు సందేహములేదు. కావునఁ జింతామణి కారికావళికిఁ బూర్వమందే యుండెననుటకు సందేహములేదు.

(3) కేతన కాంధ్రశబ్దచింతామణినిగూర్చి తెలియదనుట స్పష్టము. భారత శేషము నారంభించి పూర్తిచేసిన తిక్కనకు శిష్యుఁడగు కేతనకు భారత కవియగు నన్నయభట్టే యాంధ్రశబ్దచింతామణిని రచించియుండినచో దానిని గూర్చి తెలియకున్న వింతయే యగును.

(4) కారికావళి చింతామణికి వివరణ గ్రంథమయినను నధర్వణుని కాలము మనకు నిశ్చయముగాఁ దెలియదు. లిపినిగూర్చి తెలుపు కారికలవలన నాతని కాలమును నిర్ణయింప నెంచుట సాహసము. కావున నాంధ్రశబ్ద చింతామణికాలముఁగూర్చి చెప్పవలసినప్పు డది కారికావళికంటెఁ బూర్వపు దనియు, కారికావళి బాలసరస్వతి వ్యాఖ్యకంటెఁ బూర్వపుదనియు మాత్రము చెప్పవలెను.

(5) వీరేశలింగము పంతులుగారు నన్నయభారత ప్రయోగములకు విరుద్ధములని యుదాహరించిన సూత్రము లట్టి విరోధము గలవి కావు. ఆ సూత్రముల కుదాహరణములు నన్నయరచిత భారతభాగమునఁ గాన్పించు చున్నవి. కాని, నన్నయభారతమునందలి యనేక ప్రయోగములకుఁ జింతామణియందుగతి లేదనియు, సూత్రములవలన నిష్పన్నములగు ననేకరూపములు నన్నయభారతమునఁగాని యాతని కాలపు శాసనములందుగాని కానరావని యు గ్రహింపవలసియుండును.

(6) కొండ అనునట్లు చింతామణి తత్సమరూపసాధనప్రక్రియయే ప్రధానముగఁగల గ్రంథముకాదు. కేవలముఁ దత్సమరూపములనే సాధించు నట్లు కానవచ్చుసూత్రములు చింతామణియందు కొలఁదిగమాత్ర మున్నవి.

(7) ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతము కాదన్న నాతనికీర్తి గౌరవములకు హాని కలుగునంతటి ముఖ్యగ్రంథము కాదు. అది సమగ్రగ్రంథ ముకాదు. దానియందలి పరిభాషయందును, సూత్రరచనయందును, భాష యందును ననేకములగు లోపములున్నవి.

(8) చింతామణివలన తత్సమాచ్ఛికాంధ్రభాషయందు సందేహము లేకుండ నొక్క రూపముకూడ నేర్పడఁజాలదు. ఆంధ్రవ్యాకరణమును సంస్కృతమున రచియించుటవలనఁ గలుగు ననర్థమిది.

(9) నన్నయకుఁ బూర్వము తెనుగు కవిత్వము లేకపోలేదు. పెద్ద తెనుఁగు గ్రంథమింతవఱకును నన్నయకుఁ బూర్వపుది మనకు లభింపకున్నను, లభ్యములగు పద్యముల భాష కావ్యోపయోగియగు భాషయేకాని వేఱు కాదు. నన్నయభారత భాషకును నానాఁటి శాసనస్థమగు వ్యావహారికభాష కును నెక్కువ భేదము కానరాదు.

(10) ఆంధ్రశబ్దచింతామణికిఁ బూర్వము వ్యాకరణము లుండెడి వనుట కందలి 'అన్యవ్యాకరణ, కేచిత్, విదుః, ఇష్యతే,' మొదలగు పదములు చెప్పక చెప్పుచున్నవి.

పై దానినిబట్టి నన్నయ తెనుఁగునఁ బ్రథమకవికాఁడు; అతఁడాంధ్ర శబ్దచింతామణిని రచించియుండఁడు; రచించియుండినచోఁ దాను సుప్రసిద్ధముగ

చేసిన ప్రయోగములను సాధించుటకు సూత్రములను రచింపక, తాను చేయని ప్రయోగములకు రచించుట యస్వాభావికము. అతనికి శబ్దశాసన బిరుదము వేఱు కారణమునఁ గలిగియుండును. ఆంధ్రశబ్దచింతామణి ప్రథమాంధ్ర వ్యాకరణమును గాదు, అను విషయములు స్పష్టపడుచున్నవి.

## ఆంధ్రశబ్ద చింతామణి

### టీక.

### సంజ్ఞాపరిచ్ఛేదము.

1. విశ్వశ్రేయః కావ్యమ్.

కావ్యము విశ్వమునకు శ్రేయస్సునుగలిగించుట ప్రయోజనముగాఁ గలది; తత్కర్తకును పఠితకును శ్రోతకును నానందమును గలిగించి తన్మూలముగ శ్రేయమును గలిగించునని యభిప్రాయము.

2. త దదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ.

అది (కావ్యము) దోషములు లేనట్టియు, నలంకారములతోఁ గూడినట్టియు శబ్దము, అర్థము ననువానితోఁ గూడియుండును.

3. సా వాగ్యా రసవృత్తిః.

ఏది రసమే వృత్తిగాఁ గలదియగునో యది వాక్కనఁబడును. (కావ్యభాషకు రసమే ప్రధానము; ఆనందము ప్రధానోద్దేశముగాఁగల వ్యావహారిక భాషకును రసము ప్రధానమే.)

4. సాధ్యో హి రసో యథాతథం కవిభిః

రసము కవులచేత వారివారి నేర్పునుబట్టి సాధింపఁ దగినది గదా.

5. స్వస్థాన వేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధ ధియః।
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ.

రసమునందు లోభము నందిన బుద్ధిగలవారు తమ దేశమును, తమ వేషమును, తమభాషను బ్రేమించినవారై, ఇతర కావ్యములనువిడిచి, (సంస్కృతకావ్యములనేకాక) వైకృతకావ్యములను గూడ (అనఁగా ఆంధ్రకావ్యములవంటి ప్రాకృతకావ్యములను) గౌరవింతురు.

6. సిద్ధి ర్లోకా ద్దృశ్యా.

(శబ్ద) సిద్ధి లోకమువలనఁ దెలియఁదగినది. (అనఁగా లోకవ్యవహారమువలననే శబ్దస్వరూపమును దెలిసికొనవలెను.)

7. లోకో౽నన్యాదృశశ్చ నిత్యశ్చ.

(శబ్ద) లోకము ప్రత్యేకస్వరూపముగలది; అది (ప్రవాహరూపమున) నిత్యమైనది కూడను.

8. సంస్కారార్థో నియమః.

వ్యాకరణమువలన చేయఁబడిన నియమము సంస్కారము ప్రయోజనముగాఁ గలది; అనగా 'ఇది ప్రకృతి, ఇది ప్రత్యయము' అని విడఁదీసి నిరూపించుటయే ప్రయోజనముగాఁ గలది.

9. అనియమా ద్గ్రామ్యం హి.

నియమము లేకపోవుటచే గ్రామ్యమగును గదా. సరియగు ప్రకృతి ప్రత్యయ సంయోజనములేని శబ్దము గ్రామ్యము. ఉదా. ప్రభ్వీణి, దాతృఁడు = దాత; తొమ్మంద్రుగురు, అందునకు; మొద.

10. య త్త్వపభ్రంశః.

ఏది యపభ్రంశమో (యది గ్రామ్యము). శబ్దస్వరూపము స్పష్టార్థ ప్రతిపాదకము గానిచో నపభ్రంశము.

11. శాస్త్రమపౌరుషమాద్యం ప్రాయికనిత్య ప్రయోగలక్ష్మైతత్
దృశ్యే మతిస్థవిరం య జ్ఞత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః.

ఈశాస్త్రమును (ఆంధ్రశబ్దచింతామణిని) ఏపురుషుఁడును (అనఁగా నన్నయభట్టుగాని మఱెవ్వరుఁగాని) రచింపలేదు; ఇది మొట్టమొదటిది; నిత్యముగా నిలుచునట్టి యనేక ప్రయోగములే దీనికిగుఱుతు; ఇదిచాలప్రాచీనమైనదిగాఁ జూడదగినది. దీనిని తెలిసికొని ప్రయోగించినశబ్దము ఋషిప్రోక్తమువలె శిరసావహింపఁదగినది (లేదా, ఆర్షప్రయోగమువలె క్వాచిత్కముగ గావ్యములందు ప్రయోగింపఁదగినది.)

12. ఆద్యః ప్రకృతి శ్చాద్యే.

(ఈ యాంధ్రభాషకు) సంస్కృతమును ప్రాకృతమును మూలములు.

13. ఏషా తయో ర్భవే ద్వికృతిః.

ఇది (ఈ యాంధ్రభాష) యా రెండిటికిని వికృతియగుచున్నది; (ఆంధ్రభాష సంస్కృతప్రాకృత భాషలకు వికారము; తజ్జన్యము.)

14. కేవలతయానుసర్ప త్యుభే చ యేయం యథా తథం భాషా.

ఈ భాష యేది గలదో (ఆంధ్రభాష) యా రెండిటిని స్వతంత్రముగ తనకుఁగల ప్రత్యేక వైకృత లక్షణములతో ననుసరించుచున్నది.

15. ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః.

సంస్కృతమునకు వర్ణము లేఁబది. (వర్ణశబ్దమిందు ధ్వనికిఁ బర్యాయపదముగ వాడఁబడినది.)

16. ప్రకృతేస్తు తే దశోనా స్యుః.

ప్రాకృతమునకన్ననో యవి (ఆ వర్ణములు) పదితక్కువ యగుచున్నవి; (అనఁగా నలువది)

17. షట్త్రింశ దత్ర తే.

అవి యిందు (ఆంధ్రభాషయందు) ముప్పదియాఱు. (దీనికి 'సప్తత్రింశదిహ' = ఇచ్చట (నవి) ముప్పదియేడు, అను పాఠాంతరము గలదు.)

18. అన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్.

ఇతరములును (ఈ ముప్పదియాఱు-లేక ముప్పదియేడు-కాక తక్కిన, సంస్కృతప్రాకృతములందలి వర్ణములును) నాయా (తత్సమ) శబ్దములతోఁ గూడి (యాంధ్రమున)ఁ బ్రవేశించుచున్నవి.

19. ద్వివిధా దుదిదేదోతోఽచౌ వక్రితమా చ తావప్యనుస్వారా.

రెండు విధములగు (హ్రస్వము, దీర్ఘము నగు) అ, ఉ, ఇ, ఎ, ఒ, లును వక్రతమము (ఐ, ఔ)లును (పూర్ణము, అర్ధము నను) రెండనుస్వారములును అచ్చులు.

20. క గ చ జ యుగ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హా ళం తు హల్వర్గః.

క, గ, దంత్యములగు చ,జలు, తాలవ్యములగు చ, జలు; ట,డ,ణ; త, ద,న;ప,బ, మ య,ర,ల,వ; స,హ,ళ, అను వర్ణసమూహము హల్వర్గము. (దీనికి 'కగ,చజయుగ, టడణ, తదన, పబమ, య,ర యుగ, ల, వ, స, హాళ్చ హలః' అను పాఠాంతరము గలదు. ఇందు రేఫమును శకటరేఫమును బ్రత్యేకముగఁ బరిగణితము లయినవి; శవర్ణము బ్రత్యేకముగఁ బఠింపఁబడలేదు.)

21. సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధ భేదతో ద్వివిధః.

సిద్ధమును సాధ్యమును నగు ననుస్వారము పూర్ణము, అర్ధము, నను భేదములచే రెండు విధములు; (అనఁగా సిద్ధపూర్ణము, సాధ్యపూర్ణము; సిద్ధార్ధము సాధ్యార్ధము, అని నాలుగు విధము లగును.)

22. హ్రస్వా త్పూర్ణోఽపి భవేత్.

హ్రస్వవర్ణముకంటెఁ బరమందున్న యర్థానుస్వారము పూర్ణానుస్వారము కూడ నగును. కడంక, కడంక్క; అరంటి, అరంట్టి; మొద.

23. దీర్ఘా చ్చేత్ ఖణ్డ ఏవ స జ్ఞేయః.

అది (అర్ధానుస్వారము) దీర్ఘముకంటెఁ బరమైయున్నయెడల ఖండానుస్వారమనియే తెలిసికొనవలెను. (వాండు, మీందు, ఆంకలి, పోంక, వేండ,

మొదలగువానిలోని యనుస్వారము ఖండానుస్వారముగానే యుండునుగాని పూర్ణానుస్వారము కానేరదు. (* దీర్ఘముమీఁది యనుస్వారము పూర్ణానుస్వారమే యగునేమో యని తోఁచుచున్నది.)

24. అద్ యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః.

భూతకాలికార్థమును దెలిపునట్టియు (కనియెన్, వినియెన్, పోయెన్), పదాది నున్నట్టియు (యెవఁడు, యేమి, యెప్పుడు, యెక్కడ, యెంత, యితఁడు, యిప్పుడు, యిక్కడ, యింత, యిల్లు,) యకారముతప్ప తక్కిన యకారము లత్వవిశిష్టములుగానే యుండును.

* ఈ సూత్రము చాల వివాదగ్రస్తమయినది. (1)ఇందలి 'క్రియాసు' అనునది భూతార్థద్యోతినం, ఆద్యగం, అను రెంటికిని నన్వయించునా ? అట్లయినచో 'ఆద్యగం' అనునది 'యేఁగెను, యిచ్చెను' మొదలగు క్రియారూపములను దెలుపును. 'క్రియాసు' అనునది 'భూతార్థద్యోతినం' అనుదానితో మాత్ర మన్వయించినయెడల కొన్ని దేశ్యపదముల యాదిని అద్వ్యతిరిక్తములగు నచ్చులతోఁగూడిన యకార ముండునని ధ్వనించుచున్నది. అప్పుడు, 'యానాది, యాడ = ఎక్కడ, యిప్పుడు, యిల్లు, యెప్పుడు, యేమి' యను రూపము లుండునను నర్థము తేలుచున్నది. ఒత్వముతోఁగూడిన 'యొక్క' అను విభక్తి ప్రత్యయమును నీవర్గములోఁ జేరును. 'నన్నయకాలమున' నిట్లద్వ్యతిరిక్తములగు నచ్చులతోఁగూడిన యకారమాదియందుగలపదములుండెననుటకుఁ బ్రమాణము క్వాచిత్కముగఁ గానవచ్చుచున్నది. దక్షిణ ఇండియా శాసనములసంపుటము IV. లో 1009 సంఖ్యగల శాసనమున 'లోపుగా యిల్లువట్టు' అని యొక్కప్రయోగము కాన్పించుచున్నది. ఇట్టివానిని నిషేధించుటకే యీసూత్రము పుట్టియుండును. కాని, 'లోపుగా యిల్లువట్టు' అనుదానిని బట్టి 'ఇల్లు' యకారాది యని నిర్ణయింప వీలులేదు. 'కా' అనునది కళగా నుచ్చరింపఁబడుటచేత యడాగమము వచ్చియుండవచ్చును.

(3) 'ఆద్యగం' అనుదానికి పదాదినుండు 'ఎ' త్వముతోఁగూడిన యకారము మాత్రమని యందఱు వ్యాఖ్యాతలును వ్రాసిరి. కాని, యది ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ల కన్నిటికిని జెల్లును: యాడ, యిల్లు, యీాడు, యెప్పుడు, యేమి, యొక్క.

(4) ఈ సూత్రము దేశ్యశబ్దములకు మాత్రము వర్తించునని యెట్టి సూచనయులేదు. కావున, చింతామణిని నన్నయయే రచియించియుండిన పక్షమున నాతని కాలమునను నేటి వ్యవహారమునందువలె 'యెముఁడు, యెమున, యెత్తి,' మొదలగు శబ్దములు నుండెనని చెప్పవలసియుండును. 'సర్వ

త్రాఙ్వాత్కార్యం జ్ఞేయం' అను రాజోవు సూత్రమువలన 'వాఁడెముఁడు, అదె మున, ఇతఁడెతి' మొదలగు సంధులును చింతామణి కిష్టము లగును.

(౫) ఈ సూత్రము 'పోయెదన్, పోయెదున్, పోయెడిన్' మొదలయిన తద్ధర్మార్థక క్రియలలోని 'యె' వర్ణమునకు గతిని కల్పించుచున్నది. కావున, 'అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినా సర్వః' అను పాఠాంతర మే సరియైనదని చెప్పవలసియుండును. ఇందువలన నన్నయకాలమున వికృతి పదముల మొదల నచ్చులకు యకారముతోఁడి యుచ్చారణముండెడిదను నప్రా మాణిక సిద్ధాంతమునకుఁ దావులేకుండుటయేకాక, తద్ధర్మార్థక క్రియలయం దలి యెత్వమునకును గతి కలుగును. కన్నడమున 'యారు' అను రూపమున్నది గావునఁ దెనుఁగున నన్నయకాలమునను 'యెవరు' అను రూపమున్నదని వాదించుటయు సరికాదు. కన్నడమున 'యారు' నవీనరూపము; అట్లే తెనుఁ గునను 'యెవరు' అర్వాచీనరూపము. నన్నయకాలమున నట్టి రూపము లుండె ననుటకుఁ బ్రమాణము దొరకువఱకును నీవిషయమై యెట్టి సిద్ధాంతమును జేయ వీలులేదు. చింతామణికర్త నన్నయయే యని స్థిరపఱుచుట కాతని కాలమున పదాదిని యెకారముండుననుటకు చింతామణిసూత్రమునే యుదా హరించుట తగదు.

25. యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతిపరం ప్రాణమ్.

అచ్చుకంటె నచ్చుపరమగునపుడు గలుగు యశ్రుతి నార్యులు లఘు యకారమని (నొక్కి) చెప్పుచున్నారు. (ఈ సూత్రమున 'ప్రవదన్తి' 'ప్ర' యను నుపసర్గము గణముకొఱకు చేర్పఁబడినది.)

26. లఘువో ఽ లఘుశ్చేతి ద్వేధాన్తస్థాన్ విదన్తి శాస్తారః.

శాస్త్రమును వ్రాసినవా రంతస్థములను (య, ర, ల, వ, లను) లఘు వులనియు నలఘువులనియు రెండు విధములుగాఁ దెలిసికొనుచున్నారు.

27. అన్యేఽన్య వ్యాకరణస్పష్టాః.

ఇందు (రేఫముగాక) యితరము లితర వ్యాకరణములందు స్పష్టము చేయఁబడియున్నవి. ('వ్యోర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య' అను పాణినీయ సూత్రమువలన య, వ, లకు లఘ్వలఘుభేదముచే ద్వైవిధ్యము స్పష్టము, అను నహజోబలుని వాక్యము సరికాదు. ఇందువలన శాకటా యనుని మతమున య, వ, లకు లఘుప్రయత్నతరత్వ మున్నదనియే తెలియుచున్నది గాని, య, వ లకుఁ గొన్నియెడల గురూచ్చారణమును గొన్నియెడల లఘూచ్చారణమును నుండునని స్పష్టముగా లేదు. 'లస్యద్వైవి విధ్యం 'లోళ' ఇతి వాల్మీకి సూత్రే స్ఫుటమ్' అను నహజోబలుని వాక్యమును

ససంగతమే. లకారమునకుఁ బ్రాకృతమున శకారము గలుగునని యీ సూత్రము బోధించుచున్నది. కాని,యది లకారపు గురులఘూచ్చారణములను బోధింపలేదు. కావున, 'అన్యవ్యాకరణ' శబ్దము సంస్కృత ప్రాకృత వ్యాకరణములకుఁ గాక యాంధ్రవ్యాకరణములకు మాత్రము వర్తించునని యనుకొనవలెను.

28. రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః.

రకార మన్ననో యిచట (ఆంధ్రమున) రెండు విధములుగ గ్రహింపఁబడుచున్నది. రకారము సాధు రేఫమనియు శకటరేఫమనియు రెండు విధములనుట కంటె ర, ఱ లను ప్రత్యేకాక్షరములుగఁ బరిగణించుటయే సరి. రెండిటికిని ధ్వనిపుట్టు స్థానము వేఱు, ప్రయత్నము వేఱు; ఆ ధ్వనులకు సంకేతములగు వర్ణముల స్వరూపమును వేఱు.

29. నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనామ్.

లఘ్వలఘు భేదములుగల (రేఫముగాని) యితరములకు వైధర్మ్యము లేదు. (అనఁగా పద్యములలో యతి ప్రాసస్థానములందు ఆయా ధ్వనుల లఘ్వలఘూచ్చారణములకు మైత్రి గలదు.)

30. రయోస్తు నిత్యం స్యాత్.

రేఫ శకట రేఫముల కెల్లప్పుడును (వైధర్మ్యము) గలదు. ప్రాసస్థానమందును యతిస్థానమందును వానికి మైత్రి లేదు.)—ఈ నిషేధ సూత్రము రేఫ శకటరేఫలకు యతి ప్రాసస్థానములందు కవులు మైత్రిని గల్పించిన యనంతరము పుట్టి యుండవలెను. పదుమూఁడవ శతాబ్దము వఱకును దెనుఁగు కవులు రేఫ శకటరేఫ సాంకర్యమును జేయలేదు. శాసనములందును జనులకు శకటరేఫ జ్ఞానము పదునాల్గవ శతాబ్దమువఱకును నుండెడిదని స్పష్టపడుచున్నది.

31. అద్దన్త్యా స్తాలవ్యా శ్చు ర్వక్రాస్స్యు ర్మిథః సవర్ణాశ్చ.

(సంస్కృత చు-ప్రత్యాహారము చ, ఛ, జ, ఝ, ఞ లకుసంజ్ఞ; తెనుఁగున చ, జ, లకు మాత్ర మది నిలుచును.) దంత్యములైన చ, జలు హ్రస్వ-అకారముతోఁ గూడి యుండును; తాలవ్యములగు చజలు ఎ ఏ ఒ ఓకారములతోఁ గూడియుండును. ఇవి పరస్పరము సవర్ణములు; అనఁగా వీనికి యతి ప్రాసస్థానములందు మైత్రి గలదు. -అత్ అని తపరకరణముఁ జేయుట చేతను, వక్రమని ప్రత్యేకముగ ఎ, ఏ,ఒ,ఓ లను మాత్రము చెప్పుటచేతను పై రీతిగ నర్థము చేయవలసి వచ్చెను. కాని, అ,ఆ, ఉ,ఊ,ఒ,ఓ, ఐ,ఔ లతోఁ గూడిన తెనుఁగు చ, జ, లు దంత్యములనియు, ఇ, ఈ, ఎ, ఏలం గూడినవి తాలవ్యము లనియుఁ జెప్పవలెను. ఒ, ఓ, లతోఁగూడిన చ జలును దాలవ్యములగునను నపార్థ మీ సూత్రమునకుఁ గలుగుచున్నది.

32. వికృతి పదాదౌ ప్రథమాన్తస్థ తృతీయానునాసికౌ న స్తః.

తెనుఁగు పదముల మొదల యకారమును, ణకారమును నుండవు.

33. క్వచిదపి న స్త ఉదూతౌ దన్త్యోష్ఠ భవస్య వికృతి శబ్దాదౌ.

ఒకప్పుడు తెనుఁగు పదముల మొదల వకారముపై ఉ, ఊ లుండవు.) పై రెండు సూత్రములును బ్రక్షిప్తములని కొందఱి యభిప్రాయము. కాని, 'అద్యః క్రియాను' అను సూత్రము చింతామణిలోని దైనయెడల నిదియు నందలిదే యని చెప్పుట కాక్షేపణ ముండఁగూడదు. వీనితోఁబాటు 'ళ, థ' లాది యందుగల తెనుఁగు పదములు నుండవనియుఁ జెప్పవలసి యుండును.

34. ప్రాతిపదికం హి నామ.

ప్రాతిపదికమే నామము గదా. 'హి' అనునది పాద పూరణార్థము. ప్రాతిపదికమునకు 'నామ' మను సంజ్ఞను చింతామణికర్త యేర్పాటు చేసినాఁడు.

35. ప్రత్యయ ఇహ వర్ణకః.

ఇచ్చట (ఈ యాంధ్రశబ్దచింతామణిలో ప్రత్యయమునకు వర్ణకమను సంజ్ఞ) చేయఁబడినది.

36. క్రియా ధాతుః.

ధాతువునకు 'క్రియ' అను సంజ్ఞగలదు. (ఈ సంజ్ఞ గూడ చింతామణి కర్త యేర్పఱిచినదే.)

37. ప్రాణా స్సమాసతోఽచః.

పై 18-వ సూత్రమున (ద్వివిధాదుది దేవోత్థో, మొద.) వివరింపఁబడిన వర్ణములనుగూడ ప్రాణ శబ్దమునలన గ్రహింపవలెను. సంస్కృతమున నచ్ - ప్రత్యాహారమునకు నీ సూత్రమందలి ప్రాణముల పరిగణనమునకును సరిపోకయున్నను, సంస్కృత ప్రత్యాహారమగు 'అచ్' సంజ్ఞనే తెనుఁగునందలి ప్రాణములకును వ్యవహరించుకొనవలసినదని చింతామణికారుఁడు తెలుపుచున్నాఁడు.

38. బిన్దు రనుస్వారః.

ఈ యాంధ్రశబ్దచింతామణియందు అనుస్వారమునకు బిందువను సంజ్ఞ యేర్పఱుపఁబడినది. బిందువు వర్ణస్వరూపమును అనుస్వారము ధ్వని స్వరూపమును దెలుపునవైనను బిందువు, అనుస్వారము, అను పదములు బర్యాయపదములుగా నీగ్రంథమున వాడఁబడునని యీ సూత్రమున సంకేతము చేయఁబడినది.

'కలపమునొందకువే' (ఉ. హరి. V. 87); అంత మదింపకువే (కాశీ. III 195); ఇట్టి నిషేధార్థక ప్రార్థనార్థకరూపములు కొన్ని కావ్యములందు కానవచ్చుచున్నవి. ఇట్టి రూపములు మాండలికములు. గతిణాదిని పుట్టిన పాటలలో తఱచుగ నీరూపములు కాన్పించును.

'విడెముకాయవే, నను విడనాడకువే' మొద.

"ఆదేతౌ ప్రశ్నలక్షణౌ భవతః" అను నాంధ్రశబ్దచింతామణి సూత్రము చొప్పున 'తెలియఁడే, తెలియఁడా' అను రెండు రూపములును ప్రశ్నార్థకములు. నన్నయకృత భారతభాగమున నీరెండు రూపములును లేవు. తరువాతి కవులలో 'ఏ' దంతములగు ప్రశ్నార్థకక్రియలు కానవచ్చుచున్నవి. ఆదంత ప్రశ్నార్థకములు మధ్యయుగము నాఁటనుండియు కనఁబడుచున్నవి.— తెలియఁడా (కాశీ. III. 101); పుచ్చుకొనవా = పుచ్చుకొన్నావు కావా (కాశీ. IV. 104); తానేమి బిడ్డలఁగానదా = కనలేదా (కాశీ. IV. 266).

ప్రశ్నార్థమున 'ఏఁడీ, ఏఁడి, ఏరీ, ఏరి' అనురూపములు మధ్యయుగమునుండియుఁ గానవచ్చుచున్నవి: ఏరి (రామాభ్యు. VII. 192).

'కాకేమి' అనుదానికి 'తప్పక యగును' అనునర్థము మొదటనుండియు నున్నది. మధ్యయుగమునుండియు కవులారూపమును 'కానిమ్ము' అనునర్థమునను వాడిరి. —ఐనదయ్యెడుఁ గాకేమి (పాండు. IV. 167).

'ఈవుత, కావుత' మొదలగు ఆశీరూపములు రెండువచనములందును వచ్చును. బహువచనమునఁ బూర్వాంధ్రమందు ప్రయోగములు మృగ్యములు.-'ఈవుత సుపర్వులందఱు' (విష్ణుపు. V. 350).

శాపార్థమున 'తనబుద్ధికాటఁ గలియ' (హరవి. III. 99); వలరాయా ...నీతలరాయా (యయా. పు. 74); నీవాంఛపాడుగాను (హరవి. III. 22)- అను నిట్టి తుమున్నర్థక క్రియారూపములు మధ్యయుగముననుండియుఁ గావ్యములందును వ్యవహారమునందును గాన్పించుచున్నవి.

ఈ క్రిందిరూపములు నేఁటి వ్యవహారమున నంతగాఁ గానరావు.-తీఁడిరించె (కాశీ. III. 231); పాపములను డంచెను (కాశీ. III. 108); ఉఱఁడు బృహస్పతి మీఁదెడ (ఉ. హరి. III 101); చూ. ఉఱఁడు సురేంద్రునైన; తలంత్రు (భీమ. III. 34); ఎంతటికీనోపదు = సమర్థముకాదు (పాండు. III. 42); తిగిచెన్=తీసెన్ (పాండు. III. 30); ఉక్కెన్ (హరవి. VI. 38). ఈ పదము శ. ర. లోలేదు.-తివిసెన్ (వరాహ.XII. 7); గోమేధయజ్ఞ ఫలంబు ప్రాపింతురు వరాహ. V. 69- 'వారికి ఫలంబు ప్రాపించును' అని 'ప్రాపించు' అను ధాతువును సకర్మకముగా నేఁడు వాడవచ్చునా ?- వినను=నేను వినలేదు (వరాహ. III .138); ఇంకనెయ్యది పనిచెదవు పనుపుము (హరి. పూ. VII.

169- 'పనిచెదవ్వొ' అని నేఁటిరూపము); ఏమిసెప్పంగఁగలదు=చెప్పఁగనేమి గలదు (కాశీ. III. 107); ఒక్క విస్మయంబు వినఁగల దవధరింపుము= వినుటకుఁగలదు (ఉ. హ. III. 108); ఏమనంగ నేర్చువాఁడను (కాశీ. IV. 113); ఆలింగనము సేయ నగపడరాదు (ప్రభులిం. I. 39); అల్లమ మాయల కగపడరాదు (ప్రభులిం. II. పు. 45); శాస్త్రముల కగపడువాఁడు గాఁడు (ప్రభులిం. పు. 49);ననుబోఁటివారికెన్నటి కగ్గమగును (ప్రభులిం. II. పు. 87); నన్నుఁ బనిచిపనిగొనుము (వరాహ. VII. 90); పనివినె=పోయెను (వరాహ.VI. 77); మీమామలు వుత్తెంచినం బనివింటిని= ఆజ్ఞననుసరించితిని (వరాహ. V. 25); మెలఁపుకొనుండు = మెలఁగించు కొనుండు (ప్రభులిం. పు. 105); నీవుగుణశీలురఁ దెచ్చెదుసుమ్మ = తేవలదు; ఉత్తరాంధ్రము 'తెచ్చేవు సుమా' విష్ణుపు. IV. 112); తోవఁగలము = తోయఁ గలము (వరాహ. IV. 75); మోవలేను = మోయలేను (వరాహ.VIII. 57); వినుపింతు (కవిక. I. 76) పిలుపించెన్ (కళా. II. 22); చూచెదుగాని = చూతువుగాని (ప్రభా. III. 134); ఏమి పనికినై తలంచితివి=ఎందుకు (వరాహ. V. 40). ఏమి గార్యంబుఁ దలంచి విచ్చేసితిరి (వరాహ. V. 40, ఎందుకు). పవరించె = పవ్వళించె (వరాహ. III. 157); వెఱపించుకొనదె=తన్నుజూచి భయపడునట్లు చేయదా (-వరాహ. VI. 31); వెదకం బోవలదయ్యె (కవిక. II. 100); రాయనేర్తురె (ఉ. హరి. I.7); ఎఱసె; ఏఁచె (ఉ. హరి. I. 8); చాలెన్ (ఉ. హరి. I. 14, సమర్థుఁడయ్యెను); చాలవేన్ = సమర్థుఁడవు కాకపోతే (ఉ. హరి. I. 17); తిరుగఁబడఁ జొచ్చె = మఱలఁ జొచ్చెను (ఉ. హరి. I. 19) (నేఁటి వాడుక=ఎదిరించు); సంకుల సమరంబు చెల్లు సమయంబున (ఉ. హరి. I. 27); ఎఱుంగరాదు(కాశీ. II. 43); కూడదంతఃపూజ గురుకృపలేక = చేకూరదు (ప్రభులిం. పు. 137).

ఈ క్రింది రూపములు మధ్యయుగమునాఁటనుండియు వచ్చుచున్నవి:-

ఈ రక్కసు నెట్లుసేసెదనో చూడుండు (హరి. పూ. VIII. 192); నిజ
పాపంబ కాదు, ఉభయ వంశముల పాపములుఁ బోఁగొట్టునది (కళా. IV.
138). చూ. నేఁటివ్యవహారము 'ఒక్క నిన్నే కాదు, ఈ లోకములో నెవ్వనినైనఁ
గెలువఁగలను; ఇచట 'కాదు' న కన్వయమేమి ? తెలిసికొనుము (ఉ. హరి. I.
10) పూర్వాంధ్రము 'ఎఱిఁగికొనుము') వారువీరనక యందఱు (కళా. I. 126.
'అనక' కన్వయమేమి ?); అందితో=అందితివొ (కళా. I. 143); గయ్యాళించు
(కళా. III. 223); కాఁబోలు=పూర్వాంధ్రము 'కావలయు' (కళా. IV. 186);
నగిపించెన్ (కళా. V. 60); ఇవ్వనిత నీకేమియగును (కళా. V. 114); పోల్చె

(కళా. I. 194, అకర్మకక్రియ); పోమెఁబో (కళా. II. 79); చూడఁబట్టెడె (హరి. పూ. VIII. పు. 203); పొందుము విజయంబు (వరాహ. III. 27- పూర్వాంధ్రము 'విజయంబునం బొందుము'); నిండించె (వరాహ. II. 163- పూర్వాంధ్రము 'నించె'); వేసికొంటి (వరాహ. VIII. 25); నేఁడెల్ల వెళ్లఁ బడుదుము (వరాహ. VII. 35); తిరిగినవచ్చినది = మఱలివచ్చినది (వరాహ. V. 167); అడ్డవెట్టరాదు (వరాహ. II. 15, పూర్వాంధ్రము 'అడ్డవెట్టఁ గాదు = సాధ్యముకాదు); దాఁటరాదు = దాఁట సాధ్యముకాదు (వరాహ. IV. 123; పూర్వాంధ్రము, దాఁటఁగాదు); కావంబోలును (మను. III. 47. పూర్వాంధ్రము, కాచెంగావలయు); ఏను దుర్వ్యసనంబున మృగయా విహారంబునకుఁ గడంగినదిలేదు (శకుం. పరి. II. పు. 26); నా కీపుస్తకములు అక్కఱలేదు; ఈ కుండ నాలుగుకుంచాలు పట్టుతుంది. ఈ పని నాలుగురోజులు పడుతుంది; ఇట్టి ప్రయోగములు శకుంతలాపరిణయమునఁ గలవు;—మల్లెను తుమ్మెద (సత్య. కృ. సం. I. పు. 27); మోసెన్ (పాండు. III. 21-పూర్వాంధ్రము 'మోచెన్'); మొల్వదు (పాండు. V. 193); సూర్యుఁ డెండఁగాయును, చంద్రుఁడు వెన్నెలఁగాయును (విష్ణుపు. III. 94-'కాయు' సకర్మకముగా ప్రయోగము); వెన్నెలల్ గాయఁదొడంగె (కవిక. III. 100-అకర్మక ప్రయోగము); ఎల్లుండికిని బ్రాణములు గానిపింతున్ (విష్ణుపు. VII. 117 - 'కొను' ధాతువునకుఁ బ్రేరణార్థకరూపము); వర్షములు వెలిచె (కవిక. II. 60 మాండలికము); ధీశాలికాక కాదు (సమీ. VII. 14); మీవంటి దాంపత్యంబు మాకుఁ గలుగ వరంబు దయసేయుండు=మీ దాంపత్యము వంటిది (వరాహ. III. 108); తల్తురు (కళా. II. 101).

'అగు' ధాతువు.

పూర్వాంధ్రమున 'కాక' అని ప్రయోగించుచోట్ల నుత్తరాంధ్రమున 'కాని' అనుపదము వాడుకలోనికి వచ్చినది. ఉత్తరాంధ్రకవులు 'కాక', 'కాని' అను రెండురూపములను దమగ్రంథములందు వాడిరి.

అంజెదవుగాక (ఉ. హరి. I. 75); చేసెఁగావలయుఁగాక (ప్రభా. III. 160); ఎక్కుడేకాక (కళా. I. 179); మాటలాడింతముగాక (కళా. V. 7); నీవారిని నీవు సన్నుతి గావింపవుగాని (ఉ. రా. పు. 97); ఇసుక యెన్న వచ్చుఁగాని మాయలీలలెఱుఁగరాదు (వరాహ. VII. 54); ఇతండకాని (కళా. II. 74); వెంగళరాయఁ డెంతరణపీరుఁడో కాని (రంగారా. III. 206); మ్రొక్కెదఁగాని (దశావ. పు. 155); నిలుచునో యేమోకాని (కళా. I. 157); ఏగతినిబట్టతలలు మోకాళ్లు ముళ్లువెట్టఁగలదో కాని (కళా. IV. 75); లేఁజిగురుకెప్పుడొక జిగిలేదుగాని (శుకచ. పు. 8,34); పలుకంగఁదగునె వే

మైనఁగాని (శంక. విజ. పు. 19); ఎవ్వఁడో కాని వీఁడు (విష్ణుపు. III. 285); మీ రారగింతురుగాని (పాండు. IV. 153); నీచరిత్రంబు వినికాని మోహంబు విడువరాదు (వరాహ. V. 68); చూచుకొందము గాని (భోజరా. IV. 185).

పూర్వాంధ్రమున 'కూడని' యనునర్థమున 'కాని'యని యనుచుండిరి; నేఁటి వాడుకలో 'రాని' అని యున్నది.

తలఁపఁగాని తలంపు = తలఁపరాని (హరవి. IV. 56).

కావున, కాన, అను పదములు 'అగు' ధాతువునుండి కలిగినవని యందురు. కాని, యెట్లు కలిగినవో తెలియదు. 'కృత్వా' అను సంస్కృత క్రియారూపము ప్రాకృతమున 'కాడూణ'అని యగును. అది తెనుఁగు నందలి 'కావున' వలెనే యుపయోగింపఁబడును. ప్రాకృతములోని 'కాడూణ' పదమే తెనుఁగున 'కావున' అను రూపమునఁ బ్రవేశించినదేమో. అదియే 'కాన' అను రూపమును బొందియుండును. వీనిలో 'కావున' ద్రుతప్రకృతికముగాను కళగానుగూడ నుపయోగింపఁబడుచున్నది. 'కాన' పూర్వాంధ్రమున కళ. 'కావునన్' ద్రుతాంతము గావునఁ 'గాన'ను గూడ దాని సామ్యమున ద్రుతాంతముగానే యర్వాచీనకవులు వాడిరి.

కావున (కళ) (కళా; I. 194; II. 63). కాన (కళ) (నిర్వ; IV. 42. పాండు. II. 228; IV. 96); - కానన్ (ద్రుతాంతము) (వరాహ. II. 146.) కానం జక్రాంకితమునఁ గార్యము గలదే (శంక. విజ. పు. 13).

'అగు' బంధుత్వమును గూడఁ దెలుపును: అయినవారి కాసులలోను, కానివారికి కంచాలలోను; అతడు నీకే మవుతాడు; వనితా ! వారు నీకేమి కావలయు ?

అయినన్ - అయినా: ఇవి ముందు చెప్పినదానికి విరుద్ధముగా చెప్పఁ బోవుదానిని సూచించును.

'అగు', 'అవు', 'అవును' - ఇవి యంగీకారార్థములుగూడ నగును. వీనిపై 'ర, రా' లు చేర్చిన నాశ్చర్యమును దెలుపును.

అవుఁగాక - ఇది చెప్పినదాని నంగీకరించుచు, దానికిఁగల యాక్షేపణ మును సూచించును. 'కానిమ్ము' అను నర్థమునను దీనికి వాడుక కలదు.

'కా' అనునది 'కాదా' అను నర్థమున గ్రంథములం దున్నది.

"అవుగా ! మీ రిట మున్ను గన్గొననితావు - ల్లేవుగా" (విజయ.)

ఇది నేఁడు మాండలికముగ వాడుకలో నున్నవి.

'కదా' అనురూపము 'కాదా' లోని తొలిస్వరమునకు హ్రస్వము కలుగుట వలనఁ గలిగినది.

'కాకేమి' అనునది పూర్వాంధ్రమున 'అయ్యేంగాకేమి', 'చేసెంగాకేమి' అను రీతిని సంపూర్ణక్రియలమీఁదనే ప్రయోగములందుఁ గానవచ్చుచున్నది. నేఁడు దానిని వ్యస్తముగా వాడుచున్నాము. 'ఎందుకుకాదు, అగుటలో సందేహ మేమున్నదని?' అని యర్థము.

కావున, కాన లకు నేఁటి వ్యవహారమున 'కాఁబట్టి' అని యున్నది, 'కాఁబోలు' అనుదానికి పూర్వాంధ్రమున 'అగుఁబోలు' ననియు రూప ముండెను. 'పోలు' ధాతు వితర ధాతువులమీఁదను బూర్వాంధ్రమునఁ జేరుచుండెను. చేయంబోలు, కొట్టంబోలు మొద. నేఁ డిట్టి వ్యవహారము లేదు.

కావుట, కావుత, కాత, కదరె మున్నగు 'నగు' ధాతుజములగు రూపములు నేఁటి వ్యవహారమునుండి లోపించినవి.

నేఁటి వ్యవహారమున 'కదరా' అనునది మహద్వాచకముల మీఁదను, 'కదే, కాదే' అనునవి మహతీవాచకముల మీఁదను వచ్చును. 'కదవే', 'పదవే' అనురూపములును మహత్యర్థమున వాడుకలో నున్నవి. "వస్తాను పదవే, వడ్డించమనవే."

---

# అనుబంధము. I.

వ్యవహారములోఁ జాలకాలము నుండియు నిలిచియున్నను, నేఁడు గ్రామ్యమని కొందఱచే నిరసింపఁబడుచున్న కొన్ని రూపములు శాసనము లందు విరివిగ వాడఁబడియున్నవి. అట్టి రూపములలోఁ గొన్ని గ్రంథముల లోనికిని బ్రవేశించినవి. పూర్వ వ్యవహారమునం దున్నట్లు శాసనముల వలనఁ దెలియవచ్చునట్టియు, గ్రంథస్థము లయినట్టియుఁ గొన్ని శబ్ద రూపము లీ క్రింద నీయఁబడినవి.

(1) ఇస్తిమి, చేస్తిమి, చేయింస్తిమి, రాజ్యంసేస్తుండి, విడిస్తిమి, సమర్పింస్తిమి, పాలింస్తాను, సేవసేస్తున్నాడు మొద.—

12-వ శతాబ్దము మొనమదలలోని నాలుగు శాసనములు, 14-వ శతాబ్దము బెజవాడలోని ఒక శాసనము.— శ్రీనాథునిచాటుధార (1435 సం॥); ప్రభులింగలీల (1520 సం॥); రామస్తవరాజము (1520 సం.)

(2) పెట్టింది, చేసింది మొద.—

13-వ శతాబ్దము శ్రీకాకుళములోని యొకశాసనము; ధూర్జటి రచించిన కాళహస్తీశ్వర శతకము, గౌరన రచించిన హరిశ్చంద్రోపాఖ్యానము.

(3) తోంటాను, మొద.—

11-వ శతాబ్దము బెజవాడలోని మూఁడు శాసనములు; 18-వ శతాబ్దపు నాలుగు శాసనములు; పదుమూఁడవ శతాబ్దపు రెండు శాసనములు; 14-వ శతాబ్దపు ఒకశాసనము;—ధూర్జటి రచించిన కాళహస్తీశ్వరశతకము (1550 సం.)

(4) రెండున్ను, మరిన్ని, వేయిన్నేనూరు, మొద.—

11-వ శతాబ్దము ద్రాక్షారామమందలి యొక శాసనము; 12-వ శతాబ్దము మొనమదలలోని యొక శాసనము; 13-వ శతాబ్దపు మూఁడు శాసనములు; 14-వ శతాబ్దపు 15 శాసనములు; 15-వ శతాబ్దపు 12 శాసనములు.—తిక్కన నిర్వచనోత్తరరామాయణము (1200 సం.)

(5) ఏంటాను, అనే, అనేటి, దనకా, కూడాను, ఎవ్వరు తప్పినాను; మొద.—

11-వ శతాబ్దము బెజవాడ 1 శాసనము; 12-వ శతాబ్దము, మొనమదల 1 శాసనము; 13-వ శతాబ్దము 2 శాసనములు; 14-వ శతాబ్దము

4 శాసనములు; 15-వ శతాబ్దము 23 శాసనములు.-శ్రీనాథుని హరవిలాసము (1435 సం.) వరాహపురాణము (1500 సం.)

(6) ఇరువై, ముప్పై, నలుభై, నలుభయి, ఏంభై, మొద.—

11-వ శతాబ్దము ద్రాక్షారామము 2 శాసనములు; 12-వ శతాబ్దము మొనమదల 6 శాసనములు; 13-వ శతాబ్దము 1 శాసనము; 14-వ శతాబ్దము 6 శాసనములు.—శ్రీనాథుని హరవిలాసము (1435 సం.)

(7) రెండో, మూండో, మొద.—

12-వ శతాబ్దము, ద్రాక్షారామము 1 శాసనము; 15-వ శతాబ్దము 4 శాసనములు.—కంసాలిరుద్రయ్య నిరంకుశోపాఖ్యానము (1620 సం.); అప్పకవి (1660 సం.)

(8) చేసుకొని, చేసుకొన్న, మొద.—

15-వ శతాబ్దము తిరుపతి 4 శాసనములు.—రంగరాట్ఛందస్సు (1790 సం.)

(9) నడవుక వచ్చేటందుకు, మొద.—

15-వ శతాబ్దము, హంపి 1 శాసనము.—పద్మపురాణము (1340 సం.); అనంతునిఛందస్సు (1430 సం.)

(10) అందరిచేత, ఇద్దరికి, నలుగురిలో, మొద.—

14-వ శతాబ్దము మొనమదల 1 శాసనము; 15-వ శతాబ్దము 2 శాసనములు.—శృంగారశాకుంతలము (1450 సం.)

(11) దేవున్ని, మొద.—

15-వ శతాబ్దము, తిరుపతి, 1 శాసనము;—రామస్తవరాజము. (1520 సం.)

(12) రాజుకు, ఇందుకు, తూర్పునకు, మొద.—

15-వ శతాబ్దము 7 శాసనములు.—అనంతుని ఛందస్సు (1430 సం.)

(13) కొమాళ్లు, మొద.—

15-వ శతాబ్దము, బెజవాడ, 1 శాసనము.—సారంగధరచరిత్రము (1630 సం.); హంసవింశతి (1800 సం.)

(14) అనుభవించుము, పాలించక, మొద.—

15-వ శతాబ్దము, తాడిపత్రి, 2 శాసనములు.—మడికిసింగన్న వాసిష్ఠ రామాయణము (1340 సం.); కళాపూర్ణోదయము (1570 సం.)

(15) వెనక, గనక, మొద.—

11-వ శతాబ్దము, బెజవాడ 1 శాసనము; 15-వ శతాబ్దము 4 శాసనములు.—అప్పకవి (1660 సం.)

(16) వల్ల—

15-వ శతాబ్దము, కొండవీడు, 1 శాసనము.—శ్రీనాథుని నైషధము (1435 సం.); మనుచరిత్రము (1530 సం.)

(17) వద్ద—

15-వ శతాబ్దము, బెజవాడ, 1 శాసనము. రంగనాథరామాయణము (1200 సం.); ప్రభావతీపరిణయము (1570 సం.); చిత్రభారతము (1600 సం.)

(18) కిందను—

15-వ శతాబ్దము, గుంటూరు, 3 శాసనములు.—

(19) సంకీర్తనశావ, పండితులచాత, మొద.—

15-వ శతాబ్దము, హంపి, 2 శాసనములు.

(20) యవ్వారు—

15-వ శతాబ్దము, తాడిపత్రి, 4 శాసనములు;—శృంగార శాకుంతలము (1450 సం.)

(21) పట్టణం, విశ్వనాథపట్నం—

13-వ శతాబ్దము, యెనమదల, 1 శాసనము.

(22) భంగారం, భావి, భావ, మొద.—

11-వ శతాబ్దము, ద్రాక్షారామము; 12-వ శతాబ్దము; శ్రీకాకుళము 2 శాసనములు; 14-వ శతాబ్దము, యెనమదల, 1 శాసనము; 15-వ శతాబ్దము, బెజవాడ, 4 శాసనములు.

(23) కరణీకం—

15-వ శతాబ్దము, హంపి, 1 శాసనము.

(24) వ్రేకటి, వృత్తరాన, మొద.—

16-వ శతాబ్దము, గుంటూరు, 2 శాసనములు.

(25) మామిడాడ, మొద.—

14-వ శతాబ్దము, యెనమదల, 2 శాసనములు.

(26) బ్రాహ్మలు—

12-వ శతాబ్దము; యెనమదల 1 శాసనము; 14-వ శతాబ్దము, బెజ వాడ 1 శాసనము; 15-వ శతాబ్దము, తిరుపతి, 1 శాసనము.—బసవ పురాణము (1320 సం.)

(27) బ్రంహ్మాత్య—

15-వ శతాబ్దము, గుంటూరు, 1- శాసనము.

(28) ప్రధాని—

11-వ శతాబ్దము, ద్రాక్షారామము 4 శాసనములు.



# ఆంధ్రభాషాచరిత్రము.

## రెండవ సంపుటము.

## సవరణలు

| పుట. | పంక్తి. | తప్పు. | సవరణ. |
|---|---|---|---|
| 800 | 24 | జ్యోత్స్న్యై | జ్యోత్స్నా |
| 807 | 23 | దరజాత | పదజాత |
| 841 | 2 | శాలురు | శాలులు |
| 843 | 25 | అరుహుఁడు | అరుహుఁడు |
| 848 | 1 | (కొమ్మ) | కమ్మ |
| 1053 | 6 | హణుమంతస్య | హణుమంతస్స |
| 1320 | 7 | కిట్లు | కట్లు |
| 1602 | 22 | గావున | గావునఁ |
| 1618 | 4 | ధ్వనులోః | ధ్వనుల్వోః |
| 1620 | 2 } | ... | ఈ పంక్తులను 1619 పుట తుదిని చదువుకొననలెను. |
| 1620 | 3 } | | |
| 1622 | [illegible] | వజన్త | అజన్త |
| 1645 | 26 | త్సుగ్ | త్సుయోః |
| 1649 | 10 | దేశ్యాద్యుష్మ | దేశ్యాస్మద్యుష్మ |
| 1675 | 12 | స్వార్థంచు | స్వార్థేంచు |
| 1676 | 19 | రాదు | రాదు. ప్రార్థనార్థక ము, ఘజ్ఞులపై వచ్చునని యెట్లయినఁ జెప్పికొనవలెను. |

# Andhra University Publications

## GENERAL

**No. 16. Man**—by Rabindranath Tagore. (Re. 1.)

## ECONOMICS AND POLITICS

**No. 1. The Beginnings of Local Taxation in the Madras Presidency—A study in Indian Financial Policy—1863-71** by M. Venkatarangaiya, M. A., Reader, History, Economics and Politics Department, Andhra University. (Rs. 2-4-0.)

**No. 4. The World Economic Depression—a Plea for Co-operation**—by Sir J. C. Coyajee, B. A., LL.B., formerly Professor, Department of History, Economics and Politics, Andhra University. (Re. 0-12-0.)

**No. 5. India and the League of Nations**—by Sir J. C. Coyajee. (Rs. 2-4-0.)

**No. 12. Federalism in Government**—by M. Venkatarangaiya, M.A. (Rs. 2.)

**No. 17. The Evolution of Political Ideas and Institutions since the Great Indian Mutiny**—by C. Y. Chintamani, Editor, 'Leader', Allahabad. (Rs. 2.)

## HISTORY

**No. 3. Buddhist Remains in Andhra and the History of Andhra between 225 and 610 A. D.**—by Dr. K. R Subramanian, M. A., Ph. D., Lecturer in History, Maharajah's College, Vizianagaram. (Rs. 2.)

## PHILOSOPHY

**No. 9. Andhra Mimamsa Nyaya Muktavali—A Treatise on Purva Mimamsa Darsana**—by K. Gopalakrishnamma, M A., L.T., Lecturer in Oriental Languages, Govt. Arts College, Rajahmundry. (In Telugu). (Re. 1-8-0.)

## SCIENCE

**No. 14. Viswarupamu** (In Telugu)—by K. Kondayya, M.Sc., Department of Chemistry, Hindu University, Benares. (Rs. 2.)

## SANSKRIT

**No. 6. Chitraprabha**—A Commentary on Haridikshita's **Laghusabdaratna**—by B. Hari Sastri—Edited with notes by Mahamahopadhyaya Tata Subbaraya Sastri, Maharajah's Sanskrit College, Vizianagaram. (Rs. 3.)

**No. 7. Sangameswarakrodum**—on Jagadisa's Siddhantalakshanam—by G. Sangameswara Sastri. (Re. 0-12-0.)

**Nos. 10 & 13. History of Sanskrit Literature—Parts I and II**—by M. Suryanarayana Sastri, Pandit, University College of Arts, Waltair. (In Telugu). (Each Part Rs. 2-4-0.)

## TELUGU

**No. 2. Lectures on Vemana**—by R. Anantakrishna Sarma, Lecturer, Maharajah's College, Mysore. (Re. 0-12-0.)

**No. 8. Kavithwathathwavicharamu**—by C. Ramalinga Reddy, M.A. (Cantab.), M.L.C., D. Litt., Vice-Chancellor, Andhra University. (Re. 0-12-0.)

**No. 11. A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Tanjore Palace Library**—Edited by P. P. S. Sastri, M.A., M.R.A.S. (Cantab), Professor, Presidency College and Curator, Govt. Oriental Manuscripts Library, Madras. (Re. 1-8-0.)

**No. 15. Vaiyakarana Parijatamu**—by V. Ch. Sitaramaswami Sastri, Pandit, University College of Arts, Waltair. (Rs. 3.)

**No. 18. History of Telugu Language** (In Two Volumes)—by C. Narayana Rao, M.A., L.T., Ph.D., Lecturer, C. D., College, Anantapur. (Each Volume Rs. 6.)

*Note—Copies of the above publications can be had either from the Registrar or from any leading book-sellers.*